

చెన్నపట్టణము, డిసంబరు ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము మార్గశీర్ష మాసము సంఖ్య ౧౨

# ధర్మపత్ని

దివాకర్ల వేంకటావధానిగారు

(కారెమపూఁడి యుద్ధరంగమున నేనుగూడ నుఱికెదనని తల్లి నొప్పించి యామె యానతిఁ గొని బాలచంద్రుఁడు భార్యను జూడ వచ్చెను. తమ్ము లందఱును దమ యగ్రజుఁడు వచ్చినపని మాట మఱచి యంతఃపురము నెంతకాలమునకు వదలి రాకపోవుట గుర్తించి పోటుమాటలచే నాతని నొప్పించిరి. బాలచంద్రుఁడును లోని కేఁగి తన చేతి కటారిని భార్యచేతి కందించెను. మాంచాలయుఁ జిఱునవ్వు నవ్వుచు నాతనితో నప్పుడు పల్కిన పల్కు లివి.)

అనుపమవీర్యసంయుతుఁడ వన్న యశంబు వహించినా వన
న్యనిరతసాహసక్రియ లనంతములై చెలువారఁ జేసి; సా
ఖ్యనియతి నోలలాడుటకుఁ గాలము ముం దిఁక లేదె, నాథ? వ
చ్చినపనిమాటయే మఱపుఁ జెందితి వింకను మాంద్య మేలొకో?

ముదుసలు లైన తండ్రులకు మోదముఁ గొల్పి రణంబునందు వా
రిడగు భరంబు మోయుట కరిందమ! జా గొనరించె దేల? ని

య్యదను గతింపఁజేసెడి ప్రయత్నము చేతులు కాలుపిమ్మటన్
వెదకుటవంటి దాకులకు; వేగమె లెమ్ము రణంబులోనికిన్.

కలకల నవ్వుచున్ ప్రణయగాథల శోధనఁజేయుచుండి ని
ర్మలముగ నుండఁగాఁ గవికుమారుఁడవై జనియించినావె? వా
రలు నొకకొంతమంది రణరంగముఁ జేరఁగఁ బ్రోత్సహించుపా
టల రచియింపుచుండిరి దృఢంబగు మాతృపదాబ్జభక్తిచే.

వీరపత్నినె నేనును, వెఱపు లేదు!-చేతి కొసఁగితి నా కీనిశాతహేతి
నీకు శ్రమ గల్గకుండ నిర్నిద్రశత్రు-జనవిదారణ మొనరింపఁ జాలుఁ గాని.

దైవవిధి తప్పివచ్చిన తరుణమేని-బురుషు లరిగినపిమ్మటఁ దరుణు లకట!
కత్తిగట్టుట ధర్మంబు గానఁ గొంత-సంశయముఁ గాంచుచుంటి నిశ్చయము సుమ్ము

తరుణిని బంపి పోరునకుఁ దాను సుఖంబుగ నింటియందు ని
బ్బరముగ నుండె నన్నఁ దలవంపు భరింపఁగనౌనె నీకు ను
ర్వర, మరియాద గాదు రణరంగమునం దబలావతంసముల్
వరలుట, మానహానియును వచ్చు విధిప్రతికూల మైనచో.

ఈమాన్యాధ్వరునందుఁ గాలిడఁగ నేదే ముప్పు వాటిల్లు న
ట్లామోదింపఁగలేని పంద వగుదయ్యా? క్షత్రియోత్కృష్టవం
శామోదస్థితి గన్నవాఁడ వికనీయజ్ఞంబునందున్ యశం
బో మృత్యుప్రతిపత్తియో యగు మనంబున్ ద్రిప్పఁగాఁ బోకుమా.

దైవతంత్రంబు మనమెఱఁ దప్పదేని-జయము ఘటియించు నీకు నిశ్చయము గాఁగ
మరలి వత్తువు నిరతమున్ మది జపింతు-నస్మదుత్కృష్టకులదేవతాళి నిచట.

మరణము నైజసంభవము మానుషకోటికి; నెందు శత్రుభూ
వరదళనక్రియాకరణవర్ధితకీర్తి శరీరమాన్యుఁడై
ధర విడనాడుటన్న సుకృతంబునఁ గాని లభింప దోగుణా
కర! పతి పాటుఁబో తనినఁ గల్గు నపత్రప సైఁచు టెట్లొకో?

ప్రాయమం దున్నవాఁడవు బాహుగర్వ-శోభితుండవు నీయట్టి శూరవరులె
ప్రాలుమాలికఁ జెందినచో లయంబుఁ దప్పకొను టెట్లు దేశమాతకు సహీన !

పదిలంబౌ గతి నాత్మగౌరవము నిల్పంజాలు సౌభాగ్య మ
భ్యుదయంబుల్ వహియించి సూనులకు నిత్యోత్సాహనిర్వక్రసా
ఖ్యదమై యెప్పుడు మాతృదేశ మిది, దుఃఖప్రాప్తికిం ద్రోసి సం
పద పెం పేగినవెన్క నీ వనుభవింపన్ దగ్గ దేముండునో ?

పారతంత్ర్యగ్రహంబు గహ్వరముఖమును-దెఱచి మాతృదేశంబును దఱుమునపుడుఁ
నడుము గట్టఁగఁజాలని జడసుతుండు-కలుగ నేటికిఁ దల్లికిఁ గడుపుచేటు ?

దేశ మధోగతిం గనెడిఁ దీవ్రపరిస్థితులందుఁ జిక్కి వా
రాశిని బడ్డ నౌకవలె, రాజ్యరమాహృదయాబ్జ మన్యభూ
మీశదురంతవేదన సహింపఁగలేక కృశించియుండె న
య్యో ! శతశః ప్రభిన్న మగు నొక్కక్షణం బిఁకఁ దామసించినన్.

మానితసత్త్వులైన మతిమంతులు మీరని నమ్మియుంటి నీ
మౌన మిదేలఁ తత్క్షణమె మాయకిరాతుల బారినుండి నా
మానముఁ బ్రోవ శక్తిగల మాన్యులు లెం డను మాతృదేవతా
హ్వానము లల్లవే వినఁగనయ్యెడి నెయ్యెడఁ జూచినన్ గటా !

క్షత్రియుఁ గత్తలంబు గొని కాలగళుం డని కేగుదెంచినన్
మత్తు మడుంగఁ జేతుమని మాటికిఁ బల్కుచుఁ గన్నులందు గో
బెత్తిన కోప మగ్ని గురియింపఁగ శత్రుల నుక్కడంపఁ బ
ర్వెత్తుచునున్నవా రనుసరింపుము నీసహజన్ము లందఱిన్.

---

# శృంగార నైషధము

## నలదేవేంద్రుల సంభాషణ-తద్విమర్శనము

భాగవతుల దక్షిణామూర్తిశాస్త్రిగారు

ఉభయభాషాప్రవీణ (A)

"బలనిషూదను కపటంపు భాషణములు
విని నృపాలుండు పలికెఁ దద్విధము గాఁగఁ
గుటిలబుద్ధుల గెలువంగఁ గుటిలమతియ
యర్హ మగుఁ గాని నీతి గా దార్జవంబు."

ఇందు బలనిషూదను కపటంపు భాషణ లెట్టివియో; నైషధుని కుటిలనీతి యెట్లు ప్రయోగింపఁబడెనో విమర్శింతము. దమయంతీస్వయంవరమున కేఁగుచున్న నైషధుఁ డింద్రాదుల నరదంబునఁ బరికించి, తద్రూపరేఖల లోకోత్తరులని నిశ్చయించి తత్సకాశమునకుఁ జేరెను. వంచనాకపటనాటకసూత్రధారుఁ డైన యాసునాశీరుఁ డాతని నేమ మరసి తమ్ము నధికారపురస్సరముగ నివేదించి యర్థిత్వమునకుఁ బాల్పడెను.

'ముహూర్త మాత్రంబున మార్గఖేదనం బపనయించి కార్య నివేదనం బొనర్చెద మని పలికి యభిధాకుశలుం డై యవ్విబుధనాయకుం డూరకుండిన'-ఇం దభిధానకుశలత్వమేమి?

'అదిక్పాలురు దివ్యకాంచనవిమానా
రూఢులై.........
.........శీఘ్రంబ యేతెంచి రా
హ్లాదం బొప్ప వసుంధరాస్థలి కమ
ర్త్యవ్రాతముల్గొల్వఁగన్'.

ఈపద్యమున దివ్యవిమానారూఢు లగుట శ్రమ లేకయే క్షణ మాత్రమున భూలోకంబున కరుగుదెంచిరని చెప్పంబడెను. దేవతల కమృతపానాత్ప్రభృతి యమృతధర్మములు సేకూరెననియు, నం దనిమేషత్వము, త్రిదశత్వము, భూసంస్పర్శాభావము, అస్వేదత్వము, అశ్రమత్వము గలిగియుండురని శాస్త్రములు వచింప విందుము. ఈయస్వేదత్వధర్మము ప్రవరునియం దాసక్తి వహించిన యమర్త్యభామ యగు వరూథినికి, 'మనుష్యుని భావించుట మానుషత్వము మెయి గ్గన్పట్టెనా నత్తఱిన్' అను మనుచరిత్రపాదమునం దుత్ప్రేక్షచే సమర్థింపంబడెనుగదా! అట్టితఱి ఈ మార్గాయాస మెట్లు సమర్థింపవలయు? 'పిండితార్థంబు విను మేల పెక్కుమాట లర్థులై వచ్చితిమి మము నాదరింపు'-ఈసందర్భమున నింద్రుఁ డర్థులమై వచ్చితిమని పల్కి మౌన మూనెను. దిక్పాలురు తన్నుఁ బ్రదాతఁ జేసినప్పుడు పాపము నలుఁడు వారి కపటంపు భాషణముల విమర్శింపలేదు. కేవలభక్తితాత్పర్యమున నుండెను. అర్థులమని పల్కి మార్గాయాసాపనోదనార్థము కొంతవడి విశ్రమించి కార్యనివేదనం బొనర్చెదమని మౌనము వహింపఁ బులకితగాత్రుఁ డైన నారాజన్యుని మనోవీథి ధర్మమీమాంసకు లోనై ప్రాణంబైనను, ప్రాణాధికం

బైన నిచ్చుటకు సాహసించెను. దేవేంద్రుఁ డీమాన మూనక సహసా కార్యనివేదనం బొనర్చిన నలహృదయమున కిట్టిపరిపాకము నేకూరునో, లేదోయని భయపడెను. అట్టి ధర్మ మీమాంసకుఁడె దావిచ్చుటకే యీ మానముద్ర. ఇది యభిధానకౌశల మని చెప్ప వచ్చును.

'...............విను భీమపుత్రిపైఁ
గామన నేసి వచ్చితిమి గమ్మ
సహాయము మాకు'—

ఈవాక్యము శ్రవణగోచర మైనంతలోనలుఁడు దేవేంద్రుని యభిధాకుశలత్వమును గుర్తించెను. వారి మోసము హృదయమునకు నాటెను. 'అగాధగుణాంభోధివగు నీవు సహాయంబుగా మాకు సాధింపరాని కార్యముం గలదె'యను వాక్యమున నభిధాకుశలత్వము మఱింత విస్పష్టముగఁ గన్పట్టెను. దేవతల యందు భక్తితత్పరుఁడై ప్రాణములగాని, తత్తోధికములఁగాని బలిసీయసంసిద్ధుఁడైయున్న రాజన్యన కీయభిధ వారియందలి భక్తిభావమునకు న్యూనతఁ గల్పింపఁజొచ్చెను. కుటిల బుద్ధిని గుటిలబుద్ధిచే నాక్రమింప నిశ్చయించెను. 'వజ్రం వజ్రేణ భిద్యతే', 'అగాధగుణాంభోధివి నీ' వని శ్లాఘించినందులకు 'మహానుభావులారా! అఖిల భూతాంతర్వర్తనంబుల నెఱింగెడు మీకు నెఱుంగఁ బడని యర్థంబునుం గలదే!' అని ఋజుమార్గంబునఁ బ్రచ్ఛన్నముగ వ్యాజము నుంచి పల్కెను.

ఈసందర్భమునఁ దన దౌత్యపరాఙ్ముఖతకు నలుఁడు ప్రధానముగఁ గారణత్రితయమును జూపెను.—

౧. ఏ నయ్యంగనం గోరి వరియింపం బోవుచున్నాఁడ అమ్మచ్చెకంటికిం గుంటెనతనం బెట్లు సేయ నేర్తు?

౨. విరహవేదనాదోదూయమానమానసుండ నైన యేను మీరహస్యం బెట్లు రక్షింప నోపుదు? మనోరథపరంపరానుధావనంబునఁ బరవశుండనైన నాకు భావగోపనం బెట్లు సిద్ధించు?

౩. వివిధ రక్షాధికృతపాలితంబులైన రాజశుద్ధాంతభవనకక్ష్యాంతరంబు లేప్రకారంబునం బ్రవేశింతును?

ఈకారణపరంపరయందుఁ బ్రథమద్వితీయముమాత్రమే సకుటిలము; తృతీయము సహేతుకము. ప్రాణాధికంబైన నిచ్చెదనని వాగ్దానము చేసి మాఱుపల్కుట నలున కుచితంబు గాదు. దౌత్యము తప్పదు. మార్గాయాసం బపనయించి కార్యనివేదన యొనర్తునని పల్కిన శతమఖుని వచనంబునకుఁ బ్రతిగ నుండి డీకొనఁజాలియున్న దీద్వితీయ కారణము. సహజముగ మార్గాయాసము లేనిదే యున్నట్లు చెప్పినందులకు 'విరహవేదనాదోదూయమానమానసుండనైన నేను భావగోపన మెట్లు సేయనేర్తు'నని తగిన సమాధాన మొసఁగినాఁడు నలుండు. మహాకావ్యమున నిబద్ధుఁడైన నాయకునకు భావగోపన

శక్య మేల గాదు? శాకుంతలమున తృతీయాంకాంతమందు దుష్యంతుఁ డిట్లు శృంగారమున నిమగ్నుఁ డయ్యెను:

'తస్యాః పుష్పమయీ శరీరలులితా
   శయ్యా శిలాయా మియం,
క్లాన్తో మన్మథలేఖ ఏష నలినీ
   పత్రే నఖై రర్పితః,
హస్తా ద్భ్రష్టమిదం బిసాభరణ మి
   త్యాసజ్యమానేక్షణః,
నిర్గంతుం సహసా న వేతసగృహా
   చ్ఛక్నోమి శూన్యాదపి.'

తా. 'శకుంతలాగాత్రపరిష్వంగము గలిగినకారణమున నీశయ్య తచ్ఛరీరలులితము లగు పుష్పసమేతమై యున్నది. సాక్షాత్ స్వహస్తలిఖితప్రణయవచస్సంబద్ధ మీనలినీపత్రి మప్పుడే క్లాన్త మైనది, తాపాపనోదనార్థము బాహువుల కుంచఁబడిన దీబిసకాండము, శకుంతలాశూన్యమైనను నీవేతసగృహమునుండి సహసా నిర్గమించుట కశక్తుఁడను.'

నాయకుఁడు విప్రలంభమునం బూర్ణముగ నిమగ్నుఁడై యింద్రియస్వాధీన విరహితుండై తత్పరత నుండెను. ఇట్టి విప్రలంభము ఘటించి రసోల్లాస మొనర్చుటకే మహాకవి గౌతమి నచ్చో ప్రవేశింపఁజేసి నాయికానాయకులకు వియోగము ఘటించెను. తదనంతరంబ నేపథ్యమున

'సాయంతనే సవనకర్మణి సంప్రవృత్తే
   వేదీం హుతాశనవతీం పరితః ప్రయస్తాః;
ఛాయాశ్చరంతిబహుధాభయమాదధానాః
   సంధ్యాపయోదకపిశాః పిశితాశనానామ్.'

'యజ్ఞము ప్రారంభించు నవసరమునఁ దద్విఘ్న మాచరింప రాక్షసచ్ఛాయలు సంచరించుచున్నవి. నీవు సబాణాసనహస్తుఁడవై ప్రత్యక్షమునకు రావలయును!'

ఈ ఋషివాక్యములు వినఁబడినంత నే "భోః, అయమయ మాగచ్ఛామి" యని నాయకుఁడు వీరరసాధిదేవతంబోలె శృంగారము నావలఁ బాఱద్రోలి వీరమున కుఱికెను. అనఁగా నుదాత్తనాయకుఁడు ఱాయి గాని, రప్ప గాని కాఁడు. రసవిశిష్టుఁడు కాకపోలేదు. ధర్మరక్షణార్థము వలసినచో నింద్రియగ్రామము నిరోధింపఁగలఁడని సూచించెను. ప్రకృతము మన నలుఁడుగూడ నట్లె భావగోపనముఁ జేయ సామర్థ్య మున్నను లేదని చెప్పుట నిచ్చోఁ గుటిలప్రాధాన్యము గన్పట్టుచున్నది. మున్ముం దంతఃపురమున భావగోపనఁ జేయఁగలయట్లు కవి మనకుఁ గన్పఱచి యున్నాఁడు. కాననే యింద్రుఁడు ప్రథమకారణద్వితయమును సకుటిలముగ నెంచి తృతీయకారణ మవశ్యంభావనీయమని తలఁచి తదభిపూర్తికై తిరస్కరిణీవిద్యను బ్రసాదించెను. 'నీకపటమును మేము గ్రహించితిమి. నీవు మహానాయకుఁడవు. నీకు భావగోపనసామర్థ్యము లేనినాఁడు మహాకావ్యమునకు భంగము వచ్చునని దేవేంద్రుఁడు చెప్పకయ చెప్పి, తృతీయకారణమును మాత్రము సమాధానప

యచెను. ఈ చెప్పకయ చెప్పుట మున్ముందు పద్యమునఁ జూడఁగలము:

'ఈమాట లాడకు మిందువంశవతంస
　యాడితప్పఁగవచ్చు నయ్య, నీకు;
క్షణభంగురంబైన సంసారమునకుఁగా
　ధర్మంబు కీర్తియుఁ దగునె విడువ?
నన్వయంబున కాదియగు చందురుఁడుఁబోలె
　నకట కళంకి వే లయ్యె దీవు?
.........................'

'నలా! నీ విందువంశవతంసుఁడవు' అనఁగా నాయకలక్షణములలో నియ్యది మహాకులీనత్వమును స్ఫురింపఁజేయును. 'ధర్మంబు కీర్తియుఁ దగునెవిడువ' యనుచో 'ధార్మికత్వాదయో గుణాః'యనుదానిని స్మరింపఁజేయును. ఇట్లాదియవసానములమాత్రము స్ఫురింపఁజేసి ప్రత్యాహారన్యాయమున లక్షణమును సంపూర్ణముగ నుంచెను. కాన నలుని నాయకత్వమును బోధించుటకై కవి యిట్టి పరికరాలంకారమును సంఘటింపంజేసెను. మూలగ్రంథమున నింత వివరణగ నున్నట్లు గన్పట్టదు.

కాని తృతీయపాద మట్లుండుట నాకు యుక్తియుక్తముగఁ గుదురలేదు. ఏలయనఁ బ్రథమపాదమున 'నిందువంశవతంస' యని ప్రయోగించి, 'నీవంశము జగదాహ్లాదకరము; నీవు మహాకులీనుండవు. నీ విట్లాడి తప్పుట యసమంజస'మని నలుని వంశమును గీర్తించి స్వకార్యమును బదిలముగా సాధింపనెంచి, 'అన్వయంబున కాదియగు చందురుఁడుఁబోలె నకటఁ గళంకి వే లయ్యె దీ'వనుచో చంద్రకళంకము నుద్ఘాటనచేసినప్పుడు కొంత విరుద్ధవస్తుసామానాధికరణ్యము పొడకట్టును. కుటిలమార్గముల నధిష్ఠించి యింద్రాదుల బారి నుండి సంకెలలఁద్రుంచిపోఁ జూచుచున్న నలునకు హాయమును నిరోధించినరీతి నన్వయగుణస్ఫూర్తి గల్గించుట యుక్తియుక్తముగ నుండును గాని, యీయసహ్యప్రసంగము ప్రత్యూతయొకప్పుడు తమకే విషమింపవచ్చును. 'మావంశకర్త కున్న కళంకము మావంశీయులకు సంక్రమించియేయుండును. మీరు తీసివేయఁదలఁచిన మానునా?' అని నలుఁడు వల్కి వారి బారినుండి యుఱుకఁ బ్రయత్నింపవచ్చును. 'నీ వీయుపకారమున నీవంశకర్తయగు చంద్రుని మఱపించెద'వని నీతిని బోధించినను చంద్రకళంకస్ఫూర్తిని నలునకుఁ గలుగఁజేయుటలో కవి యభిప్రాయము విచార..........

కాని నా కొకసమాధానము తోఁచుచున్నది. ప్రథమపాదములో నున్న 'ఇందువంశవతంస'యను పదమునకుఁ బూర్వము చెప్పినట్లు, మహాకులీనతార్థము నప్రస్తుతముఁ జేసి, 'చంద్రవంశమున నున్న రాజులకు చంద్రకళంకము జన్మతః సిద్ధించియుండును గాదా! నీవన్నత్కార్యనిర్వాహకుండ వయ్యె దేని నీకుఁగూడ జననాదారభ్యసిద్ధించిన కళంకము లేనివాఁడవై యుందు'వని, భావికార్యనిర్వాహకత్వ మప్పుడే యుంచి, మహాకులీనత్వధర్మమునకుఁ బ్రాధాన్యముఁ దీసివేసినను, నీపూర్వాపరంబులకు

వైరుధ్యము లేదు. ఈయర్థమేకవి కభిప్రేతమని చెప్పుటకు కవివాక్యము స్ఫురణకు వచ్చు చున్నది. ద్వితీయాశ్వాసమున, ౭౧ వ పద్యమున,

'ఈయర్థంబు ఘటింపుమన్న.........
నీయశ
శ్ఛాయామండలమిందుకుందకుముద
స్వచ్ఛంబు నంధించు నం
ధాయుక్తిఁ శితిపీతరోహితహారి
ద్వర్ణోపసంహారముఁ.' (3-71)

అనియున్నది.

ఇన్ని యుపమానము లుదాహరించుటచే నుపమాదోషము సిద్ధించుచున్నది. కావ్యాలంకారసూత్రవృత్తియం దుపమాదోషప్రకరణమున

సూ: — ఉపమానాధిక్యా త్తదపోహ ఇత్యేకే.

వృత్తి:--ఉపమానానామాధిక్యాత్తదపోహ ఇత్యేకే. యథా--కర్పూరహారహరహాససితం యశస్తే ఇతి. అత్రకర్పూరాదిభిరుపమానైఃబహుభిః సాదృశ్యం యశసః సుస్థాపితం భవతి, తేషాం శుక్లగుణాతిరేకాత్.

సూ:— నాపుష్టార్థత్వాత్.

వృత్తి: ఉపమానాధిక్యా దపోహఇతి యదుక్తం తన్న; అపుష్టార్థత్వాత్. ఏకస్మిన్నుపమానే ప్రయుక్తే ఉపమానాంతరప్రయోగో న కంచిదర్థవిశేషం పుష్ణాతి.

అనఁగా నుపమానిష్ఠులగు కవుల, సాదృశ్యోపమానప్రయోగదోష నిరాసార్థ ముపమానసంఖ్యాబాహుళ్యమును, స్వీకరించినను దోషాపనోదకము గాదని సిద్ధాంతీకరింపఁబడినది. ప్రకృతము కవి యిందు, కుంద, కుముద స్వచ్ఛంబని మూఁడుపమానములం బ్రయోగించి, లక్షణాతిక్రమణ చేసెనని చెప్పవలసియున్నది. కాని మన కీప్రకృతోపమాబాహుళ్య గ్రహణ మత్యంతోపకారకము. ఏలయన: 'మాయర్థిత్వమును, నీదాతృత్వమును సిద్ధించినచో నీయశస్సుచంద్రుని ధావళ్యముతోఁదులఁదూఁగునని ప్రథమమునఁ జెప్పి, వంశకర్తయగు చంద్రునకుఁ గళంక మున్న కారణమున కుందకుముద గ్రహణముఁ జేసి, తత్పూర్వోపమానమును బూర్వపక్షము చేయును. ఇచ్చో, చంద్రశ్చ, కుముదకుందేచయని ద్వంద్వసమాసము చేసినచో నిర్దుష్టముగ నుండును. చంద్రునిపూర్వపక్షమొనర్చినను, కుముదకుందములు రెండును నిల్చియేయుండునని ప్రశ్న వచ్చును. 'బహుభిః ఉపమానైః'అని లక్షణకర్త చెప్పెనుగాన బహువచన సారస్యమున త్రితయమునకు దోషము గాని కుందకుముద ద్వితయమునకు దోషము లేదు. కాన దోషభూయిష్ఠమైనను, నీయుపమాబాహుళ్యగ్రహణము, కార్యసాధకమే యగుచున్నది.

'ఆశంకసే యదగ్నిం, తదిదం స్పర్శక్షమం రత్న'మనెడి కాళిదాసవచనము స్ఫూర్తికి వచ్చుచున్నది.

మఱి ప్రకృతము, శ్రీనాథుఁడుగూడ నీపైఁ జూపిన నలకారణత్రితయపౌర్వాపర్యరచనయం దతినైపుణ్యమును జూపెను. ప్రథమ ద్వితీయకారణము లింద్రునిచే గ్రహింపఁబడి, పూర్వపక్షమునకు గుఱికానని తలంచి సిద్ధాంతకారణమును దృతీయస్థానమునం దుంచెను. దేవేంద్రుఁ డాకారణము నుపశమింపఁజేయఁ దిరస్కరిణీవిద్యనుమాత్రము ప్రసాదించి శేషములగువానిని దేవేంద్రుఁడు గ్రహించినట్లు 'ఈమాటలాడకు మిందువంశవతంస' యను పద్యమున స్ఫురింపఁజేసి నలునిఁ బంపెను. కాని నాఁడు నలుఁడేఁగుట యసంభవము. కారణత్రితయపరిపూరణాభావమున, నింద్రుఁడు పొమ్మనుట యసమంజసము.

నలున కాడి తప్పుటన్యాయమా; నాయక గుణమా? యని యొకసందేహము మాటిమాటికి నామీఁదఁ గాలుదువ్వుచున్నది. ఇందులకు నాకుఁగూడ నలునివలె, దేవేంద్రునివలె కపట మభినయింప నిచ్చ పొడముచున్నది. వాక్యము చెప్పుట అనఁగా మాట నిచ్చుట; కార్యాచరణమున పర్యవసానము నొంది విశ్రాంతిని స్వీకరించును గాన, కార్యాచరణ చేసినకారణమున, నాయకుఁ డట్టి దోషదూషితుఁడు గాఁడు. ఈసమాధానము నాకు నచ్చలేదని సందేహపిశాచము నన్ను నిక్కినిక్కి చూచుచు మఱల మఱల వేధింపఁజొచ్చెనా, శాకుంతలములో ద్వితీయాంకాంతమున, 'ఈ విదూషకవటువు చపలుఁడు. నాశృంగారరహస్యము నంతఃపురనివేదన మొకానొకప్పుడు చేయునేమో' యని

"క్వ వయం క్వ పరోక్షమన్మథో
మృగశాబైః సమ మేధితో జనః;
పరిహాస విజల్పితం సఖే
పరమార్థేన న గృహ్యతాం వచః."

ఈరీతిగ నుదాత్తనాయకునిచే ననత్యము పలికించిన మహాకవి కాళిదాసుని, పోయి తెలిసికొమ్మని దారి చూపిస్తాను.

—

# శరత్కాలము

కోరిమిల్లి వీరసోమసత్యనారాయణగారు

తలకొని మిత్రునిం బొదివి, తమ్ముల ముంచి శరంబులన్, శిఖం
డుల నలరించి, మౌక్తికమనోహరసంపద లబ్బ, భూజనం
బలజడి వొందఁజేయుచు, ఘనాఖ్యల మిన్నులుముట్టు చంచలా
త్ములు పరికింపఁగాఁ దుద కధోగతజీవను లౌట వింతయే?

ద్యోతలవర్తనంబు తమ కొప్పుటచే రససిద్ధిమాత్రతన్
ఖ్యాతిగ మేము నారదులమన్నను మేఘులు తేజమేది యా
శాతతిఁ జెంది, క్రొమ్మెఱుఁగుచాపలఁ గూడి చరింపఁగా, నిజో
త్పాతము లెల్లఁ దేటపడవచ్చినఁ దెల్లెలఁబోయె నెంతయున్.

ఆతతపావనాత్ములయి నట్టి ఘనావళి ప్రాపుఁ జెంది త
ద్ద్యోతితనిర్మలామృతసుయోగములన్ దిగఁద్రోచి పర్వత
వ్రాతము పెక్కుగండములపాలయి నిల్చె; ధరాధరోన్నత
ఖ్యాతి వహించినన్ సుగతిఁగాంచఁగలారె ప్రపాతకుల్ భువిన్.

జానుగ నాత్మగర్భములచల్వల వర్ధిలుచుండ సస్యసం
తానము లెల్ల ద్వీపినులు తాలిమితోఁ జరియించె; నల్ల సం
తానపుఁ జిన్నిపొట్టలను నాలుగుకాయలు కాచెనేని యా
పై నిఁక దాము క్రుంకినను బాగని కూడఁ దలంచ నేమొకో?

అనఘుఁ డినుండు దుర్దినములౌటనుఁ దాను ప్రవాసి యయ్యునున్
మునుఁ బరివేషమండలినిఁ బొల్పుగ దుర్దినముల్ దొలంగినన్
తన ప్రభఁ జూపి, భూజనముదంబు ఘటించుచుఁ దన్నుఁగోరు ప
ద్మినికి వికాసముం గొలిపె మిక్కిలి నాత్మకరప్రసంగతిన్.

విదితముగాఁగ మబ్బుతెఱ వెల్వడి సారసగర్భవేషుఁడై
యుదయదినేశుఁ డొప్పఁగను ద్యోతలరంగమునందుఁ గాలమన్
సదమలసూత్రధారుఁడు ప్రశస్తకళాకలితైకశారదా
భ్యుదయమనోజ్ఞనాటక మపూర్వముగా నొనరించెఁ గాదొకో.

అవుర! కళల్ పదాఱు గనినప్పుడె యాద్విజరాజు పూర్ణగౌ
రవమునుఁ బొందె నట్టితఱి రాజితలీలఁ బ్రసన్నశారదుం
డవుట నశేషసత్కళల నందిన యాతని నెన్నిరీతులన్
దివిరి నుతించిరన్ జనని దీరున చూచుచుఁ జొక్కుటొప్పగున్.

అవిరళసత్కళాన్వితుఁ డనంతదిగంతసమగ్రచంద్రికా
ధవళయశుండు, సత్పథనితాంతవిహారుఁడు చంద్రుఁ డాత్మసం
భవుఁ డయి తేజరిల్లఁ గని పావనజన్మము నాదె యంచుఁ దా
మివుల సముద్రుఁ డుబ్బుచును మిన్నులు ముట్టుచు నుండె నెంతయున్.

గతమేఘావృతనిర్మలాంబరమునన్ గన్పట్టె నానందవి
స్తృతదివ్యామృతపూర్ణమంగళరుచిన్ శీతాంశుఁ డజ్ఞానక
ల్పితమాయావరణంబుఁ బాయఁగ మనోవీథిన్ దగన్ దోఁచు సం
తతవిజ్ఞానకళాప్రసన్నపరమాత్మంబోలి చిత్రంబుగన్.

కేవలమౌక్తికాకృతి నకల్పితకాంతుల నీనుచున్న తా
రావళితోడ నిర్మలవియత్తల మొప్పె నపూర్వశారద
శ్రీవిజయాతురవ్రజపరిస్ఫుటనీలశిలా విశాల సం
భావితభద్రశాసనవిభాసురమౌచు మనోహరంబుగన్.

వరజలాశయములఁ బ్రతిఫలింపఁగఁ జూడఁ గ్రముగోక్షీరభాగ్యముల నెఱపి
తరులనీడలఁ బరిస్ఫురితంబుఁగాఁ జూడ భాసురపుష్పసంపదల నింపి
ప్రకటాద్రితతులపైఁ బ్రసరింపఁగాఁ జూడఁ గలధౌతమయలీల లలవరించి
ఘనహర్మ్యకుడ్యభాగములఁ బ్రాకఁగఁ జూడ నవసుధాసారవైభవముఁ జూపి
సరససుకుమారవిమలప్రసన్నభావ-ములఁ బ్రకాశించుచును జగన్మోహనైక
నిస్తులానందవిశదసన్మిత్ర మగుచు వెన్నెల చెలంగె శారదవేళయందు.

సౌధాగ్రములఁ గేళినల్పు పూఁబోఁడుల తెలిముద్దునగవులఁ బలుకరించి
కలశాబ్ధితరగలఁ గన్పట్టు నవఫేనవిసరంబుతోడుత వియ్యమంది
మందాకినీసరిన్మగ్నలీలాదివ్యకరిదంతములతోడ సరసమాడి
గౌరీసమాయుక్తిఁ గ్రాలు శంకరు మేని భూతి కెంతయు సానుభూతిఁ జూపి
సకలసంపూర్ణసత్కళాసహితమైన-భారతికి నింపుమీఱఁ గైవార మొనఁగి
మెండుకొని లోక మెల్లను నిండుకొనియెఁ-బండువెన్నెల కన్నులపండు వగుచు.

---

# జైనులు – సాముద్రికము

బుర్రా శేషగిరిరావుగారు (ఆంధ్రభారతీతీర్థ ప్రధాని)

పూర్వము జైనమునులు అనేకములైన లౌకికశాస్త్రములు పరిశీలించి విశేష విద్య లెన్నో వెలయించిరి. ఇప్పటికిని ఆయా శాస్త్రములలో వారు సంగ్రహించిన జ్ఞానము సంస్కృతప్రాకృతములలో గలదు. "ఉత్తరాధ్యయన" సూత్రము లనే గ్రంథము ఈ మధ్య చూచుచుంటిని. జారక్ షార్పెంటి యరు పండితులు ముద్రించి ఇంగ్లీషులఘుటీకతో ప్రచురించిన ప్రతి యొకటి శ్రీకామత ప్రసాద జయిన్ గారు ("వీర"పత్రికా సంపాదకులు) నాకు చదువుటకై పంపియుండిరి. అందులో ఇచ్చిన పూర్వవ్యాఖ్యానభాగములలో నొక దానిలో "శుభాశుభపురుషలక్షణములు"అను సాముద్రికశాస్త్రభాగములోనుండి కొన్నిశ్లోకములుమచ్చుకై యిం దుదాహరించుచున్నాను. సాముద్రికశాస్త్ర మెరిగిన పండితు లీశ్లోకార్థము లెట్లు వైదికసాంప్రదాయశాస్త్రములలో విపులపరుపబడినవో పాఠకలోకమున కెరిగింపగోరెదను. ఇట్లే "స్వప్నశాస్త్రము"ను విశదముగా తెలుపు "స్వప్నచింతామణి" యను శాస్త్రముకూడా కలదట. అది మన దేశములో లభ్యమగునేమో తెలియదు.

శుభాశుభపురుషలక్షణాదీని—

"అస్థిష్వర్థాః సుఖం మాంసే
త్వచి భోగాః స్త్రియోఽక్షిషు,
గతౌ యానం స్వరే చాజ్ఞా
సర్వం సత్త్వే ప్రతిష్ఠితం.

పద్మవజ్రాంకుశచ్ఛత్ర
శంఖమత్స్యాదయస్తలే,
పాణిపాదేషు దృశ్యంతే
యస్యాసౌ శ్రీపతిః పుమాన్.

ఉత్తుంగాః పృథులాస్తామ్రాః
స్నిగ్ధా దర్పణసన్నిభాః,
నఖా భవంతి ధన్యానాం
ధనభోగసుఖప్రదాః.

శ్వేతైః శ్రమణతా జ్ఞేయా
రూక్షపుష్పితకైః పునః,
జాయతే ఖలు దుఃశీలో
నఖైః క్లోకేఽత్రమానసః.

శుద్ధాః సమాః శిఖరిణో
దంతాః స్నిగ్ధఘనాః శుభాః,
విపరీతాః పునర్జ్ఞేయా
నరాణాం దుఃఖహేతవః.

ద్వాత్రింశద్దశనో రాజా
భోగీ స్యా దేకహీనకః,
త్రింశతా మధ్యమో జ్ఞేయః
తతోఽనస్తా న్న సుందరః.

స్తోకదంతాతిదంతా యే
శ్యావదంతాశ్చ యే నరాః,
మూషికైస్సమదంతాశ్చ
తే పాపాః పరికీర్తితాః.

అంగుష్ఠయవై రాఢ్యాః
సుతవంతోఽంగుష్ఠమూలజైశ్చ యవైః,

ఊర్ధ్వాకారా రేఖా పాణితలే
        భవతి ధనహేతుః.
వామావర్తో భవే ద్యస్య
        వామాయాం దిశి మస్తకే,
నిర్లక్షణః క్షుధార్తో వెశ్యా
        భిక్షా మద్యాత్ సరూక్షికామ్.
దక్షిణో దక్షిణే భాగే
        య స్యావర్తస్తు మస్తకే,
తస్య నిత్యం ప్రజాయేత
        కమలా కరవర్తినీ.
యదిస్యా ద్దక్షిణే వామో
        దక్షిణో వామపార్శ్వకే,
పశ్చాత్కాలే తత స్తస్య
        భోగానా స్త్యత్ర సంశయః,
ఉరోముఖలలాటాని
        పృథూని సుఖభాగినాం,
గంభీరాణి తత స్త్రీణి
        నాభి స్సత్వం స్వర స్తథా.
కేశదంతనఖా స్సూక్ష్మా
        భవంతి సుఖహేతవః,
కంఠః పృష్ఠం తథా జంఘే
        హ్రస్వం లింగంచ పూజితం.
రక్తా జిహ్వా భవే ద్ధన్యా
        పాణిపాదతలానిచ,
పృథులాః పాణిపాదాశ్చ
        ధన్యానాం దీర్ఘజీవనం.
స్నిగ్ధదంతః శుభాహారః
        సుభోగః స్నిగ్ధలోచనః,
నరో ఽతిహ్రస్వదీర్ఘాశ్చ
        స్థూలాః కృష్ణాశ్చ నిందితాః.
పంచభిః శత ముద్దిష్టం
        చతుర్భి ర్నవతి స్తథా,
త్రిభి ష్షష్టి స్సముద్దిష్టా
        రేఖాంకై ర్లాభవర్తినః.
చత్వారింశత్ పునః ప్రోక్తం
        వర్షాణి నరజీవితమ్,
తాభ్యాం ద్వయాభ్యామే కేన
        త్రింశద్వర్షాణి జాయతే.
కుశీలా శ్యామలోలాక్షీ
        రోమజంఘాచ భర్తృహా,
మహీ లోన్నతో త్తరోష్ఠీ
        నిత్యంచ కలహప్రియా."

ఉత్తరాధ్యయనసూత్రములు, ఏడవ అధ్యాయమునుండి.

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్న సైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.

# ముండ్ల కొమ్మ

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

చిత్తవిశ్రాంతికై యూరిమొత్తనంటి
యేపుగాఁ గడ్డిపట్టి యెల్లెడలయందుఁ
బలు శిలాదృశ్యముల నేత్రపర్వ మొసఁగు
కొండనెత్తమునం గూరుచుండినాఁడ.

పగటిపూఁటంతయును బనిపాట్లు నేసి
నలిఁగి దేహంబు హృదయంబు కలఁగఁ బాఱ
వచ్చు కాంతునిఁ బ్రియురాలుపగిది నెదురు
వచ్చి మందమారుతము సేవల నొనర్చె.

అంత నా కూరుచుండిన ప్రాంతమందె
యున్న యొక ముండ్లకొమ్మపైఁ గన్ను వడెను.
గాలితాఁకుల నది నాదు కాలిఁ దాఁకి
జరుగు వెనుకకుఁ దాఁకును మరల సాఁగి.

రోసి యద్దాని నవలకుఁ ద్రోసివేసి
లాఁతికొమ్మల దోఁపిన లావుమెయిని
వచ్చి నాకాలిచెంగట వ్రాలుఁ గాని
శిష్టతరుశాఖలందునఁ జిక్కుఁగొనదు.

శ్రద్ధ వహియింపనైతిఁ బ్ర్రథమమందు
దాని వ్యాపారములకు నర్థంబు గాక
చూడఁజూడంగ నది తన గోడుఁ దెలుప
నన్ను వెంటాడుచున్న చందమునఁ దోఁచె.

అకట! నాబ్రదు కెంత హేయంబు! నరుల
చరణముల నంటనైన నోఁచంగనైతి
నెట్టకేలకుఁ దాఁకినం దిట్టిపోసి
యావలకు గెంటివేయుదు రలుకఁ బూని.

అందచందంబు లనలె శూస్యంబు లేకను
సరసభావంపుఁ బేరివాసనయు నాస్తి
మాలనిం గన్న శ్రోత్రియుమాద్రి నన్ను
దవ్వుదవ్వులనే కాంచి దాఁటుచుంద్రు.

ఇట్టి నీచంపు బ్రదుకు నే నింక బ్రదుకఁ
జాల; మరణించి పుష్పవృక్షంబుగానో,
ఫలతరువుగానో జన్మించి యొంటిమిఁ గాంతు
నను విడిచి శాపమోక్షం బొసర్పవన్న!

అనుచు సంతప్తచిత్తమై మనసు చెదర
నెండి రాలెడు నాకుల పిండుకతనఁ
జెన్నుదఱిఁగిన మొగముతో నన్నుఁ గనుచు
మూకభాషల బ్రతిమాలె మ్రోల నిలిచి.

పాప మద్దాని దీనభావంబుఁ గాంచఁ
దఱుగుకొనిపోవఁ గడు పెడ తెలివి లేని
ప్రార్థనారూపమగు బాధ పడఁగరాని
శాపమోక్షం బొసర్చితి జాలిఁ బొంది.

---

# రామా ఆంధ్ర వ్యాకరణసర్వస్వములోని కొన్ని సందేహములు

పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారు

ఏలూరు రామా అండుకో వారు ప్రచురించిన ఆంధ్ర వ్యాకరణసర్వస్వము నిటీవల జదువఁ గలిగితిని. అందు నాకుఁ గలిగిన కొన్ని సంశయముల నిట వివరించుచున్నాఁడ. అవి నాయజ్ఞతచేనైన సందియములో, లేక గ్రంథకర్తల పొరపాటులో తెలిసికొనఁగోరెద. గ్రంథకర్తలు ప్రసిద్ధులగు శేషాద్రిరమణకవులు; శతావధానులు. కావున వారికిఁ బొరపాటు లుండవని యెంచి పెక్కువిధముల నాలోచించియు వారురచించిన ఇతరవ్యాకరణములఁ (యం. యస్. శర్మ అండుకో వారు ప్రచురించిన "తెనుఁగు వ్యాకరణము"ను, వెంకటరామ్ అండు కో వారు ప్రచురించిన "వ్యాకరణసంగ్రహము" మూఁడుభాగములను) బరిశోధించియు సందేహనివృత్తి కాకపోవుటచే నీవిధమున వెల్లడించితి. గ్రంథకర్తలుగాని, యితరులుగాని సదుత్తరము లిచ్చి సంశయములఁదీర్తురుగాక యని విన్నవించుచుంటి.

౯వ పుటలో సిద్ధ ఖండమున నుదాహరణము లిచ్చుచు అనవుఁడు అనుపదమును సబిందుకముగఁ జూపిరి. ౯౧వ పుటలో అనంతరార్థకము. ధాతువుకొనను ద్రుతసహితమగు డు వర్ణము చేర్చుటచే నగును. ఉదా:— పోషింపుడుఁ, కొట్టుడుఁ. అని తెనుఁగువ్యాకరణమున ౩౩వ పుటలో అనంతరార్థకములు ద్రుతప్రకృతికములు. ఉదా:—వచ్చుడుఁ, చేయుడుఁ, అనుడుఁ, నావుడుఁ, అనవుడుఁ, రాఁగఁ, చేయఁగఁ, అనఁగఁ. అని నిర్బిందుకముగ స్థిరపఱచిరి. పైని అనవుఁడుఅనుపదియొక్క నామమా? లేక అనంతరార్థకమా? కాదు. అనంతరార్థకమా? గ్రంథకర్త లన్నిచోట్లను అనంతరార్థకమనియే వాడియున్నారు. మఱియు వారి అనంతరార్థకమున నుదాహరణములలో రాఁగఁ, చేయఁగఁ, అనఁగఁ అను నుదాహరణము లున్నవి. ఇవితుమున్నర్థకములు కావా?

౧౦వ పుటలో సంస్కృతశబ్దములను గుర్తించు విధములు అను శీర్షికతో నైదుసూత్రములు సోదాహరణంబుగనిచ్చి మరల ౧౧వ పుటలోఁ దత్సమశబ్దములను దెలిసికొనువిధములు అని రైదు సూత్రములు మునుపటివి మూఁడు కలిపి వ్రాసిరి. ఈపునరుక్తి యేల? మఱి స్థిరాక్షరములకు ముందు పూర్ణానుస్వారములుగల పదములు. అను సూత్రమునకు 'వందనము' అను నుదాహరణ మిచ్చియున్నారు. స్థిరములనఁగా నేవి? దకారము స్థిరమా? సర్వస్వమున స్థిరముల ప్రస్తావమే లేదు. తెనుఁగు వ్యాకరణమున మూఁడవ పుటలో ౨౯వ సూ. వర్గములయొక్క రెండవ మూఁడవ నాలుగైదు వర్ణములగు ఖ ఘ ఛ ఝ ఠ ఢ ఢ ణ థ ద ధ న ఫ బ భ మలు స్థిరములు. అని వ్రాసిరి. పై సూత్రమునకు, అందుఁ గనఁబడిన వర్ణములకును నెట్టిసంబంధమో తెలియకున్నది. (ఘవర్ణము పొరపాటున విడువఁబడినది). చందము, అందము, మందము మున్నగునవి యీసూత్రముంబట్టి సంస్కృతశబ్దము లగునా?

తె. వ్యా. ౩౮వ పుటలో అనుస్వారమునకు జెంత పరుష సరళములుగాక తక్కిన యక్షరములు కలిగిన శబ్దములు తత్సమము.—అనిరి. ఈ స్వవచనవ్యాఘాతము గుర్తింపకైరి.

క చ ట త ప లు పరుషంబులని గ జ డ ద బ లు సరళంబులని చెప్పంబడు. ౫.

ఇతరములగు హల్లులు స్థిరములు—౬.

(బాలవ్యా. సంజ్ఞా.)

తత్సమము లేర్పడురీతి అనుశీర్షికలో (౧౬ పుట)

౯. ఒడ్డేఁడు, కత్తిఖేఁడు, కోటఁడు, బసవఁడు. ఈనాల్గును పురుషవాచకములు గాకున్నను తద్రూప

మును పొందెను. వీనికి మువర్ణము రాదు అని సూచించిరి. ఇవి సంస్కృతశబ్దములా?

౧౮వ పుట. ౨౧౧వ సూ. ప్రభవాద్ది సంవత్సరముల పేర్లు స్త్రీలింగములు అనియు, తెనుఁగువ్యాకరణమున ౩౨వ పుట. ౧౫వ సూ. ప్రభవాదిశబ్దములు స్త్రీసమంబు లగు అనియు వ్రాసిచ్చిరి. ఇందేది గ్రహింపవలయు?

౨౪వ పుట. ౫. ౧. శకారము. శవర్ణమవరాదా? వ్యాకరణసంగ్రహమందుఁగూడ ౪౭వ పుట, తప్పొప్పుల పట్టికలో 'శకారమునకు సకారము' అనిరి.

౨౮ వ పుట ౩వ సూ. సంధిలేనిచోట నచ్చునకు మారు యకారము వచ్చును. అనిరి. అచ్చునకు మాఱుగ యకారము వచ్చినచో నుచ్చారణ మెట్లుండునో యూహింప వలనుగాకున్నది.

"సంధిలేనిచోట స్వరంబుకంటెంబరం బయిన స్వరంబునకు యడాగమంబగు. బాలవ్యా. సంధి. ౩సూ."

౨౭వ పుట—ఇకారాంత నామ వాచకములకు అన్నాదులు పరమైనపుడు సంధి బహుళము. అని సూత్రించి లక్ష్మమ్మ, రెడ్డన్న, జానకయ్య, కోమటక్క, వాసరప్ప అని నిత్యరూపములే యుదాహరించిరి.

బహుళమనఁగా వైకల్పికమని వీరు భావించినట్లే యూహింప వీలగుచున్నది.

౩౦-వ పుట— పదమధ్య స్వరంబులకు సంధి బహుళము. ఉదా: రాముల + అందు = రాములందు; రాములయందు. ఎనిమిది + అవ = ఎనిమిదవ; ఎనిమిది యవ. గంప + అంత = గంపంత; గంప యంత. పద మధ్యస్వరములన నేవి? వానికి సంధి యెట్లు వచ్చును?

తెనుఁగువ్యాకరణమున ౫౬వ పుటలో ఆమ్రేడితము పరమగునపుడు మధ్యమవిభక్తికి లోపము బహుళముగ నగు. ఉదా:—అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్; ఇంటికిన్ + ఇంటికిన్ = ఇంటింటికిన్. ఇంతే. వీని కింక మాఱురూపములుగాని యితరవిధోదాహరణములు గాని లేవు. ఇఁక బహుళమునకు నర్థమేమి గ్రహింపవలయు?

తత్సమశబ్దములకుగూడ మధ్యమవిభక్తికి లోపము బహుళముగ నగును.

ఉదా:— దినమునకున్ + దినమునకున్ = దిన దినమునకున్.

యుగమునందున్ + యుగమునందున్ = యుగ యుగమునందున్.

పైరెంటివలనను బహుళ మన నిత్య మని తలంప వలయుఁగదా!

ఆమ్రేడితము పరంబగునపుడు ఇంచుక, నాఁడు మొదలైన పదములకు తుదివర్ణలోపము బహుళముగ నగును.

ఉదా:—

ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచు కించుక.

నాఁడు + నాఁడు = నానాఁడు, నాడునాఁడు.

లోపల + లోపల = లోలోపల.

లోన + లోన = లోలోన.

ఈబహుళమున కర్థ మేమి? మఱియు ౬౧ వ పుటలో క్రొత్త, కెంపు, క్రిందుశబ్దములకు మొదటియక్షరముగాక మిగిలినవానికి కొన్నిచోటుల 'ము' అనునదియు మఱికొన్నిచోటుల మీదనచ్చు హల్లునకు ద్విత్వమును బహుళముగ నగును. (ము) ఉదా: క్రొత్త + చాయ = క్రొంజాయ.

ద్విత్వము:—క్రొత్త + వాడి = క్రొవ్వాడి
క్రిందు + తల = క్రిందల.

౫౮ వ పుటలోనే

ఆమ్రేడిత క్రియలయందు మధ్యమున్న (ము) (డు) వర్ణకములకు వికల్పముగా లోపము బహుళముగ నగును. ఉదా:—ఉండుము + ఉండుము = ఉండుండుము, ఉండు ముండుము.

ఈసూత్రమున వికల్పముగా లోపము బహుళముగ నగు నన నేమో నావంటియల్పజ్ఞునకుఁ దెలియదు.

తె. వ్యా. ౪౪వ పుట. బహుళము = విశేషముగననుట. అనిరి. ఉదాహరణములు పెక్కులు గలవు. విస్తరభీతిచే మానితి.

సర్వస్వము ౩౧వ పుట. అట్లు రాఁబడిన (ఆదేశ) పరుషములకుముందున్న ద్రుతమునకు లోపముగాని, బిందువుగాని, అర్ధబిందువుగాని సంశ్లేషము (మీఁదిహల్లుతోఁ గలియుట)గాని యగును.

ఉదా:—లోపము-మాచెగంజాతుఁడు
బిందువు-మాచెంగంజాతుఁడు
అర్ధబిందువు-మాచెఁగంజాతుఁడు
సంశ్లేష-మాచెన్గంజాతుఁడు.

ఆదేశపరుషములకుముందు ద్రుతలోపము గలదా?

బిందువనఁ బూర్ణబిందువని యర్థమా? అట్లయినఁ గ్రిందిసూత్రమునఁ బూర్ణబిందువని చెప్పనేల?

(మా. వ్యాకరణసంగ్రహము. ౩ భా. ౪౭ పుట.)

ఈ ౩, ౪ సూత్రములకుఁగల భేదమేమి?

౩. వర్గయుక్పరుషంబులు పరంబులగునపుడు ద్రుతమునకు లోపస్వత్వపూర్ణబిందు సంశ్లేషములు విభాషనగును.

౪. ద్రుతమునకు పరుషములు, స్థిరములు పరమైనపుడు లోపసంశ్లేషములు విభాషనగును.

౩౨వ పుట. ౫ వ సూ. అఁట, ఇఁక చుఁడు అనువానిలోఁ దప్ప మొదటి కులుంచవర్ణముమీఁద అరసున్నగాని ద్రుతముగాని యుండదు.

ఇది యిచ్చటఁ జెప్పఁబడవలసినదిగాదు. "ద్రుతముగాని" ఈద్రుతమున కర్థ మేమి?

౬ వ సూ. వర్గయుక్కులును, పరుషములును, పరంబగునపుడు ద్రుతమునకు స్వత్వసంశ్లేష లోపపూర్ణ బిందువులు విభాషనగు.

ఉదా—:సంశ్లేష—కొలిచెద న్నారాయణుని
స్వత్వము—కొలిచెదను నారాయణుని
లోపము—కొలిచెద నారాయణుని.

౩, ౪, ౬ సూత్రము లొక్కటియే. మూడు నాలుగు సూత్రములకు మాఱుగాఁ దొమ్మిదవసూత్రమున "విభాష" తీసివైచి యుంచినచో సరిపడును. ౬ వ సూత్రము వేలు. ఉదాహృతము వేలు.

౩౩ వ పుట—ఆమ్రేడితమం దన్నియచ్చులకు సంధి యగును. ఉదా:—ఆహా + ఆహా=ఆహాహా
ఔరా + ఔరా=ఔరౌరా
ఓహో + ఓహో=ఓహోహో
ఏగి + ఏగి=ఏగేగి.

ఈయేగేగి సాధువా? ఆమ్రేడితము పరంబగునపుడు అచ్చు లన్నిటికి సంధి నిత్యముగా నగును అని తెనుఁగు వ్యాకరణమున వ్రాసిరి. అందే ౧౩౪వ పుటలో క్త్వార్థకారమునకు సంధిచేయుట దోషము. ఎఱిఁగి + ఎఱిఁగి=ఎఱిఁగెఱిఁగి తప్పు. ఎఱిఁగి యెఱిఁగి ఒప్పు. అని తెలిపిరి. సర్వస్వమందే ౫౯ వ పుట. క్త్వార్థంబైన ఇకారమునకు సంధిలేదు అని యాడిరి. ఈసంధి నిత్యమా? నిషేధమా? ఎట్లు సిద్ధాంతీకరించుట? ఆమ్రేడితమందు మాత్రము నిత్యసంధియా?

౩౭ వ పుట— సమాసములందు ద్రుతమునకు స్వత్వములేదు. ఉదా— అలరువ జొంపములు. ఈ సూత్రమున కిదియే యుదాహరణమని బాలురకు బోధింపవలయునా? పాపము! అని వ్రాయరాదు అని వ్రాయమఱచిరోటు! ఇట్టివి పెక్కులు. ౪౧ వపుటలో ఆ, ఈ, ఏ, (త్రికము) సమాసములో మొదటిపదములై యున్నపుడు వానికి హ్రస్వమును, తరువాతిపదము మొదటిహల్లునకు ద్విత్వమునువచ్చును.

ఉదా:—ఆ + మగువ = అమ్మగువ.
ఈ + తఱి = ఇత్తఱి.
ఏ + పని = ఎప్పని.

(రేఫమునకును, శ, ష, స లకును నిట్లురాదు).

ఉదా:—ఆ + రాముఁడు = ఆరాముఁడు,ఆ + శని = ఆశని. సమాసములో మొదటిపదములై యున్నపుడు. సమాసములో మొదట నెన్ని పదములు వచ్చును? ఆ + ఈ + కార్యము. అని భావించిరా? లేదు.

తరువాతి పదము మొదటి హల్లునకు - అచ్చున కీ కార్యము కానేరదా?

త్రికమున కచ్చు పరము కాఁగూడ దనిరేమొ వారి తలంపు. సమాసములోఁ ద్రికము రెండవపదము గా వచ్చునేమో! అట్టి సందేహమున కెడమీయక వ్రాసిరి గాఁబోలు!

శ ష స లకును నిట్లు రాదు. అనుటలో ‘ను’ కర్థమేమి? శ ష స లకుఁగూడ నిట్లు రాదనియా? శ ష స లతో ‘హ’ చేర్పఁబడలేదు; (తెనుఁగువ్యాకరణమునందును). కాఁబట్టి హకు పైసంధి చెల్లునా? అహ్వాయము, అహ్వారి అని వ్రాయవలెనా?

౪౧-వ పుట. కర్మధారయమునఁ గొన్నిచోట్ల మువర్ణకమునకు బిందుపూర్వక పవర్ణమును, గొన్నిచోట్ల పవర్ణమును వచ్చును.

బిం. ఉదా:—అమ్ము + శయ్య = అంపశయ్య.
పాము + జాతి = పాపజాతి.
ప్రేము + బెత్తము = ప్రేపబెత్తము.

పవర్ణము. ఉదా:—జనుము + నార = జనుపనార.
ఇనుము + ముక్క = ఇనుపముక్క.
మినుము + గింజ = మినుపగింజ.

పై పాపజాతి ప్రేపబెత్తములం దర్ధానుస్వారము లేదు. చేతిపొరపాటో అచ్చుపొరపాటో అని తలంచుటకు తెనుఁగువ్యాకరణమున ౬౪-వ పుట కర్మధారయ సమాసమునందు మువర్ణమునకుఁ గొన్నియెడల ‘ంప’ యును మఱిఁగొన్నియెడల ‘ప’ అను వర్ణకమును వచ్చును.

ఉదా:—(ంప) అమ్ము + శయ్య = అంపశయ్య.
(ప) పాము + జాతి = పాపజాతి.
జనుము + నార = జనుపనార.
ఇనుము + ముక్క = ఇనుపముక్క.

అని వివరించిరి. ౧౨-వ పుటలో వర్ధానుస్వారములు వచ్చు స్థలముల గుర్తించుచు, దీర్ఘాక్షరమునకు ముందుగాఁ గల [ము] వర్ణమునకు ఔపవిభక్తికముగా వచ్చు(ప) అను నక్షరములకు ముందును,

ఉదా:—సాము, సాఁప, వేము, వేఁప, ప్రేము, ప్రేఁప—అని తెలిపిరి. ఇదే సూత్రోదాహరణముల సర్వస్వమును సూచించిరి. ఈసూత్రములకును పైసూత్రములకును పరస్పర వైరుధ్య మగపడుచుండుటలేదా? “కొండొకచో సామాద్యది కనుమాద్యుల మువర్ణంబులు పవ్వర్ణంబు లగు” నను బాలవ్యాకరణసూత్రమున కర్థము సరిగ గ్రహింపరైరి. ఆసూత్రముక్రింది వివరణము నైనఁ జూడరైరి. చిత్రములోఁ జిత్రము! తప్పులోఁ దప్పు! “మఱిఁగొన్ని” ఇందలి యుఱియన్న దెక్కడిది? ఇది పొరపాటు గాదు. సర్వస్వము ౪౦-వ పుటలోఁ గూడ “మఱిఁగొన్ని రూపములు” అని కలదు. మఱి యను నవ్యయము ద్రుతప్రకృతికమా? అయిన ‘మఱియు’ అనుట తప్పగునా. ‘మఱిని’ అనుట యొప్పగును. ౭౪-వ పుటలో ప్రథమోత్తమపురుషల ఏమ్యాదుల ఇకారమునకు సంధి వైకల్పికము. (ఏమి, మఱి, కిమ్మి ...) అని యితరుల వ్యాకరణములలోని రెండుసూత్రముల గ్రహించి యొకసూత్రముగా సకలంకముగా వ్రాసిరి. కాని వానియర్థము గ్రహింపరైరి.

తెనుఁగువ్యాకరణమున నేమ్యాదుల సూత్రమున కుదాహరణమున మఱి + ఏమి = మఱేమి - మఱియేమి అని వ్రాసియున్నారు. ఈవ్రాఁత జ్ఞప్తియం దున్నచో నావ్రాఁత యట్లు పడియుండదు. దీనికి రెండు సమాధానములు గలవు.

౧. తెనుఁగు వ్యాకరణము తరువాత వ్రాయఁబడినది.

౨. అర్థవిశేషమందు ప్రౌఢము.

౪౪వ పుట. ౪౦వ సూ. వానీ శబ్దములకు సమాసమున రువర్ణము వైకల్పికముగా అంతాగమ మగును.

ఈసూత్రమున ‘తన’ వదలిపెట్టఁబడినది.

౪౧వ సూ. ఎవాదు లన్యప్రయుక్తం బగునపుడు క్రియాంతములగు ము, డు, లు వు, రు లగును,



శ్రీజార్జి చక్రవర్తిగారి విందునకు      A.P.

శ్రీ మహాత్మా, మహాదేవ దేశాయి, సరోజినీ దేవి

ఉదా :—చూడుము + ఎండమాడవే,

చూడుము + ఎండమాడకే.

ఏదాదు లన నేవి? వివరణము లేదు.

చూడుము + ఎండమాడవే. ఇందు 'వే' దీర్ఘ మెట్లయ్యెను? ఉపధయగు డువర్ణము డవర్ణముగా నెట్లు మాఱెను?

౪౦వ పుట—విశేష్యభేదములం దెలుపుదు,

గుణవాచకము—వేరువేరు గుణముపేర్లను దెలుపునది. ఉదా—తియ్యని, యోగ్యత, చెడ్డతనము, నల్లని అని యుదాహరించిరి.

ఈతియ్యని, నల్లని నామము లగునా? అట్లయిన పండుతియ్యని. బొగ్గునల్లని. అని వ్రాయవచ్చునా? తెనుఁగువ్యాకరణమునఁగూడ ౬౫ వ పుటలో "తెల్లని, తియ్యని" అని యుదాహరించియున్నారు.

౪౬ వ పుట—క్రియావాచకములు — క్రియల వలన గలిగినపేర్లను దెల్పును. ఉదా :— వండుట, చేయుట.

ఇవియే క్రియావాచకములా? వ్యతిరేకభావార్థకములును, కృదంతములును క్రియావాచకములు గావా? వివరణము లేకున్న నుదాహరణములైన నీయరాదా?

౪౭ వ పుటలో సంబంధసర్వనామముల కుదాహరణ మీయఁబడలేదు.

౪౫ పుట సంఖ్యావాచక సర్వనామములు—సంఖ్యను దెలుపుటయందు వర్తించునవి.

ఉదా:— ఒకఁడు నిజముఁ జెప్పెను కాని, యిద్దరు కల్లలాడిరి. (ఒక్కఁడు, ఒక్కరిత, ఒక్కటి, ఇద్దరు, ఇరువురు, రెండు, మూఁగురు, ముగ్గురు, మూఁడు మొదలైనవి).

(పూర్వులు వీనిని సర్వనామములుగాఁ జెప్పిరి కాని వీనియందు కేవల విశేషధర్మమే కానఁబడుటఁ జేసి విశేషణము లని చెప్పుటయే మేలని తోచుచున్నది).

సంఖ్యావాచకసర్వనామము లనఁగా సంఖ్యను దెలుపుటయందు వర్తించునవియా? బాగు! బాగు! ఒకటి రెండు, మూఁడు విశేషణము లగుఁ గాని సర్వనామములు గాఁజాలవు. ఏనఁ గావచ్చుఁగాక! ఒక్కఁడు, ఇద్దఱు, ముగ్గురు సర్వనామములు కాకపోవు టెట్లు? ఆ ఈ రెండును తె. వ్యా. ౪౨ వ పుటలో సర్వనామములే యైనపుడు ఇవి కాకపోవుటేమి? వానియందు విశేషణ ధర్మము లేదా? నామములు, సర్వనామములు పెక్కులు విశేషణము లగుచుండుట లేదా? మువర్ణాంతములకు పుంపు లాదేశములై విశేషణము లగుచున్నవి. పసిఁడి, వెండి మున్నగునవి యట్లే విశేషణము లగుచున్నవి. అరీతినే కొన్ని సర్వనామములుకూడ విశేషణము లగుచున్నవని నచో సమంజసము కాదా? 'ఇద్దఱు' శకట రేఫాంతముగా నెల్లయెడలఁ గానఁబడుచుండఁగా గ్రంథకర్తలు రేఫాంతముగా నుదాహరించుటయేకాక తెనుఁగు వ్యాకరణమున ౯ వ పుటలో ౨. సంఖ్యావాచకములు రేఫములుగా నుండును. ౩. సర్వనామములు రేఫములు. అని సూత్రీకరించి స్థిరపఱచిరి. వీనికిఁ బ్రయోగము చూపిన బాగు.

మఱొక గొప్పవిషయము. పరిభాషా పదముల కన్నింటికి నాంగ్లపదము లిచ్చుచుండిరి. ౪౫ పుట, మఱియు ౪౪ పుట.

౧. ప్రథమ పురుషము. First person :—ఎక్కడెక్కడి విషయమునో తెలుపును.

౨. మధ్యమపురుషము. Second person :—ఎదుటివానిని దెల్పును. నీవు, మీరు.

౩. ఉత్తమపురుషము. Third person :—తన సంగతిని దెలుపును. నేను, మేము.

ఇట first అనఁగా ప్రథమ యని భ్రమసిరి.

౫౦వ పుటలో ఏకపుంలింగము. ఎవఁడు, ఎవ్వఁడు, ఏఁడు, ఏవాఁడు, ఎవ్వాఁడు మొదలైనవి.

ఏకస్త్రీలింగము:—ఎవ్వరిత, ఎవ్వత...... మొదలైనవిఅని తెలిపిరి. ఈరేఖకళద్దమున కర్థమేమి? ఏకపుంలింగ మనఁగా ఒకపుంలింగమునుమాత్రమే బోధించునది యని యర్థమేమో!

౫౫వ పుటలో ౧౧, ౧౨, ౧౩, ౧౪ పఙ్క్తులు అచ్చులో తప్పులై సంస్కరణాలోపముచే భ్రష్టాకైన వివరింప వీలుకానంత జటిలముగా నున్నవి,

౧౫, ౧౬, ౧౭ పుటలలోఁ జెప్పఁబడిన యంశ ములే మరలఁ గొన్ని యనవసరముగా ౫౬, ౫౭ పుట లలోఁ జెప్పఁబడినవి.

౬౦వ పుట. ఈకారాన్త మేకవచనమందును వికల్ప ముగ వచ్చును. ఉదా:—ప్రాను-ప్రాఁకు.

వ్యాకరణసంగ్రహము ద్వితీయభాగము ౩౭వ పుటలో, కలవ్వాదులకు ఏకవచనంబున వైకల్పికంబుగను బహువచనంబున నిత్యంబుగను పార్ధబిందుక కువర్ణ మగును.

కలను, ఆదులు, కలను, కొలను, కెలను, గవను, నెఱను, ఎరను, కొఱను, ప్రాను మున్నగునవి. ఏకవచన మున కొలను కొలఁకు అగును. వైకల్పిక మనుటచే ప్రాను ఏకవచనమున ప్రాఁకు కాదు.

స్వవచనవ్యాఘాతశంక మీరి కావంతరైనఁ గానము. వైకల్పిక మన నర్ధమే తెలియదు.

౭౦వ పుట. ౨ సమాసములు, ౧. సిద్ధము లేక సాంస్కృతికము, ౨. సాధ్యము లేక మిశ్రము, ౩. ఆచ్ఛి కము అని మూఁడువిధములు.

౩. ఇవి ౧. తత్పురుషము, ౨. కర్మధారయ ము, ౩. బహువ్రీహి, ౪. ద్వంద్వము, ౫. ద్విగు మొదలగు భేదములతో నుండును. ఈ 'మొదలగు' మఱి వేనిని దెలుపునో! వివరణము లేదు. తెనుఁగు వ్యాకరణమున సమాసప్రకరణముంగూర్చి వ్రాయుటకే మఱచిరి. వ్యాకరణసంగ్రహముద్వితీయభాగమున మఱొక విధమున సమాసముల విభజించిరి: ఎట్లన,

ఆంధ్రభాషయందు సమాసము మూఁడు తెఱఁగులు. సాంస్కృతికసమాసము; ఆచ్ఛికసమాసము; మిశ్రస మాసము.

సాంస్కృతిక సమాసము రెండు విధములు: ౧. సిద్ధము, ౨. సాధ్యము. సంస్కృతవ్యాకరణానుకూలముగఁ గూడినది సిద్ధము. సంస్కృతసమంబులచేఁ గలుగు సమా సంబు సాధ్యంబు. సాధ్యము తత్సమస్వరూపము గలదిగ నుండును. తద్భవములు, దేశ్యములు, ఆచ్ఛికములు(అచ్చ తెనుగులు) వీనితోనగు సమాసము ఆచ్ఛికము. సంస్కృత సమంబులకును, అచ్చ తెనుఁగు పదంబులకును గలుగు కల యిక మిశ్రసమాసము.

అర్థభేదంబువలన సమాసంబులు నాలుగువిధములు: ౧. ద్వంద్వము, ౨. తత్పురుషము, ౩. బహువ్రీహి, ౪. అవ్యయీభావము. ఇట్లొకచో నొకవిధముగ, మఱొ క్కచో మఱొకవిధముగ, నొక్కొక్కచో నొక్కొక్క విధముగ, వీరు వ్రాయుచుండ నేది స్థిరమో నిశ్చయింపఁ గాదు. ఒకతప్పును, ఇది పొరపాటా? తప్పా? యని పరి శీలింపఁగడంగిన నడుగడుగునకు లెక్కలేని తప్పులగపడి మొదటివిషయమును మఱవఁజేయుచున్నవి. తప్పులోఁ దప్పు. ఆతప్పులోఁ బొరపాటు. ఆ పొరపాటులో మరలఁ దప్పు. ఇట్లు పెక్కుతప్పుల కాకర మయినది. దీనిని విద్యార్థులు చదువకుంట శ్రేయము. ఇది యెట్లు టెక్స్టు బుక్కుకమిటీవారిచే నంగీకరింపఁబడియెనో చాలచిత్రము. ప్రచురణకర్తలు గ్రంథకర్తలఖ్యాతి విని మాచుటమానిరి గాఁబోలు! భాషను ననరించునది వ్యాకరణము. అందుఁ దప్పులు గలిగినచో భాషగతి యేమి? బాలు రెట్లు సు శబ్దముల గ్రహింపఁగల్గుదురు? ఉపాధ్యాయు లెట్లు బో ధింపఁ గల్గుదురు?

బాలురు సాధారణముగఁ జేయుతప్పు లని యొక పట్టిక నిచ్చుచు నందుఁ దప్పుని యొప్పులను, ఒప్పు లని తప్పులను దాఱుమాఱుగ వ్రాసియున్నారు. వీనియం దు బాలురు వేనిని గ్రహింతురు? ఉపాధ్యాయుని వాక్కు లెట్లు విందురు?

సూక్ష్మదృష్టిం బరిశీలింపఁ దలనొప్పి యగుటచే స్థాలీపులాకన్యాయమునఁ బరిశీలించి వ్రాసితిని. చక్కఁగా విమర్శింపఁబూనినచోఁ బెద్దగ్రంథ మగును. ఇఁక నొకటి రెండు ముఖ్య మగునవి చూపి విరమింతును.

౭౨వపుట. సంభావనా పూర్వపదము:—ముఖపద్మ ము=ముఖము అనుపద్మము—దీనిని రూపకసమాసమందురు.

రూపకమును సంభావనాపూర్వపదమును నొక్కటి యగునా? భేదము లేదా?

౮౩వ పుట. ద్విగుసమాసము:—విశేషణము సంఖ్యావాచకము గలది.

ఉదా:—ముక్కాలు, మూడుకాలులు.
నలుకడలు, నాలుగుకడలు.

ద్విగువు విశేషణము గలదియా? విశేషణ మగు సంఖ్యావాచకము గలదియా? లేక రెండును గలదియా? అర్థము కాకున్నది. ఇట్లు వ్రాసిన విద్యార్థులకుఁ 'కొలుకరానికొయ్య' కాదా? ఈ యుదాహరణము లోని కాలుశబ్దమున కర్థమేమి? కాల మనునర్థమున కాలుశబ్దమున కికటకేషమా? ప్రయోగము కలదా?

౮౪వ పుట. ౧. అలుక్సమాసము:—విభక్తిప్రత్యయములు గలది.

ఉదా:—వనేచరుఁడు, నాతోడిచెలిమి.

౨. లుక్సమాసము:—చివర విభక్తిప్రత్యయములు లేనిది.

ఉదా—వృక్షమూలము. లుక్సమాసమున విభక్తి ప్రత్యయములు లోపించునా? లేక యే పోవునా?

౮౬వ పుట. కాలమును దెలుపునవి కాలములట!

వర్తమానకాలము:—ఇప్పుడు జరుగుచున్నకాలమును దెలుపును.

భూతకాలము:—జరిగిపోయినకాలమును దెలుపును.

౮౭వ పుట. కర్తలనుబట్టి క్రియలకు ౧. ప్రథమ, ౨. మధ్యమ, ౩. ఉత్తమపురుషములు గలవు.

ప్రథమపురుషము First person:— ప్రథమపురుషసర్వనామముగాని, నామవాచకముగాని కర్త కాఁగలది.

ఉదా:—వాఁడు వచ్చెను, రంగఁడు రాఁగాఁడు

మధ్యమపురుషము Second person—మధ్యమపురుషసర్వనామముగాని, నామవాచకముగాని కర్తగాఁ గలది. ఉదా—నీవు వచ్చితివి, ఈరంగఁడు రాఁగలఁడు.

మధ్యమపురుషనామములు కొన్నియు, ప్రథమపురుషనామములు కొన్నియుఁ గలవా? లేక 'ఈచేర్చి నచో' నన్నినామములును మధ్యమపురుషలగునా? ఇది బాలురుచాల హెచ్చరికతో గమనింపఁదగినవిషయమే!! ఏల వివరింపరైరి?

౧౦వ పుట. ఆత్మనేపదార్థము— క్రియ ఫలము కర్తను జెందునవు డేర్పడును. ధాతువుచివరను కొను ధాతువు చేర్చుటచే నేర్పడును. (అప్పుడు ధాతువు కొనయందలి ఉకారమునకు ఇకారము వైకల్పికముగనగును.) ఉదా—పోషించుకొను—పోషించికొను. కొట్టుకొను= కొట్టికొను.

ఇంత వివరము వ్రాసినవారు యకారాంత ధాతువుల కీఇకారము నిత్యమని యేల వ్రాయలేదు? వ్రాసుకొను, చేసుకొను అనురూపములు సాధువులనియే గ్రంథకర్తల యుద్దేశమా? ౧౧౬వ పుటలో 'తీసుకొన్న' అని వారి ప్రయోగము.

వ్యాకరణసంగ్రహముతృతీయభాగమున కి౯వ పుటలో కొనుధాతువు పరంబగునెడ యకారాంత ధాతువులకు నిత్యంబుగను, దదన్యంబులకు వైకల్పికంబుగను ఇగాగమం బగు, అని వ్రాసిరి. అయిన సర్వస్వమున నేల మఱచిరి? అది వ్రాయునప్పుడు దొరకిన పుస్తకములలో నట్లుండె, ఇది వ్రాయునపుడు చూచిన గ్రంథములలో నిట్లుండెఁ గావలయు.

౧౯వ పుట (ట) ధాతువు తుదను ఉత్తమపురుష యేకవచన బహువచనములందు క్రమముగా దును, దుము వర్ణకములును, రూపాంతరమందు ఎదను, ఎదము వర్ణకములును చేరుటచే తద్ధర్మకాల మేర్పడును.

ఉదా—పోషించుదును, పోషించుదుము, కొట్టెదను, కొట్టెదము.

ఈపోషించుదును పోషించుదుములు సాధువులా?

(త) మధ్యమపురుషవు వర్ణము వైకల్పికముగా లోపించి తుది అకార ముకారమగును.

ఉదా— కొట్టుదు. ఇది అచ్చు పొరపాటు కాఁబోలు! (వ) ఇంచునకు నవర్ణము పరమగునపుడు వైకల్పికముగ చువర్ణము లోపించి నకారమునకు తకారమును, రువర్ణము పరమైన వైకల్పికముగ ఉకార లోపమును నగును. ఉ—పోషింత్రు-నిందింత్రు.

దీనికిఁ జాల వ్యాఖ్య వ్రాయవలసి యున్నది. 'ఇంచునకు న వర్ణము పరమగునపుడు' పోషించున, నిందించున అగును. అపుడు 'వైకల్పికముగా చువర్ణము లోపించి' పోషింన, నిందింన అయి 'నకారమునకు తకారమును' పోషింత, నిందింత అయి 'రువర్ణము పరమైనపుడు వైకల్పికముగ ఉకార లోపమును గలుగును.' పోషింతరు, నిందింతరు అనిరైనఁ గావచ్చు. పోషింతర్, నిందింతర్ అనిరైనఁ గావచ్చును. వా రుదాహరించినట్లు పోషింత్రు—నిందింత్రు కానేరదు. ఉకార లోప మనిరే ఏ ఉకారము? వారి సూత్రమున రువర్ణమందు మాత్రమే ఉకారము గలదు. నవర్ణము ఉకారాంతమా యని యూహించుటకును క్రిందనే రువర్ణము అని హెచ్చరించి అట్లూహింపవల దనిరి. ఇది ప్రథమపురుషయందలి తద్ధర్మార్థకక్రియ యని బాలురకు మున్నే తెలిసియుండినచో మంచిది. లేకున్న నిది భూతకాలమునకు సమీపపుఁ బిశాచకాల మనియు నుత్తము మధ్యములు కాకపోవుటచే వారిమదికిఁ దట్టకునఁ దోఁచు నధమపురుష మనియు నూహించి భయపడఁగలరు.

మఱియు వీరు ౮౯, ౯౦ పుటలలో నవలంబించిన పద్ధతి చాలచిత్రము. ౯౧వ పుట చదివిన పిమ్మటనే బాలురు వానినిఁ జదువవలసియుందురు. లేకున్న నుపాధ్యాయుఁ డొక్కొక్క వాక్యమునకు వివరణము చెప్పలేక యల్లాడవలసినదే. ౯౧వ పుటలోఁగూడ రెండవ సూత్రముకంటె ముందుగ మూఁడవసూత్రము చేర్చుకోవలసి యున్నది.

౭౬వ పుటలోఁ జెప్పఁబడవలసిన క్రియావాచకములు ౯౩వ పుటలోఁ జెప్పఁబడినవి. అది యిచ్చటఁ జెప్పఁబడుటకుఁ గారణముగాని, అవసరము గాని కానరాదు.

౧౧౯వ పుట. శబ్దలక్షణము చేయురీతిని వివరించుచు ౫. సకర్మకమా? అకర్మకమా? ౬. సదర్థకమా; అసదర్థకమా? అనిరి: ఈసదర్థకాసదర్థకము లేవో వానిస్వరూప మెట్టిదో వివరింపకపోయిరి.

అన్వయక్రమమునకై యుదాహరించినవాక్యమున "అచ్చటి' అవ్యయ మని తెలిపిరి.

౧౧౪వ పుట. ఇది అవ్యయ మెట్లయ్యె? 'ఆచోటు' త్రికసంధిచే 'అచ్చోటు' అయి రూపాంతరమున 'అచ్చటు' అయి దానిసప్తమి 'అచ్చట' అయి, సమాసమున నిత్వమువచ్చి 'అచ్చటి' అయినది ఇది నామముగాక యవ్యయ మెట్లగు? కొన్ని నామము లవ్యయము లగుట కలదు కాని యిది యిచ్చటఁ గాలేదు.

౧౧౭వ పుట. రెండులఘువులకు | లా యనియు, రెండుగురువులకు U గా యనియు గుర్తులు గలవు. | ఈగుర్తునకు లాయనియు U ఈగుర్తునకు గా యని యేఁ బేరులా?

౧౧౯వ పుట. ఉపగణము:—గురులఘువులైన రెండేసియక్షరములు గలది.

* * *

ఉపగణములలో (౧) సూర్యగణములు (౨) ఇంద్రగణములు ముఖ్యములు.

సూర్యగణములును, ఇంద్రగణములును రెండక్షరముల గణములే యగునా?

ఉదాహరణము వేఱుగా నున్నదే?

౧౨౦వ పుట. యతిమైత్రి:—అ, ఆ, ఐ, ఔ, అం, అః. బిందువిసర్గములు అ ఆ ఐ ఔ లతోఁ దక్కఁ, దక్కినవానితోఁ జెల్లవా?

౧౨౧వ పుట. ంమ, ంప, ంఫ, ంబ, ంభ, ఇందలి 'ంమ' కర్థమేమి? ఇది యెట్టిచోటుల వచ్చును?

ఙ, అ, య, హ. యనునది మాత్రమే అ య హ లకుఁ జెల్లుననియు, తక్కిన పదులు ఆజాత్యక్షరములతో యతి చెల్ల దనియు నర్థమా?

పద్యములు:—యతి ప్రాసములతోఁ గూడిన నాలుగు పాదములు గలిగియుండవలయును అని శాసించిరి. యతిగాని ప్రాసముగాని లేనిది పద్యము గాదా? ఉపజాతులకు యతిప్రాసములు రెండును గలవా?

౧౨౨వ పుట. వృత్తములు:—మూఁడక్షరములు గల గణములతోఁ జేర్పడి యక్షరనియమము గలిగియుండవలయును.

మూఁడక్షరముల గణములే వృత్తములకు రావలయునని చండశాసనము కావించిరే! మత్తేభమునకు నగణ మెట్లు చేర్చిరి? ఉత్పలము నెట్లు మార్చిరి?

౧౨౩వ పుట. జాతులు. కందపద్యము మొదలైనవి. ఇంతే! ఇంతకంటె వివర మక్కఱలేదు.

౧౨౮వ పుట. ఉపజాతులు:—౧. తేటగీతి, ౨. ఆటవెలఁది, ౩. సీసము.

ఇఁక నాల్గవది లేదా? ఉపజాతు లన నెట్టివో వివరము తెలియనక్కఱలేదా? తేటగీతికి యతియేని ప్రాసయతియేని యుపయోగింపవచ్చు ననిరి కాని ప్రాసయతినిగూర్చి వివరింపరైరి. బాలురు మున్నే తెలిసికొని యుండవలసినదని వారిభావమా? ఒక ఫారము చదువు విద్యార్థు లంతమాత్ర మెఱింగియుండకపోదురా యని యుపేక్షించిరోటు!

౧౫౬వ పుట. శబ్దాలంకారము:—శబ్దమున అర్థము విచారింపక శ్రావ్యము లైనది. ఈవాక్యమున కర్థమేమి? అన్వయ మెట్లు?

౧౫౯వ పుట. ఆక్షేపము. ఉదా:— ఓ ప్రాణనాయకా! వదలిపోవుచున్నావుగదా! నా జన్మమున యుద్దేశ్యదేశంబున నే గలుగుఁగాక. పైదానికివలె దీనికిని అర్థము అన్వయము తెలుపఁదగు.

౧౩౦వ పుట. తుల్యయోగిత కుదాహరణము లేదు.

దృష్టాంతము:—ఉదా:—పరిమళము నాఘ్రాణింప కున్నను మాలతీపుష్పమాలిక నేత్రపర్వముగును.

ఇది దృష్టాంతాలంకారమున కుదాహరణ మగునా?

వ్యాకరణగ్రంథమం దచ్చుతప్పులకేని యెడమీయరాదు. ప్రతివాక్యము, తుదకు ప్రతిపదము,అందు అచ్చుతప్పులుగానో మఱియెట్లో పడిన యక్షరములు సందేహములఁ గలిగించి పాఠము సాగనీయకున్నచో నాగ్రంథము నేమి చేయవలసినది? విద్యార్థులకుఁ దప్పులు దిద్దఁబోయి మనమే తప్పులుచేసినఁ బరిహాసపాత్రులము కామా?

గ్రంథముద్రణావసరమున ప్రూఫును సవరింప నవకాశము లేనిచో స్థిరముగఁ దప్పు లచ్చుపడి యక్షరరూపము నొందవలసినదేనా? "పాఠకసౌలభ్యము కొఱకుఁ గొన్నిటిని శుద్ధపత్రికయందు దెలిపి యున్నార" మనిరి కాని శుద్ధపత్రికయే కానరాదు. "గ్రంథ బాహుళ్యమునకు వెఱచి ప్రతితప్పును దెలిపియుండలే"దని గ్రంథము ప్రతితప్పు అనియందుఁగూడఁ దప్పులనే తెలిపినచో గ్రంథము కడుపునఁ జిక్కలేదని సాభిప్రాయముగా నెవ్వరే ననరా? "కావున నట్టి లోపములను సవరించికొనఁ బ్రార్థింపుచున్నార" మనిన ప్ర + అర్థింపు చున్నారము. ముఖ్యముగ వారిని సగము చేయుదురా?

ఈ గ్రంథకర్తలే రచించిన తెనుఁగు వ్యాకరణమందును, వ్యాకరణ సంగ్రహము మూఁడు భాగములందును నిట్లే యన్ని విధముల దోషము లున్నవి. విస్తరభీతిచే వివరింపనైతి. వివరించియుఁ బ్రయోజనముగపడదు.

# ప్రతాపరుద్రచక్రవర్తి

శ్రీ శేషాద్రిరమణకవులు

ఆంధ్రరాజులలోఁ గాకతీయులు ప్రథమగణ్యులు. వీరల దివ్యచరిత్రము పాడైనకోటగోడలలో నిద్రపోవుచున్నది. ఆంధ్రదేశమునకు, వాఙ్మయమునకు అపారసేవ గావించి ఆంధ్రజాతీయత నేటికిని సుస్థిరముగ నుంటకు హేతుభూతులగు ఈవంశజుల చరిత్రము అవిశ్వసనీయములగు కట్టుకథలతో నిండియున్నది. వీరల చరిత్రము దెలుపు శాసనములో, చాలవఱకు దుర్వినియోగము లైనవి. కాకతీయరాజుల జీవితములు దెలుపు ప్రతాపచరిత్రము, సిద్ధేశ్వరచరిత్రము, సోమదేవరాజీయము పరస్పరసంబంధము లేకున్నవి. ప్రతాపచరిత్రము మేము నాలుగైదువిధములగు ప్రతులఁ జూచితిమి. పరిషత్తువారి ప్రచురణమునకు, వరంగల్లు శైవప్రచారిణీవారి ప్రచురణమునకు సంబంధమే లేదు. మావద్దఁ గల ప్రతి, హైదరాబాదు పరిశోధకశాఖలోని ప్రతియు విశేషాంశములు గలవే గాని రెంటికిని పొత్తు కుదురదు. పైఁగా నివి యన్నియుఁ జరిత్రము కెంతవఱకు సంబంధించునో తెలుపఁజాలము. కాకతీయవంశజుల చరిత్రము గ్రహించుటకుఁ బ్రధానసాధనములు తిక్కాలపు శాసనములు. తరువాతది ప్రతాపరుద్రుఁ డంకితముగొన్నదియు, సమకాలికుఁడగు విద్యానాథకవి రచించిన ప్రతాపరుద్రీయము. కాకతీయుల చరిత్రమునుగూర్చి బ్రహ్మశ్రీ విద్వాన్, కజ్జీ సాంబమూర్తిశాస్త్రిగారు ఆషాఢమాస భారతియం దొకవ్యాసము వ్రాయుచుఁ బ్రతాపరుద్రునకు, రుద్రమదేవికిఁ గల సంబంధము, రుద్రమదేవికి గణపతిదేవునకుఁ గల సంబంధము దెలుపుటలోఁ బొరపడిరి. అంతియ కాక, సోమదేవరాజీయమును ఆధారముగఁ దీసికొని వారొనరించిన కాకతీయచరిత్ర నిరూపణముగూడ సంశయభూయిష్ఠమే. సమన్వయించుటలోఁ గుదురక శాస్త్రిగారు భ్రమపడిరనియు, ఉన్నంతవఱకుఁ గాకతీయచరిత్రము ప్రతాపరుద్రీయములో స్పష్టముగ, నిర్వివాదముగ నున్నదని రుజువుచేయుటకును, బ్రతాపరుద్రునిగూర్చిన వివరము దెలుపుటకు నీవ్యాసము వ్రాయఁబోవుచున్నారము.

"ప్రతాపరుద్రుని చరిత్ర మెఱుంగుటకు నీతని కంకితముగా రచింపఁబడిన ప్రతాపరుద్రీయమువంటిఁ గూడఁ గొన్ని యాధారములు గలవు. ప్రతాపరుద్రీయమువలన నీరెండు (రుద్రమదేవి గణపతిదేవుని భార్య, కొమార్తె యను) వాదములు పుట్టుట కవకాశము కలదనియుఁ, గాని రుద్రమదేవి గణపతిదేవుని భార్యయేకాని తనయ కాదనియుఁ, బ్రతాపరుద్రుని గన్నతల్లియగు ముమ్మక్క యొక్కతెయే గణపతిదేవుని తనయయనియు, ఆమెకు రుద్రాంబయను నామాంతరము గూడ నక్కడక్కడ వ్యవహరింపఁబడె ననియుఁ దెలియనగును."

ఉదాహృత భాగములు సాంబమూర్తి శాస్త్రిగారివి. ఈ రీతియభిప్రాయము ప్రతాపరుద్రీయమునుండి సంగ్రహించిరఁట. ప్రతాపరుద్రీయము రుద్రమదేవి గణపతిదేవుని భార్యయని చెప్పుచున్నదా? ఎచటను చెప్పలేదు. ఇందులకు ఆధారముగ వా రుదాహరించిన శ్లోకములలోఁగూడ నాయర్థము లేదు. నాటకప్రకరణములో రుద్రమదేవీరాజ్ఞి గణపతిదేవుని పుత్రికయనియు, నామెయే మనుమఁడగు ప్రతాపరుద్రుని పుత్రునిగ స్వీకరించెననియు కలదు. ఇట భ్రాంతికిఁ దావు లేదు. రుద్రమదేవి రుద్రదేవుఁడని వ్యవహరింపఁ బడెను. ఈవ్యవహారము శాసనములందును గలదు. ఈయమ కాకతీయవంశజురాలని విద్యానాథుఁడు స్పష్టముగఁ జెప్పెను.

'సోఽయం జాత స్త్రిలోకీప్రథిత సుచరితే
కాకతీయాన్వవాయే
యస్మై శ్రేయాం స్యజస్రం వితరతి భగవాన్
దేవదేవ స్స్వయంభూః;
యస్యాజ్ఞా సర్వపృథ్వీపతిమకుట మణి
శ్రేణి శేఖీవయస్యా

'సోఽయం భూపాలమౌళి ర్జయతి సుమహితో
రుద్రదేవో నరేంద్రః.'

ఈశ్లోకమునందలి రుద్రనరేంద్రుఁడే రుద్రమదేవి మహారాజ్ఞి. [ఈ మె త్రిలోకప్రసిద్ధమగు కాకతీయాన్వయమున జనించెను. స్వయంభూదేవుఁ డీమెకు శుభప్రదాత. ఈమె యాజ్ఞ రాజులకుఁ దిలమానికము. రాజులలో నీయమ రత్నము. (సంబోధమునకై పుంలింగవిశేషణములఁ బ్రకరణానుసారము రుద్రమదేవికి నన్వయించి స్త్రీలింగవిశేషణములుగఁ జెప్పుచున్నారము.)]

'యో రుద్రో రజతాచలే స్థితి మగా
దర్ధాంగనారీః పురా
సోఽయం సంప్రతి కాకతీశ్వరకులే
సర్వాంగనారీ స్థితః;
స్థానే య ద్విషమావలోకనకళా
మాత్రేణ భస్మీకృతా
న్యాసన్ వైరిపురాణి చిత్ర మధునా
ఖడ్గే విషం ధార్యతే.'

[రుద్రుఁడు వెండికొండపయి తొల్లి అర్ధాంగనారిగ నుండెను. ఆతఁ డిపుడు కాకతీయరాజుల యింట పూర్తిగా ఆఁడుదియై (రుద్రమదేవిగ) ఉండెను. విషమదృష్టిచే వైరిపురములఁ గాల్చుచు ఖడ్గమున విషము ధరించెను.]

ఈరెండు శ్లోకములు రుద్రమదేవి కాకతీయవంశమున జనించినట్లు చెప్పుచున్నవి. గణపతిదేవునివలె రుద్రమదేవియుఁ గాకతివంశోద్భవురా లనుటకు సందియము లేదు. ఇంకొ నీయంశము బలపఱచు నాధారములు లేకపోలేదు.

'సై సోమాచేతి నిర్దిష్టా సోమాచేతి ప్రథా మగాత్;
తవ మాతా శివా సాక్షా ద్దేవో గణపతిః పితా.'

[నీ(రుద్రమదేవియొక్క)తల్లి ఉమయను నిర్దేశము గలది. ఆమె ఉమగాన సోమయని పేరొందెను. (ఆమె పేరు సోమలదేవి.) తండ్రి ప్రత్యక్షముగా గణపతిదేవుఁడే.] ఉమామహేశ్వరు లిట సూచితులు. ఈ యంశమే ఇంకను స్పష్టముగా విద్యానాథుఁడు మంత్రిముఖమున నిటులఁ జెప్పినాఁడు:

'అన్యథా కథం ఈశ్వరప్రసాదాదృతే నిరంకుశం స్త్రీవ్యక్తివిశేషస్య లోకాధిపత్యం? ఏవం మానవశంభునా గణపతిరాజేన అభ్యంతరస్య అనుభవమహిమ్నా సన్యాసమాత్ర పుత్ర ఇతి వ్యవహారః కృతః, తదనుగుణాభిః రుద్ర ఇత్యాఖ్యా.' ["ఇతర మెట్లగును? దైవానుగ్రహమట్లు లేదేని స్త్రీవ్యక్తికి నిరంకుశమగు లోకాధిపత్య మెట్లు చేకూరును; మనుజరూపధారియగు నీశ్వరుఁ డని తలంపఁబడి గణపతిదేవుఁడు ఆత్మానుభవమహిమ గలవాఁడయి కుమారుఁడని ప్రకటించెను. తదనుగుణముగ రుద్రుఁ డనుపేరు పెట్టెను.]

రుద్రమదేవి తన మనుమని (దౌహిత్రుని) పుత్రునిగాఁ గైకొనినటులఁ బ్రతాపరుద్రీయమున స్పష్టముగాఁ గలదు. ప్రతాపరుద్రుని తల్లి ముమ్మడమ్మ. ఈయంశము నాయక ప్రకరణములోని 'కౌసల్యాసీ త్ప్రథమజననీ దేవకీచ ద్వితీయా విఖ్యాతా తదను మహితా ముమ్మడాంబా తృతీయా' అను శ్లోకమున సువ్యక్త మగుచున్నది. ముమ్మడమ్మ రుద్రమదేవిపుత్రి యనుట లోకమంతయు విశ్వసించిన యంశమె. రుద్రమదేవితో నీశ్వరుఁడు జన్మకాలముననే ప్రతాపరుద్రుని కుమారునిగాఁ గైకొమ్మని చెప్పెనఁట. అందుచేతనే మనుమఁడు కుమారుఁడని వ్యవహరింపఁబడెను.

'స్వీకృతే పుత్రభావేన దౌహిత్రే ప్రాజ్యమాజ్ఞయా;
అస్మి న్నిధేహి ధారేయ సర్వ్వ ముర్వీధురా మితి.'

రుద్రమదేవి తన పుత్రికాపుత్రుని బుత్రభావముతోఁ గైకొని రాజ్యము నొసంగినందు కీ యుదాహృతి శ్లోక మాధారము కాఁగలదు. రుద్రమదేవిని ప్రతాపరుద్రదేవుఁడు తండ్రియని వ్యవహరించెను. ఆయమ పుత్రుఁడనియే పేర్కొనెను. ఉదాహృత ప్రతాపరుద్రీయ భాగములు రుద్రమదేవి గణపతిదేవుని పుత్రియని కంఠోక్తిగఁ బేర్కొనుచున్నవి. గణపతిదేవుని భార్య సోమలదేవియనియు, ఆమెయే రుద్రాంబ జననియనియు గ్రంథస్థమగు నాధారము గలదు. అందుచే ప్రతాపరుద్రదేవుఁడు

రుద్రమదేవికి మనుమఁడనియు; గణపతిదేవునకు రుద్రమదేవి పుత్రియనియుఁ, బుత్రవ్యవహారముతో నాయమను రాజునుగ గణపతిదేవుఁ డొనరించెననియుఁ బ్రతాపరుద్రీయము కంఠోక్తిగఁ జెప్పుచున్నది. ప్రతాపరుద్రునకు సమకాలికుఁడగు విద్యానాథుఁడు చెప్పినది ప్రమాణము గాని, తరువాత నూటునూటయేఁబది సంవత్సరముల కున్న ప్రతాపరుద్రీయవ్యాఖ్యాతయగు కుమారస్వామి సోమయాజిసిద్ధాంతములు ప్రమాణములు కావు. అంతియ కాదు, మూలవ్యతిరేకములు. గణపతిదేవునకు రుద్రమదేవి భార్యయని తనకయి తాను సిద్ధాంతముచేసిన కుమారస్వామిసోమయాజి వాక్యములను విద్యానాథుని వాక్యములలోఁ గలిపి శాస్త్రిగారు స్వవచోవ్యాఘాతదోషము విద్యానాథునిపయి నంటఁగట్టిరి. ప్రమాదభూయిష్ఠమగు కుమారస్వామినిర్ణయమునకుఁ దోడుపడు మూలము ప్రతాపరుద్రీయమున లేదు. పై నుదాహరించిన 'యో రుద్రో రజతాచలే' అనుశ్లోకమునకు కుమారస్వామి సోమయాజి ఈక్రింది యవతారిక వ్రాసినాఁడు. దీని కనువగు మూలము లేనప్పు డెట్లిది ప్రమాణము?

'పురాకిల కాకతీయకులసంభూతే గణపతినామ్ని మహారాజే దుహితృమాత్రసంతానే కదాచి ద్దైవయోగేన కాలపరిపాక ముపేయుషి. తన్మహిషీ రుద్రమదేవీ బహూని వర్షాణి తద్రాజ్య మకంటకం పరిపాల్య పరిణతాసతీ దౌహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురాం నిదధే.'

[తాత్పర్యము—కాకతీయవంశజుఁ డగు గణపతిదేవుఁడు పుత్రికామాత్రసంతానుఁడై దైవవశమున మరణింప నాతని భార్య రుద్రమదేవి చిరకాలము రాజ్యమేలి ముదుసలితనమునఁ బ్రతాపరుద్రుఁడను మనుమనికా రాజ్యము నొసంగెను.]

ఈకథ వ్యాఖ్యాతది. ఈకథకును దాని ననుసరించిన రుద్రమదేవి కాకతివంశమున జనించినదను వంశమునకుఁ గాని గణపతిదేవుఁడు రుద్రమదేవియను పుత్రికి రాజ్యము నొసంగెనను వంశమునకుఁ గాని సంబంధము కలియుట లేదు. నిర్మూలమగు వ్యాఖ్యాతవాదము త్రోసివేయఁబడినదని పలువు రిదివఱకే సిద్ధాంతీకరించిరి. వ్యాఖ్యాతవాదము విద్యానాథుని సిద్ధాంతముగఁ గైకొనుటచే శ్రీశాస్త్రిలవారు ప్రమాదపడిరి.

ప్రతాపరుద్రీయమునుండి శాస్త్రిగారు ఆధారములను ఎనిమిదింటిని చూపినారు. అందు మూఁడవది వారి వాదమునకుఁ గాని, యితరవాదమునకుఁ గాని సరిపడని శరదాగమవర్ణనము. ప్రకృతమున నది నిరర్థకము. అటులె వారలు తమ వాదమున కనుకూలమని మొదట నుదాహరించిన "దేయా త్సిద్ధిం" అనుశ్లోకము గూడఁ బ్రకృతమున కుపకరింపనిది. ఇందు రుద్రాంబా గణపతిదేవులు భార్యాభర్తలని సూచింపఁబడినటుల శాస్త్రిగారు నిర్ణయించిరి. ఆభావమునకే తావు లేదు. కవిభావ మది కాదు. వ్యాఖ్యాత సూచింపలేదు. శాస్త్రిగా రేల యిట్లు నిర్ణయించిరో?

విద్యానాథుఁడు

'శ్లో. దేయా త్సిద్ధిం మహాలక్ష్మీ
ర్జగద్రక్షాధురంధరా,
విష్ణువక్షస్స్ఫురన్మాలా
విహితాలయతోరణా.'

అనుశ్లోకము వ్రాసి, యిది ప్రతాపరుద్రుని రాజ్యలక్ష్మీప్రాప్తిని అర్థశక్తిచే సూచించుననియు, ['ఏషా నాందీ ప్రతాపరుద్రస్య రాజ్యలక్ష్మీమంగళవిధిలక్షణా'] ఈ నాంది ప్రతాపరుద్రుని రాజ్యలక్ష్మీమంగళవిధికి లక్షణ యనియుఁ జెప్పెను. శాస్త్రిగా రిది రుద్రమదేవీ గణపతిదేవుల దాంపత్యసూచన మనుట కాధారములు గావు. కావున వా రుద్దేశించిన యీయాధారము పూర్తిగా నిరుపయోగము, ప్రమాదము.

శాస్త్రిగారు ఈక్రింది శ్లోకమున రుద్రమదేవీ గణపతిదేవులు దంపతులని సూచింపఁబడిరని తెలిపినారు:

'భూభృత్సుతామహాదేవౌ
పితరౌ యస్య విశ్రుతౌ,
వరనాగాకృతి శ్శ్రీమాన్
స దేవ శ్శ్రియసేఽస్తు నః,'

ఇది విరుద్ధసిద్ధాంతము. నాటకప్రకరణము ప్రతాపరుద్రుని నాయకత్వము గలది గాన పైశ్లోకమున సూచింపఁబడిన భూభృత్సుత ముమ్మడమ్మ. ఈమె ప్రతాపరుద్రుని తల్లి, మహాదేవుఁడు ప్రతాపరుద్రుని తండ్రి యగు మహాదేవరాయలు. వ్యాఖ్యాత దీనిని గమనించియే 'యస్య కథానాయకస్య భూభృత్సుతా రాజపుత్రీ ముమ్మడంబా, మహాదేవః తన్నామకో మహారాజః పితరావితి విశ్రుతౌ' అని వ్రాసినాఁడు. కాన నిందు సూచితులు ప్రతాపరుద్రుని తల్లిదండ్రులగు ముమ్మడమ్మమహాదేవు లైయుండ, రుద్రాంబాగణపతిదేవు లనుట ప్రకృతమునకు సందర్భమునకు, నాటకలక్షణకు వ్యతిరేకము. ప్రతాపరుద్రుని తల్లిదండ్రులు ముమ్మడాంబామహాదేవరాయలని ప్రతాపరుద్రీయనాయకప్రకరణమున ౧౪-వ శ్లోకమునందు సైతము గలదు. కావున పైమహాదేవపదమును గణపతిదేవుఁడనుగాఁ జెప్ప వీలుండదు.

'మురారే ర్యః పూర్వం
జలనిధిసుతాయా ముదభవ
న్మహాదేవా జ్జాత
స్స పున రవనీభృద్దుహితరి,
వపుష్మా న్సాకారం
జయతి జగతీభాగ్యవిభవైః
ప్రతాపశ్రీరుద్రః
స్వయమితి మనీషా మృగదృశామ్.

'వ్యాఖ్య.— మహాదేవాత్ మహాదేవనామకా న్మహారాజాత్, అవనీభృద్దుహితరి రాజపుత్ర్యాం, ఈశ్వరాత్పార్వత్యా మితివ ధ్వన్యతే.'

పూర్వశ్లోకమునందు సూచితులు ముమ్మడాంబామహాదేవులనియు, అటులె యీశ్లోకమునందును వారలె సూచితులైరనియుఁ, బ్రతాపరుద్రుని తండ్రి మహాదేవరాయలనియు శ్రీశాస్త్రిగారు గమనించినచో స్వవచనవ్యాఘాతదోషము, పరస్పరవిరుద్ధదోషము విద్యావాగ్ధుని తలపయిని బెట్టరు. అంతియ గాదు, నోటనైన నుచ్చరింపరాని తండ్రికూఁతుల దాంపత్యకథను సిద్ధాంతముగాఁ గైకొనక యుందువారు.

ఒకటిరెండుసందర్భములు చేసిన శ్లోకములలో రుద్రాంబాగణపతిదేవులు దంపతులుగ సూచింపఁబడిరని శాస్త్రిగారనిరి. అనూచనమే లేదని సిద్ధాంతీకరించితిమి. వ్యాఖ్యాత కల్పించిన అవాంతరకథ అప్రమాణము. అది విడిచినచో శాస్త్రిగా రుదాహరించిన శ్లోకములె గాదు, ప్రతాపరుద్రీయ మంతయు గణపతిదేవునకు రుద్రమదేవి పుత్రియనియు, ప్రతాపరుద్రుఁడను పౌత్రుని (దౌహిత్రుఁడు) పుత్రునిగా స్వీకరించెననియు నిర్ణయించుచున్నది. ప్రతాపరుద్రీయము ప్రతాపరుద్రుని కంకితముగా నాతని కాలమున రచింపఁబడిన గ్రంథము. ఆవల రచింపఁబడియుండదా యందురేమో. ప్రతాపరుద్రునితో దాదాపు కాకతీయరాజ్య మంతరించినది. ప్రతాపరుద్రుని గుణప్రశంస, స్తోత్రము అనంతరపరిపాలకులగు యవనులకుఁ గాని ఆవల మాతృదేశము నేలిన వెలమవారికిఁ గాని యావశ్యకముగా నుండదు. ఈసమకాలికగ్రంథము కాకతీయచరిత్రమునకుఁ బరమప్రమాణము. దీనిని అన్యోన్యవిరుద్ధముగాఁ దలంచుట కంటెఁ బ్రమాదము వే రుండదు.

రుద్రమదేవి గణపతిదేవుని పుత్రి యనుటకుఁ జాలినన్ని యాధారములు గలవు. కొలనుపాక, పానుగల్లు, కోటగిరి శాసనములు, శివయోగసారము పీఠిక, మల్కాపురముశాసనము, అనితల్లి కలువచేరుశాసనము—ఇంకఁ బెక్కుశాసనములు నిరూపించుచున్నవి. శాసనములలో రుద్రమదేవి గణపతిదేవుని భార్యయని సమకాలికు లెవరును చేర్కొనలేదు. వీరభద్రరావు పంతులుగా రీయంశము నాంధ్రులచరిత్రమున సిద్ధాంతీకరించిరి. సందర్భశూన్యములగు కట్టుకథలు తీసికొని నిర్ణీతచరిత్రాంశమును దారుమారు గావింపఁజూచుట వృథాకాలయాపనమునకుఁ గారణ మగును. శాస్త్రిగారు తమ ప్రమాదములను సిద్ధాంతము లనుకొని కాకతీయవంశమును దోఁచినటుల సంస్కరించిరి. వారి విచిత్రసిద్ధాంతములు చరిత్రమునకు నందనివి. వా రొందిన ప్రమాదసిద్ధాంతమును నిలుపఁ బెట్టునవి మూఁడుండు శాస్త్రిగారి వ్యాఖ్యా పరంపరలు.

౧. "గణపతిదేవుని పుత్రి యగు ముమ్మక్కకుఁ గూడ రుద్రాంబయను నామము గలదు. ప్రతాపరుద్రుని కా తల్లి ముమ్మక్క యను రుద్రాంబ రాజ్యమర్పించె ననుట యుక్తము. ఇది కొంచెము క్లిష్టముగా నున్నను వాస్తవమునకు సమీపముగ నున్నదేమో యని నా యూహ.

౨. "మొత్తముమీఁదఁ బ్రతాపరుద్రుని తల్లి వంశమువారును, దండ్రివంశమువారు నొక్క మూలపురుషు నుండి విడివడిన స్త్రీపురుష శాఖలలోనివా రనియు, ఎదురు మేనరికములుగలవారనియు అన్యోన్యసాదృశ్యము దానిచేఁ గలదనియుఁ దెలియనగును."

ఇవి శాస్త్రిగారి యూహాపరంపరలపైఁ దేలిన సిద్ధాంతములు. పరస్పరవిరుద్ధములు, ఊహాకల్పితములు నగు నీనూతనసిద్ధాంతముల విడిచి కాకతీయవాస్తవచరిత్రమునకు అనుకూలములఁ గొన్నింటినిమాత్ర మిచట నుదాహరించుచున్నారము.

కాకతీయులు అని యీ వంశజులు పిలువఁబడుటకుఁ గుమారస్వామి సోమయాజి 'కాకతిర్నామ దుర్గాశక్తి రేకశిలానగరేశ్వరాణాం కులదేవతా, సాశక్తిర్భజనీయాఽస్యేతి కాకతీయాః' అని హేతువు చెప్పినాఁడు. దుర్గకుఁ గాకతి యను నామాంతరము లేదు. అందుచే నీవ్యుత్పత్తి యెంతవఱకు యుక్తమొ పాఠకులే నిర్ణయించుకొనవలెను. ఇటీవలి శాసనములలో కాకతియను గుమ్మడితీఁగ యనియు, అందీవంశమూలపురుషుఁడు జనించెననియు నొకకథ గ్రంథస్థము గావింపఁబడినది. కాకతి జైనదేవత కానోపు. తద్భక్తులు గాన వీరలు కాకతీయులని కొంద ఱూహించుచున్నారు. మైసూరుమండలములో కాగతి యను గ్రామము కలదనియు, అట వీరల మూలపురుషు లుండుటచేఁ గాకతీయులనఁబడిరనియు నొకవాదము గలదు. ఇదియుఁ గేవల మూహాశరణ్యమె.

కాకతీయులు స్వయంభూదేవుని భక్తులు. స్వయంభూదేవాలయమును దొలుత ప్రోలరాజు కట్టించెను అనంతర మీతని వంశజు లంద ఱాయాలయమును పెంపుచేసిరి. అపూర్వశిల్పములతో భూలోకకైలాస మని పేర్కొనఁబడి కాకతీయరాజుల సర్వస్వ మగు నీయాలయము పదునాఱవశతాబ్దమునఁ బూర్తిగ రూపుమాపఁబడినది. మహమ్మదీయులు ఆలయమును విధ్వంసముగావించి పుట్టుశిలగా నున్న లింగమును నేలమట్టము గావించిరి. అనంతరము రాజ్యముస్థాపించిన వెలమవీరులు, గజపతులు, చితాపుఖాను ప్రముఖులు నేలమట్టమైన లింగమును త్రవ్వి కొంచెము పయికి వచ్చునటులఁ జేసి చుట్టును ఇటుకలతో, సున్నముతో క్రొత్తగ గుడి కట్టిరి. ఆనాఁటి లింగములు, విగ్రహశకలములు, మహత్తరములగు నందులు, నాఁటి శాసనఖండములు గల ఓరుఁగంటిలోని శంభునిగుడియే ప్రతాపరుద్రీయమునందలి స్వయంభూదేవాలయము. ఈయాలయశిల్పములు ప్రతాపరుద్రానంతరము పతనమైన కోటగోడ బాగుచేయుటలో నుపయోగించిరి. కావుననే ప్రాకారములలో నపూర్వశిల్పాభిరామములగు శిలాఖండములు గోచరించుట. ఈస్వయంభూదేవాలయమును శంభుని గుడి యని వ్యవహరింతురు.

ఒరంగల్లున కాకాలమున ఆంధ్రనగరము, ఏకశిలాపురము, కాకతిపురము అను నామములు గలవు. ప్రతాపరుద్రునకు చలమర్తిగండయను బిరుదనామము గలదు. దీనికి కుమారస్వామిసోమయాజి 'శౌర్యాతిశయసూచకం బిరుదనామ' యని యర్థము చెప్పినాఁడు. ప్రతాపరుద్రుఁడు సుందరమూర్తియనియు, విష్ణ్వంశసంభూతునిగఁ బ్రజలు విశ్వసించిరనియు, సాహిత్యపరిశ్రమ కలవాఁడనియు, అఖండత్యాగధురంధరుఁడనియు విద్యానాథుఁడు చెప్పియున్నాఁడు. కొంత యతిశయోక్తి క్రింద వదలినను సత్యము కొంతయేని గలదని విశ్వసింపవచ్చును. కాకతీయవంశమును విద్యానాథుఁడు క్షత్రియవంశమునకు భిన్నమైనదిగాఁ బలుతావులఁ జెప్పినాఁడు.

'క్షుద్రక్షత్రియపక్షశిక్షణవిధౌ', 'సోమార్కాభిజనం త మద్య జయతి శ్రీకాకతీయాన్వయః', 'సోమసూర్యాన్వయామాత్యమహత్త్వాఽవ్యాకరీకృతా' అను శ్లోకభాగములే గాక నాటకప్రకరణము పంచమాంకములోని ఈక్రింది

'సాహస్రాంశవ మైందవంచ మహతీ
యే ద్వే కులే నిర్మితే
తే జాతే లఘునీ సుతై ర్విజయిని
శ్రీకాకతీయాన్వయే'

అనుశ్లోకము వలనము కాకతీయవంశము సూర్యచంద్రవంశములకు భిన్నమైనదని స్పష్టముగాఁ దెలుపుచున్నది. ప్రతాపరుద్రీయమునఁ గాకతీయులు క్షత్రియు లనుటకుఁ దగిన యాధారములే లేవు. కావున క్షత్రియులమని చెప్పుకొనువారితో నీవంశమునకు సంబంధ మెటులఁ గుదురునో తోఁచదు. ఈవిషయమున నిదివఱకె పెక్కు విమర్శము లుండ సిద్ధాంత మెట్లు?

కాకతీయుల కులనిర్ణయమునకుఁ బ్రతాపరుద్రీయమున నాధారములు లేవు. సూర్యచంద్రక్షత్రియవంశములకు భిన్నుఁడనిమాత్ర మందుఁ గలదు. నిస్సందేహముగాఁ బ్రతాపరుద్రీయమువలనఁ దెలియు చరిత్రాంశములు కొన్ని గలవు. వానినిమాత్ర మిచట సంగ్రహముగా వివరించుచున్నారము.

ప్రతాపరుద్రదేవుఁడు మహాదేవరాజ ముమ్మడాంబలకు జనించినాఁడు. స్వయంభూదేవుఁడు జన్మకాలమునందే బాలుని భావ్యదృష్టరేఖ దెలిపి కుమారునిగాఁ గైకొను మనెను. గణపతిదేవునకు రుద్రమదేవి కుమార్తె. ఆత్మశక్తిగల గణపతిదేవుఁడు రుద్రమదేవి రుద్రుఁడని వ్యవహరించి తన రాజ్యమున కాయమ నధిపతిని గావించినాఁడు. గణపతిదేవుఁడు మనుజరూపధారియగు శంభుఁడు. ప్రతాపరుద్రుఁడు అటులె కలియుగవిష్ణువు. ప్రతాపరుద్రుఁడు యువరాజుగా నుండి యొకశుభముహూర్తమున సముచితపరివారముతో జైత్రయాత్రకు బయలు వెడలెను. తొలుత దుర్గమ భూమిం దాఁటి అనుమకొండచెంతఁ గల ప్రమదావనమున విడిసెను. అనంతరము ప్రతాపరుద్రదేవుఁడు కళింగదేశమును జయించెను. అట జయస్తంభములు నిల్పెను. పిదపఁ బాండ్యదేశమును గెలిచెను. అనంతరము రేవానది దాఁటి ఉత్తరదిశకుఁ బోయి ఘూర్జర, వంగ, లంపాక, కొంకణ, మహారాష్ట్రదేశముల జయించెను. ఈయుదీచీదిగ్విజయమున ఆంధ్రసైనికులు ఆయాదేశవేషభాషలతో నెల్లెడలఁ దిమ్మరి ప్రతిపక్షరాజుల గుఱుతించి రాజసన్నిధికిఁ గొనివచ్చిరి. పాంచాలురు, కీకటులు, భోజులు, కాంపిల్యులు, కేరళులు మున్నగువా రంద ఱీజైత్రయాత్రలోఁ బూర్తిగా లోఁబడిపోయిరి. అనంతరము ప్రతాపరుద్రుఁడు ఆంధ్రనగరముఁ జేరఁగా మహత్తరవైభవముతోఁ బట్టాభిషేకము జరుపఁబడెను. ప్రతాపరుద్రుఁడు హస్తమునందు ధనూరేఖలు, పాదములఁ బద్మరేఖలు, శారదాబ్జముల వంటి విశాలనయనములు గలవాఁడు. ఈదివ్యసుందరమూర్తిని గాంచి యొక సిద్ధుఁడు తొల్లి యీక్రింది రీతిగఁ జెప్పెనట—

'చిహ్నే వస్య పదాబ్జయోః పికువయం
త్యుర్వీశ్వరోపాస్యతాం
పాణీ సూచయత స్వచాపకులిశా
వుద్వాహలీలాం భువః,
నేత్రే శారదపుండరీకరుచినీ
లీలావతారం హరే
రాఖ్యాత స్తదితీహ సిద్ధవచనం
ప్రత్యక్ష మీక్షామహే.'

ఈసిద్ధుఁడు చెప్పినది రుద్రమదేవితోఁ గానోపును. సిద్ధుఁడు రుద్రమదేవికిని బ్రతాపరుద్రునకును సమకాలికుఁడును, గణపతిదేవునకు దీక్షాగురువును నగు విశ్వేశ్వర శివదేశికుఁడు కానోపు.

ప్రతాపరుద్రీయము కేవల మలంకారగ్రంథ మైనను, గాకతీయచరిత్రమునకు నిస్సందేహసాధనములగు చరిత్రాంశము లందుఁ గొన్ని లేకపోలేదు. అవి సమన్వయించినచోఁ జరిత్రమున కమూల్యాధారములు. కొన్నితావుల నతిశయోక్తు లున్నను అందుండి యథార్థచరిత్రము చరిత్రవిదులకుఁ గోచరించుచునే యుండును. ప్రతాపరుద్రీయమున గణపతిదేవునకు రుద్రమదేవి పుత్రి యనియు, నామెకు ముమ్మడమ్మ కుమార్తెయనియుఁ గలదు. ముమ్మడమ్మకు మహాదేవరాయలకుఁ బ్రతాపరుద్రుఁడు జనించినటులఁ గూడఁ గలదు. దీనిని గణపతిదేవునకు రుద్రాంబకు సూచనయని శాస్త్రిగా రొక

నూతనసిద్ధాంతము చేసి చరిత్రాంశము తారుమారు చేసి నను ఈయంశము నిర్ణయించు ఇతరాధారములు లేక పోలేదు. కొలనుగణపతిదేవుని శివయోగసారమున పైని చేర్కొనిన చరిత్రాంశము లీక్రిందిరీతిగఁ జేర్కొనఁబడినవి—

'క. వెంకియు గణపతినరణీ
మండలపతిపుత్రి రుద్రమహాదేవి కొగిఁ
దండాధినాథులై భో
గండును ప్రగడన్నమనుమగన్నయ వెలసిరి.

'క. ఆహవమున వారు రిపు
వ్యూహంబుల నడలుపఱచి యొక్కరు గానరే
బాహాత్తరిసర్గంబులు
సాహసులై దుర్గమాంబశౌర్యముకతనన్.

'చ. అనుపితిరుద్రమాంబికకు
నాత్మజరైయి పొగడొందు ముమ్మడ
మ్మకు మహాదేవరాజునకు
నాత్మజుఁడైన ప్రతాపరుద్రుఁ డా

సకలమహీభరంబును వ
సం దినయుంత వహించి తాల్చె-'

ఇట్లు వేలకొలఁది యాధారములచే సిద్ధాంతములైన యంశములఁ దారుమారుచేసి శాస్త్రిగా రంతతోఁ బోక, "ఒక్క ప్రతాపరుద్రీయమునుబట్టి చూచిననే ఇన్ని వికల్పములచే నీచరిత్ర మెఱుంగుట దుష్కరముగ నున్నది గదా! ఇంకను శిలాతామ్రశాసనాదిప్రమాణము లన్నింటిని జూచిన నెన్ని చిక్కులు సంభవించునో" అని వ్రాసిరి. ప్రతాపరుద్రీయమున వికల్పములే లేవు. తెచ్చిపెట్టినది శాస్త్రిగారె. ఇంక వారె తామ్రశిలాశాసనాదికముల శోధించిన నెన్నివికల్పములు సృజింతురో! శాస్త్రిగా రాధారముగఁ గొన్న అంశము లెన్నిఁటిటికి బహుసంఖ్యల సూచించితిమి. కాకతీయచరిత్రముకొఱకు, ప్రతాపరుద్రీయముకొఱకు మేము సేకరించిన యంశములనె యిటఁ జర్చించితిమి. శాస్త్రిగారు చూపిన వికల్పములఁ బాఁకు లీవ్యాసమును జిత్తగించి దిద్దుకొందురేని మేము ధన్యులము.

---

# ఒరంగల్లు

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

ఆలతో మలిచిన రాచకచేరికి పొగచెట్లు పరివార మగుట కలిగె
జనులు క్రిక్కిరిసి దర్శన మలభ్యంబగున్నృపపీఠి బయలున దృశ్య మయ్యె
స్మృతిపథాతీతకాకతికులప్రాభవ ఘోషంబు నామావశేష మయ్యె
బిరుదావళులతోడ భీకరంబగు రాచమర్యాద భావనామాత్ర మయ్యె
అనవరతపూజఁ గన్న శివాలయముల-సగము విరిగిన విగ్రహా లగపడియెను
నీవు కంటఁ జూచి సహింప నేర్చువిధమె?-ప్రోద్ధతదుఃరాప, శ్రీవీరరుద్రభూప!

తొలిమెత్తునుండి యూఁదోఁకవాలుగఁ బల్లమున కొరగిన నేలబోకరింపు
ఒక్కొక్కటాయి యొక్కొక్కకమ్మగ ద్వార మమరిచినట్టి శిల్పము బెడంగు
పొలమ యయ్యును శిలావళిఘట్టనము ఆలపోడి గ్రక్కుచుండెడి భూమితీరు
ఆలికంబముమీఁద లాఁతిఱా మలిచిరోయనఁ జెక్కఁబడిన రాయంచబొమ్మ
చెప్పకయె చెప్పచుండు నీసిరి నిపుడును-ప్రాఁతపడుట కలదె దివ్యవైభవములు
కాకతీయకులాబ్ధిరాకాకళాప!-రౌద్రసాంద్రప్రతాప! శ్రీరుద్రభూప!

---

# ఆంధ్రాక్షరముల విమర్శనము

పా. పార్థసారథిరాయణింగారు

'తెలుఁగులిపియుక్తదత్సంస్కరణము' అను శీర్షికతో మ. రా. రా. శ్రీ ఎం. ఎస్. వెంకయ్యగారు భారతిప్రజోత్పత్తిసంవత్సర శ్రావణమాస పంచికయందు "ఈలిపియందు లోపము లున్నవని పలుపురిచేఁ దలంపఁబడుటకుఁ గల కారణములఁ గొన్నింటి నీక్రింద నిచ్చుచున్నాఁడ" నని వ్రాసి తొమ్మిదికారణముల నిచ్చి వాని నొక్కొక్కటిని విమర్శించినారు. అందు మొదటిది "రోమకాక్షరములవలె స్వరవర్ణములను, వ్యంజనవర్ణములను విడివిడిగా నొకదానిప్రక్క నొకటిగా వ్రాయక పోవుట" యని వ్రాయుచు దానిని విమర్శించుటలో "మనభాషయం దక్షర మనునది ఆంగ్లేయుల సిల్లబిలుకు (Syllable) సరిపోవుచున్నదని చెప్పవలసియున్న"దని యందుకుఁ గొన్ని కారణములను సోదాహరణముగఁ జెప్పినారు. 'Syllable' అనునది ఆంగ్లేయమున ఒక్కటిగా నుచ్చరింపఁబడిన ఒక్క స్వరవర్ణముగాని, మిశ్రస్వరముగాని, అట్టిస్వరముతోఁ జేరిన వ్యంజనసముదాయముగాని కల పదభాగమునకుఁ బేరు. స్థూలముగా శ్లోకాక్షరసంఖ్యానిర్ణయాదు లను కొన్ని సందర్భముల 'అక్షర' మనునది 'Syllable' అనుదానికి సరిపోవచ్చునుగాని సూక్ష్మముగాఁ జూచిన సరిపోవదని తోఁచుచున్నది. అకారాదులన్నియు నక్షరములే.

క. మాతృకలు వర్ణములు మఱి
ధూతలమున వర్ణములు లిపులు వ్రాలు నవజ
ద్వైతేయ విభంజన వి
ఖ్యాతములగు నక్షరాహ్వయము లీరైదుగ్.

అని అప్పకవి వ్రాసియున్నాఁడు. ఇవి పదభాగములుగా నుండనక్కఱలేదు. అక్షరమనఁగా వర్ణము, కేవలము ధ్వనిని గుర్తించు నయనగోచర మగు సంకేతము. ఇట్టి యెడ నక్షర మనునది 'Syllable' అనుదానికి సరియైన ప్రతిపదము కాఁజాలదు. అయినను వెంకయ్యగారు అక్షరమును సిల్లబిల్ గానే గ్రహించి

"మా - ని - షా - ద - ప్ర - తి - ష్ఠా - త్వ
మ - గ - మ - శ్శా - శ్వ - తీ - స్స - మాః
య - త్క్రౌం - చ - మి - థు - నా - దే - క
మ - వ - ధీః - కా - మ - మో - హి - తమ్."

అను ప్రతిసిల్లబిలు నొక ప్రత్యేకాక్షరముగా గ్రహింపఁబడియున్నట్టులు స్పష్ట మగుచున్నది" అని వ్రాసినారు. కాని "దీనినే ఆంగ్లేయులపద్ధతిచొప్పున అచ్చులను హల్లులను విడివిడిగా నొకటిప్రక్కన నొకటిగా వ్రాసినచో, అయువదినాల్గక్షరములును గొన్నిసమయముల నింక నధికము నగును. పైశ్లోకముననే రోమకాక్షరములతో నీక్రింద వ్రాసి చూపెట్టెదను.

Ma nishada pratishta twa
Magama ssasvatissamah

ఈపద్ధతిని వ్రాసినచో, ప్రతిపాదం సమాక్షరః ప్రతిపాదం అష్టభిరక్షరైః సమః' అను నియమమునకు వ్యతిరేకముగ ౨౩, ౨౦, ౨౨, ౧౯ అక్షరము లగును" అని వ్రాసినారు. అక్షరమనఁగా సిల్లబిల్ అని గ్రహించినంతట రోమకాక్షరములతో వ్రాసినప్పుడు సైతము సిల్లబిల్ లుగానే విభజించి వ్రాసి సిల్లబిల్ లను లెక్కింపవలెను. అట్లయిన

Ma ni-sha da pra ti shta ṭva

అని వ్రాసి లెక్కించిన ౮ సిల్లబిల్ లు అనగా ౮ అక్షరములే యగును. అట్లుకాక రోమకాక్షరముల వ్రాసినప్పుడు మాత్రము సిల్లబిల్ లను లెక్కింపక వర్ణములనన్నిటిని నక్షరములుగా లెక్కించి సంఖ్య యెక్కువయైనదని చెప్పుట న్యాయ్యముగాదు. మఱియు వెంకయ్యగారు "ఆపద్ధతిని వ్రాయుటగాని చదువుటగాని చాల కష్టము" అని చెప్పుచున్నారు. ఉండుఁగాక, రోమకాక్షరములతో

మన భాష వ్రాయుట కష్టమనిన నొప్పుడగియున్నది. ఇన్నిటికిని జక్కని మనలిపియుండఁగా లిప్యంతరమునకుఁ బోవ నవసరము లేదను నిర్వివాదమైన కారణముండఁగా దానిని విడిచిపెట్టి యక్షరములను దప్పుగా లెక్కించి లెక్కకు నెక్కువైనవి గానఁ గూడదనుట సయుక్తికము గా లేదు. మరల "హల్వర్ణముతోఁ గూడిన ప్రతిసిల్లబిలు కును అధమపక్షము రెండక్షరము లుండితీరవలయును" అని వ్రాసినారు. అది యెక్కడ లేదు? 'క' అనిన నది కకారఅకారములుగాదా? అకారమును గుఱించి (√) తలకట్టుగా వ్రాసినను అది 'క'కార 'అ'కారము గాకపోవునా? రెండక్షరములఁగలది కాకపోవునా? మీరు మిక్కిలి పైశ్లోకములో మొట్టమొదటను 'మా' యని వ్రాయుచున్నాము. అ దేమిటి? విభజించి గమనించి చూడుఁడు. కావలసినది 'మ'కార 'అ'కారము రెండు మాత్రమే యయ్యును, ఉద్దేశించిన దారెండుమాత్రమే యయ్యును వ్రాయునదిచూడఁగా 'మ'కార 'అ'కార 'అ'కారములు. ఈ 'అ'కారము కేవలము అనవసరమును, అనర్థకమును గాదా? ఈవిషయమునుగుఱించి మఱి యొక సందర్భమున విపులముగాఁ జర్చించెదను.

"ఇవన్నియుఁ బర్యాలోచించిచూడఁగా అచ్చులును హల్లులును విడివిడిగా ప్రక్కనప్రక్కన నుండు నట్టులు వ్రాయుపద్ధతి మన భాషాస్వభావమున కెంతయు విరుద్ధముగా నున్నదనియే చెప్పవలసియున్నది" అని వ్రాసినారు.

అచ్చులను విడఁదీయుట యక్కఱ లేదుగాని హల్లులను విడఁదీయుటమాత్రము అవసర మనియే నా యభిప్రాయము. అచ్చులును హల్లులును గలియునప్పుడు ఆ అచ్చులను హల్లులతోఁ గలిపియే వ్రాయుదుము. హల్లు లనేకము లొక్కటిగాఁ జేరివచ్చునప్పు డాహల్లులు అచ్చులనువలెఁ గలుపుట లేదు. విడివిడిగా నొకటి క్రింద నొకటిని వ్రాయుచున్నాము. కనుక హల్లులను విడఁదీసి వ్రాయుట మన భాషాస్వభావమునకు విరుద్ధ మని చెప్పుట న్యాయ్యముగాదు. అయిన హల్లులను నొకటిక్రింద నొకటిని వ్రాయు నీపద్ధతిని మార్చి ప్రక్క ప్రక్కను వ్రాయుటవలన ననేకసౌకర్యములు గలవు.

(చూ. ఆంధ్రాక్షరములు పుట ౧౯.) ఇట్లు ప్రక్క ప్రక్కన వ్రాయుటయును శుద్ధముగా మనభాషలో లేనిదిగాదు. ఇప్పటికే యీపద్ధతి మనభాషలో కొంత వఱకున్నది. "వలఁబడ్డ జక్కవల్ వలె నున్న...", "నిలింపకోటి కొగడఁగా రారాజు", "(ములునూపు), ముల్ నూపు, విల్ కాడు, కన్ మూయు"- ఇఁక వడిక్రింద వ్రాయు హల్లులనుగూడ నొకదానిప్రక్క నొకటి వ్రాయుట కలదు. "సౌవర్ణ్యము" అనునప్పుడు 'ణ' ప్రక్క 'య' వచ్చినది. అయిన నివిరెండును క్రిందిపంక్తిలో వచ్చినవి. అట్లుకాక ఈమూఁడువర్ణములను నొక్కపంక్తి లోనే 'ర్ణ్య' వ్రాయుట కవకాశ మిచ్చిన ముద్రణమునకుఁ జాల సుకరముగా నుండును. అట్టి యవకాశమును గలిగింపవలెనని నాకోరిక. (చూ. ఆంధ్రాక్షరములు పు. ౧౮-౧౯.)

వెంకయ్యగారు రోమకాక్షరముల వ్రాయుపద్ధతి ఛందశ్శాస్త్రమునకు విరుద్ధమని రూపించుటకుగా

'జనితామర్షోగ్రకాలస్మరహరు క్రియ నాస్థాని దిగ్గంచు లేవఁగా'

అను మహాస్రగ్ధరాపాదమును రోమకాక్షరముల

"(a)J a ni ta mar sho gra ka la Sma ra ha ru kri ya na Stha ni dig gan chu le van,

"(b) Ja ni ta mar sho gra ka las-ma ra ha ru kri ya nas-tha ni dig gan chu le van;

*ఈపద్యపాదమును సిల్లబిల్లుగా విడఁదీసి చూపియున్నాను. అందు (a) లోఁ జూపినవిధముగా విడఁదీసినచో ja అనుసిల్లబిలుకును, sma అనుసిల్లబిలుకును, stha అను సిల్లబిలుకును యతి కుదిరిపోవుచున్నదని తలంపవచ్చును గాని 'b' లోఁ జూపినట్టుల సిలబిల్లు విడఁదీసినచో ja కును, ma అనుసిల్లబిలుకును, tha అనుసిల్లబిలుకును యతి కుదరకపోవును" అనుచున్నారు. క్రమమైన (a)విధముగా విడఁదీయక తప్పైన (b)విధమున విలువ నేల,

యతి తప్పినదని వగవ నేల? దీనికి వెంకయ్యగా రిట్లు చెప్పుచున్నారు:—

"సిల్లబిల్లే విధమున విడఁదీయవలయునని నిర్ధారణ చేయుటయే చాలకష్టమై యుండును. ఎవరికి దోఁచి నట్లుల వారు సిలబిల్లను విడఁదీయుదురు." ఈకష్టము సంయుక్తాక్షరపద్ధతికిమాత్రమే యాపాదించినదా? మన లిపితో వ్రాసినమాత్రము లేదా? "రామునితోఁక పీకరుండు" అని విడఁదీయు వారికి మేర యేది? కొన్ని యెడల నొకపదము ననేక విధముల విభజింపఁ గలుగుటయు నొకయెక్కువే యగును. ఇదియేకదా సభంగశ్లేష కవకాశము? ఈతప్పువిఱుపులకు వెంకయ్యగా రుదాహరణములు పెక్కు లిచ్చినారు. అన్నియు "రామునితోఁక పీకరుని" గాథలే గాన విస్తరించి వానినెల్ల విమర్శింప లేదు.

"పైనఁ జెప్పిన విషయము లన్నియును జక్కఁగా విమర్శించి చూచినచో, మన పూర్వులు దీర్ఘముగా నాలోచన సల్పి మన భాషాస్వభావము (Genius of the language) న కనుకూలముగా నుండునట్లును లేఖనమునందుఁగాని, పఠనమునందుఁగాని కష్టము గల్గకుండునట్లును నుండవలయు నని తలంచియే యిట్టి సంయుక్తాక్షరపద్ధతి మన తెలుఁగులిపి కేర్పఱచియున్నారనుట తెల్లము గాకపోదు, విషయ మిట్లుండ "మన పూర్వు లేర్పఱచిన లిపి చాల చిక్కులను గల్పించుచున్నది; చాల ననాగరికముగా నున్నది; సర్వవిధముల మనకన్నను నాగరికతగల యాంగ్లేయుల పద్ధతిని మన మేల యనుసరింపరాదు? అని యిట్లు కొందఱు చెప్పుచుండుట హాస్యాస్పదముగా నున్నది" అని వెంకయ్యగారు వ్రాసినారు. మన పూర్వులు దీర్ఘముగా నాలోచన సలిపి మన లిపి నేర్పాటు చేసిరనుటకు సందేహము లేదు. అప్పటి సందర్భములను, స్థితులను బర్యాలోచించి తగురీతిని కొన్ని పద్ధతులను నిర్మించినారు. అంతకుఁ బూర్వ ముండిన కొన్ని యంశములను సమయోచితముగ మార్చిరి. శిలాతామ్రశాసనములను బరిశీలించిన నీమార్పులు స్పష్టపడఁ గలవు. అట్లు వారు మార్చినందున వారు వారి పూర్వులను నిరాకరించిరని యనకూడదు. (మా. పు. ౧, ౨, ఆంధ్రాక్షరములు.) అప్పటప్పటి సందర్భముల ననుసరించి యవశ్యములైన మార్పులఁ జేయుచుండిరి. వారి కిప్పటి సందర్భసన్నివేశము లప్పుడు గోచరించి యుండఁజాలవు. ఈకాలపు ముద్రణమునుగాని ముద్రాలేఖనమునుగాని వారు భావించి యుండఁజాలరు. ఈ నూత్నసన్నివేశములనుబట్టి యేవేని మార్పు లవశ్యములుగా నేర్పడి వానిని మనము కావించిన నది మన పూర్వులకు న్యూనత గల్పించినట్లు గాని, వారి పద్ధతుల నిందించినట్లుగాని భావింపఁదగదు. ఈకాలమున ముద్రణమును, ముద్రాలేఖనమును నవశ్యమని చెప్పనక్కఱలేదు. ముద్రణ మెంతవిధమున జరగుచున్నది. (మా. ౧౨, ౧౩ ఆంధ్రాక్షరములు.)

ముద్రాలేఖనము మనభాష కింకను నేర్పాటు కాలేదు. ఆంగ్లేయాదిభాషల కేర్పడియుండునట్టి యచ్చువ్రాఁతపెట్టెకు ౪౨ కాని ౪౪ మెట్టు లుండును. మెట్టుకు రెండుముద్ర లుండును. కనుక పరమావధి ౮౮ ముద్ర లుండును. విధిలేనంతట నింకఁగొంత పెంపవచ్చునేకాని యెక్కువ పెంప నవకాశ ముండదు. ఇందులోనే అంకెలు, ముగియుబొట్టుమొదలగు విరామాదిసంకేతములు, అడ్డగీతలు, నిలువుగీతలు మొదలైన వన్నియుఁ జేరియుండవలెను. ఇవన్నియుఁ బోఁగా కేవల మక్షరములకుఁగామాత్రము నిలుచు స్థానముల సంఖ్య మిక్కిలి తక్కువ యగుచున్నది. అఱువది స్థానములలో దమఁగున నుపయుక్తములగు నన్నియక్షరముల ముద్రలను నిముడ్పవలసియున్నది. ఇప్పు డుండు పద్ధతిప్రకార మొక్కొక్కసంయుక్తాక్షరమున కొక్కొక్క ముద్ర యుండవలెనన్న నచ్చువ్రాఁతపెట్టె కుదురనేరదు. కాఁబట్టి యీముద్రలను తగ్గించుమార్గము నాలోచింప వలెను. సంయుక్తాక్షరముల రాఁగల సంయోగభాగములకు ముద్రలను జేసికొని వానిని సందర్భోచితముగఁ గూర్చుటే దీనికి మార్గము. అట్లుచేయుటలోఁగూడ హల్లులను సంయోగమున వడిక్రిందపడిని గూర్చుట చిక్కును గలిగించుచున్నది. 'శాస్త్ర్యుఁడు' అని ముద్రింపవలెనన్న మూఁడక్షరములు బంతిక్రింద దొంతరగాఁ

చేర్పవలసివచ్చినది. అచ్చువ్రాఁత పెట్టెలో బంతికిఁ బైనఁ గాని క్రిందఁగాని ఒక్కొయక్షరస్థలమునకన్న మిగిలిపోవుట కష్టము. అచ్చుల సంయోగరూపము లస్పష్టములున నిముడు నదిగాన, వీనినిమాత్రము యథాప్రకారముగ హల్లులతోఁ బైనఁ గ్రిందఁ జేర్చుకొనుచు, హల్ సంయోగభాగములను బ్రక్కకుఁ దీసికొనివచ్చుట యావసర మగుచున్నది. తెలుఁగున 'క' 'త' 'న' 'మ' 'య' 'ర' 'ల' 'వ' హల్లులుమాత్రము సంయోగమున రూపభేదమును జెందు చున్నవి. తక్కినవి సంయోగమునఁగూడ తలకట్టులువిడిచి యథారూపములుగనే నిలుచుచున్నవి. ఈ యెనిమిది హల్లులనుగూడఁ దక్కిన హల్లులవిధముగనే సంయోగమున రూపభేదముచేయక '్క' '్త' '్న' '్మ' '్య' '్ర' '్ల' '్వ' అని వ్రాసినచో ముద్రల సంఖ్య తగ్గుటవలన ముద్రాలేఖనయంత్రమునకు మఱింత యవకాశము గలుగును. ఆంధ్రమునకు ముద్రాలేఖన యంత్రము కావలెనన్న నిట్టిమార్పు లత్యవశ్యము. (చూ. ఆంధ్రాక్షరములు. పు. ౧౯.)

“ఇఁక మూఁడవకారణమును విచారింతము. సంయుక్తాక్షరము లుచ్చారణానుసారముగాక యక్రమ పద్ధతిని వ్రాయఁబడుట తెలుఁగు లిపియం దొక గొప్ప లోపమని, అట్టిలోపము నాగరలిపియందు లేదనియుఁ గొందఱు తలంచుచున్నారు. అయ్యది కేవలము పొరపాటువకతప్పదు. అట్టిలోపము నాగరలిపియందుఁ గూడఁ గలదు. చూడుఁడు” అని వెంకయ్యగారు వ్రాయుచు నాగరలిపియందలి దోషములను జూపినారేగాని యది యక్రమపద్ధతి గాదనుటకుఁగాని, యాలోపము తెలుఁగున లేదనుటకుఁ గాని కారణమును జూపరైరి. పుదను మఱి కొన్ని భాషలలోఁగూడ నీపద్ధతి కలదనుచు “ఒక్కతల్లి గర్భమున జనించిన యక్కచెల్లెండ్రకుఁ బోలిక యుండకపోవుట యెందైనఁ గలదా? కావున నీయక్రమపద్ధతి కల్పితముగాక పుట్టుకతోనే యన్ని లిపులయందును చేర్పడిన యట్టుల తేటపడుచున్నది. విషయ మిట్టులుండఁగా, కేవల మొక తెలుఁగులిపియందుమాత్ర మట్లు దోషారోపణము చేయుట యేటి న్యాయము?” అని యాక్షేపించుచున్నారు. 'ఆంధ్రాక్షరములు' అను నా పుస్తకమున (పు. ౧౭) లో “తెలుఁగున పదములఁగూర్చుటయందుఁగూడఁ గొన్ని లోపము లున్న......”, “ఈ విషయమున నాగరలిపి చాల మేలుగా నున్నది. రేఫాదులు వచ్చుకొన్నిటఁ దక్కఁ దక్కిన సంయుక్తాక్షరము లుచ్చారణము ననుసరించియున్నవి” అని వ్రాసియుంటిని. నాగరలిపిలో నీలోపము శుద్ధముగా లేదనిగాని, ఇతర భాషలలో లేదనిగాని నేను వ్రాయలేదు. ఇతర భాషలలో సైత మీలోపమున్నమాత్రముననే మన భాషలో నాలోపమును దిద్దుకొనుటకు వీలుండిన దిద్దుకొనరాదా? దిద్దుకొనుట యవశ్యమై సాధ్యమై నప్పుడు తప్పక దిద్దుకొనవలయును. ఇతరభాషలనుండి సుగుణముల గ్రహింపవలయునే కాక లోపములను గ్రహించుటకాని, వానిని తమ భాషలో దిద్దుకొనఁ బ్రయత్నింపక పోవుటగాని సంభావ్యముగాదు.

ఇఁక నాల్గవకారణమును వెంకయ్యగా రిట్లార యుచున్నారు: “మనవర్ణమాలయం దధికసంఖ్యాకములగు నక్షరము లున్నవని కొంద ఱాక్షేపించుచున్నారు. ఈ యాక్షేపణ కాధారము కానరాదు” అనిరి. మఱియు “ఋ, ౠ, ఌ, ౡ అను స్వర వర్ణములును, విసర్గానుస్వారములును తెలుఁగున వాడఁబడుట లేదనియు, 'ఙ' అను వ్యంజనాక్షరముకూడ వాడుకనుండి తొలఁగిపోవు చున్నదనియు, ఈయక్షరముల నేల తెలుఁగు వర్ణమాల యందుండి తొలఁగింపరాదనియు నిట్లు మఱికొందఱు వాదించుచున్నారు. ఇదియును పొరపాటువక తప్పినది గాదు” అనుచు నవి సంస్కృతపదముల నుండుటచేతఁ దెలుఁగున నవి యావసరమని మాత్రము చెప్పినారు. ఈ 'ఋ, ౠ, ఌ, ౡ' విషయమున నా 'యాంధ్రాక్షరములలో' నిట్లు వ్రాసియున్నాను. “'ఋ, ఌ' ఇవి యచ్చులని కొందఱు, హల్లులని కొందఱు వాదించుచున్నారు. ఇవి ప్రత్యేకాక్షరములుగ భావింపఁదగినవే కావని నాయభిప్రాయము. 'ఇ, ఉ'లకు మధ్యోచ్చారణము గల 'ఌ' అను పైనఁ జెప్పిన యచ్చుతోఁ జేరిన 'ర, ల' లే కాని వేఱుకావు. కావున వీని నాంధ్రవర్ణసమామ్నాయమునుండి తొలఁగింప వచ్చునని నా యభిప్రాయము.” ఈ 'ఇ, ఉ' ల మధ్యోచ్చారణముగల 'ఌ'

# తిరువాంకూరు చిత్రములు



౧. హిజ్ హైనెస్ శ్రీ పద్మనాభదాస వాంచి పాల రామవర్మ A. P.

కులశేఖర కిరీటపతి మన్నె సుల్తాన్ మహారాజరాజ రామరాజ బహదూర్ షంషేర్ జంగ్,

తిరువాంకూరు మహారాజుగారు.

జననము 7-11-1912. పట్టాభిషేకము 6-11-1931.







1. అనంతపద్మనాభాలయ ద్వారము.
2. వస్తుప్రదర్శనశాల.
3. పురమందిరము. (అ)
4. కోట, సింహద్వారము.
5. పద్మతీర్థము, అనంతపద్మనాభాలయము.





[M. K. R.]

సంయోగరూపమున 'రి' అను నీస్వరమును దెనుఁగునఁ జేర్పవలసియున్నదని వ్రాసియుంటిని. అట్లు చేర్చుచో నీసంయోగరూపమున 'రి, లి' లతోడఁ గార్యము నెఱవేఱునుగానఁ బ్రత్యేకము 'ఋ, ౠ' లు తెనుఁగున ననవసర మంటిని. "వర్ణసమామ్నాయము చక్కనిపద్ధతి ననుసరించి యుండవలెనన్న నొక్కొక్కధ్వనిని గుర్తించుట కొక్కొక్క సంకేత మే యుండవలెను. ఒక సంకేత మెల్లప్పుడు నొక్కధ్వనినే స్ఫురింపఁ జేయవలెను. ఒక ధ్వనిని స్ఫురింపఁజేయుట కనేకసంకేతములుగాని, యనేక ధ్వనుల స్ఫురింపఁజేయుట కొక్కటే సంకేతముగాని యుండరాదు". (ఆంధ్రాక్షరములు పు. 3.) ఈపద్ధతి ననుసరించి యాంధ్రమునఁ గొన్నివర్ణములను దొలఁగించి కొన్నిటిని నూతనముగఁ జేర్పవలయు నంటిని. ఇట్లు "అర్ధానుస్వార ముచ్చారణరహిత మగుటచేతఁ దెనుఁగున నిది నిరుపయోగసంకేత మనవచ్చును. అర్ధానుస్వారము కొన్నిచోటుల నక్షరలోపమును దెలియఁజేయుచున్నది గాన నుండవలసినదని కొందఱి యభిప్రాయము. కేవల మక్షరలోపమును దెలుపు సంకేతమైన పక్షమున దానిని విరామాదిసంకేతములగు గీతలు బొట్టులలోఁ జేర్చుట యుక్తముగాని, ధ్వనిసంకేతము గానప్పు డక్షరములలో గణించుట తగదు. (ఆం. పు. ౮.)

"పూర్ణానుస్వార మాంధ్రవర్ణసమామ్నాయమునఁ బ్రత్యేకాక్షరముగ నుండ నవసరము లేదు. స్పర్శముల ముందుండు పూర్ణానుస్వారమున కాయావర్గానునాసికోచ్చారణమును, (క్రొత్తగాఁ జేర్చుకొనువాని వాని జన్మస్థానములఁబట్టి యాయావర్గములలో గణింపవలెను,) దక్కిన యక్షరముల ముందుండు పూర్ణానుస్వారమునకును, బదాంతమునం దుండు పూర్ణానుస్వారమునకును బవర్గానునాసికమగు 'మ'కారోచ్చారణమును బలుకుచున్నాము. కనుక సున్నకు బదు లాయాయనునాసికనే వ్రాయనగు. పూర్వ మాంధ్రమున స్పర్శములకు ముందుఁ బూర్ణానుస్వారము స్థానమున నాయావర్గానునాసికమునే వ్రాయుచుండినట్లు ప్రాచీనశాసనములవలన నేర్పడుచున్నది. ఆంధ్రవిజ్ఞానసర్వస్వమున ననుస్వార విషయములో 'ఇట్లు ప్రాకృతాదికములలో ననుస్వారమునకు రెండు ఉచ్చారణములు వచ్చినవి. ఈయుచ్చారణద్వయమువలన నేవిధమైన యిబ్బంది లేకుండ లేఖనసౌకర్యము కలిగినది' అని వ్రాసినారు. ఇట్లు కలిగినవి రెం డుచ్చారణములు గావు. ఐదుచ్చారణములు గలిగినవి. దీనివలన లేఖనసౌకర్యము కలిగిన దనినారు. అఱవములోవలె నొక్కొక్కవర్గమున కొక్కొక్క యక్షరమునే యుంచిన మఱియు లేఖనసౌకర్యము గలుగును గాదా? పఠనసౌకర్యము తొలఁగుచున్నది. మఱి యిది చక్కనిపద్ధతియును గాదు. ఇట్లొకయక్షరమే యనేకధ్వనులకు సంకేతముగా నుండుట యుక్తము గాదు. మఱియు 'మ'కారాదీతరాక్షరముల వలన నెఱవేఱు కార్యమునకే యనుస్వారరూపమున మఱియొక యక్షర ముండుటయు ననుచితము. కాఁబట్టి యీరెండు దోషములకును స్థానమైన పూర్ణానుస్వారము నాంధ్రాక్షరసమామ్నాయమునుండి తొలఁగించుటే యుక్తము. (ఆంధ్రాక్షరములు, పు. ౧౦-౧౧.) "'క్ష'కారము 'క'కార 'ష'కారసంయోగమే కాని ప్రత్యేకాక్షరము గాదు......కావున నాంధ్రమున నీ'క్ష'కారమును బ్రత్యేకాక్షరముగ వర్ణసమామ్నాయమున నిలుపుట యనవసరము. అప్పకవి యభిప్రాయము నిదే. చూ. పు. ౫౦." (ఆంధ్రాక్షరములు, పు. ౧౪-౧౫.) ఇది తొలఁగింపఁదగిన యక్షరములను గుఱించినది. "'థ', 'ధ' ల యుచ్చారణము నందు భేద మల్పము. రూపభేదము మఱియు నల్ప మగుట వలన 'థ' కారము క్రమక్రమముగ నాంధ్రమున నశించుచున్నది. దానికి మాఱుగ 'ధ' కారమునే సాధారణముగ వాడుచున్నారు. (ఆంధ్రాక్షరములు, పు. ౧౬.) ఇది యుక్తముకాదని భావించి దీనికి కారణమగు 'థ' కార 'ధ' కారరూపసామ్యమును మార్చియైన నీకొఱఁతను మాన్చి యీ యక్షరసంకేతమును దెనుఁగున నిలుపవలయు నంటినేగాని దానిఁ దొలఁగింపవలె ననలేదు.

ఇఁక నైదవకారణమును గుఱించి వెంకయ్యగా రిట్లు వ్రాయుచున్నారు:— "ఆంగ్లేయాద్యన్యభాషావర్ణముల యందలి యపూర్వవర్ణములు గొన్ని తెలుఁగునందు ప్ర

పోవుట గొప్పలోప మనియుఁ, దెలుఁగు వర్ణమాలయం
దలి యనవసరములగు నక్షరములను దొలఁగించి యాస్థాన
మున నాంగ్లేయాద్యన్యభాషలయందలి యపూర్వాక్షర
ములను బ్రవేశ పెట్టవలెననియు, నట్లొనరించినచో నాంగ్ల
యాద్యన్యభాషాపదములను స్వరూపము చెడకుండ మన
భాషలోనికి నేరాళముగఁ జొప్పింపవచ్చుననియు,
నప్పు డీతెలుఁగులిపి సకలభాషా లేఖనక్షమ మగుననియుఁ
దన్మూలమునఁ దెలుఁగుభాషకును, దెలుఁగులిపికిని మహో
న్నతపదవి లభించుననియు నిట్లు కొంద ఱూహించు
చున్నారు. ఈవిషయ మించుక విమర్శించి చూతము.
భాషాభివృద్ధికి అన్యభాషాపదములను స్వీకరింపవలసినది
యావశ్యకమే. ఆపనిని మన పూర్వకవులే యాచరించి
మనకు మార్గదర్శకులై యున్నారు. కాని, అట్లన్య
భాషాపదములను మన తెలుఁగునందుఁ బ్రయోగించునపు
డాశబ్దములు తెలుఁగువర్ణమాలకు లొంగియుండునట్లు
జూడవలయును." ఇట్లు వెంకయ్యగా రవసరమగు నన్య
భాషాపదములఁ దెలుఁగునఁ జేర్చికొనుటే యుక్తమనుచు,
వానిని స్వరూపము చెడకుండఁ జేర్చుకొన నక్కఱలేదు,
వానిని విరూపము చేసియైన మన భాషలో నిప్పటి
కున్న యక్షరములతోడనే వ్రాయుట యవసరమని భా
వించుచున్నారు. అన్యభాషాపదములను మనభాషలోఁ
జేర్చుకొనవలసివచ్చినప్పుడు సాధ్యమైనంతవట్టుకా పదము
లను విరూపములను జేయకయే జేర్చుకొనుట యుక్తము.
అట్టిపదములు విశేషించియుండునెడ వానిని వ్రాయఁ
దగు నక్షరములు లేకపోయిన వానిని గల్పించుకొనవల
యును. సంస్కృతపదముల నాంధ్రమున వ్రాయుటకు
గా వర్ణసమాక్షరములను 'శ, ష' లను, 'ఋ, ౠ' లను
దెలుఁగునఁ జేర్చుకొనిన మన పూర్వులే మన కిందును
మార్గదర్శకులై యున్నారు. "ఇట్లు తెనుఁగున నన్యదేశ్య
పదములను జేర్చుకొనునప్పు డందలి ధ్వనులకుఁ దగు నక్ష
రములు తెలుఁగున లేనంతట నూతనాక్షరముల గొన్ని
టిని గల్పించుకొనుట యుక్తము. సంస్కృతపదములను
దెనుఁగున నుపయోగించుటకుఁగా నచ్చతెనుఁగునకు
మాత్రము కావలసినవానికన్న నెక్కువగు నక్షరముల
నిదివఱకే కల్పించుకొనియున్నాము. అట్లగుటవలననే
యాంధ్రవర్ణ సమామ్నాయ మితరవర్ణ సమామ్నాయము
లన్నిటికన్న మిన్నగా నున్నదనుటఁ దగియున్నది."
"ఇఁక నాంధ్రలిపియందు నేఁ జెప్పిన మార్పులను జేయు
పక్షమున నాంధ్రలిపితో ద్రావిడభాషలనే కాక యాం
గ్లేయభాషను హిందుస్థాని మొదలగు నితరహైందవ
భాషలనుసైతము సుకరముగ వ్రాయ నగునగును. దక్షిణ
దేశభాషల నన్నిటిని నాంధ్రలిపియందు వ్రాయ వలసి
యుండును. ఈభాషల కన్నిటికి నొక్కలిపి యుండవలసిన
దనిన నది యాంధ్రలిపిదక్క మఱొక్క టేదియు
దానితోడ సీసు గానేరదు. అట్టి యర్హత యాంధ్ర
లిపికిఁ గలిగిన నందు మనదానికిఁ గలుగు మహోన్నత్య
మును నేఁ జెప్ప నక్కఱలేదు. భాషాభివృద్ధి కది
యెంత సాధక మగును? ఆంగ్లలిపియందుఁ గొన్ని
మార్పులచేత నాలిపికిని భాషకును నింతటి మహోదశను
గలిగింప నవకాశ మున్నయెడ నామార్పులకుఁ గల చిన్న
యాక్షేపముల నెక్కువగా నెన్నరాదు. చిన్నకష్టముల
కోడఁబడక పెద్దలాభములను బోఁగొట్టుకొనుట యుక్తము
గాదు. కాఁబట్టి యాంధ్రభాషాభివృద్ధిఁ గోరు
మహనీయు లందఱు నీమార్పులకు సమ్మతింప వారిఁ
బ్రార్థించుచున్నాను." (ఆంధ్రాక్షరములు, పు. ౨౨.)

అన్యభాషలనుండి నూతనపదములఁ గైకొను
కొలఁది నూతనాక్షరములను జేర్చుకొనుచుఁ బోయిన
దానికి మేర యెక్కడయని వెంకయ్యగా రాక్షేపించి
నారు. ఇది యుక్తమైన యాక్షేపమే. అయిన నెక్కువ
లాభముండు నొవిధి లేనిసందర్భమునఁ గ్రొత్తయక్షరములను
జేర్చుకొనుటే యుక్తము. అట్లు చేయనోపక యాపద
ములు విరూపములఁజేసి తెనుఁగున వాడుటలో సంభ
వించు నశ్లీలాదిదోషముల వెంకయ్యగారు Pith turban
మొదలగు నుదాహరణములతోఁ జక్కఁగ నిరూపించి
నారు. పిత్ టర్బన్ అని వ్రాసిన నీ యశ్లీలదోషము
రాదుగదా? మఱియు 'Factory' లోని 'f' నకు 'ఫ'
ను 'a' కి 'ౕ' ను జేర్చుకొనిన Factory 'ఫ్యాక్టొరి'
అని వ్రాయనగును. 'ఫ్యాక్టొరి' అని వికృతముగ వ్రాయ
నక్కఱయుండదు. ఇట్టి యక్షరములుగల ఇంగ్లీషు పద
ములు మార్గ కొలఁది విధిలేక తెలుఁగునఁ జేరియున్నవి.

ఱ, ఞ సంకేతములఁ గల్పించుకొనిన వాని నన్నిటిని విడువారికి వికటము గాకుండ సుకరముగా వ్రాయవచ్చును. "లోపభూయిష్ఠమగు నాంగ్లవర్ణమాలయం దేవో కొన్ని నూతనధ్వను లున్నంతమాత్రమున నది మనవర్ణమాలకన్న శ్రేష్ఠమగునా? ఆంగ్లభాషలో నుపయుక్తములగు ధ్వనులకు క్రమమైన సంకేతములు లేమి పెద్ద లోపమనుటకు సందేహము లేదు. ఆలోపమును దిద్దుకొనుటకు వారు గొప్పప్రయత్నములు చేయుచున్నారు. ఈవిషయమున వారి లిపికన్న మనలిపి మేలనుటకును సందేహము లేదు. ఈవిషయమున మన యాంధ్రభాష యితరభాషలన్నిటికన్న మేలుగా నున్నది. ఆంధ్రవర్ణసమామ్నాయముతో నింకేవర్ణసమామ్నాయముగాని సంపూర్ణస్థితికి సమీపించి యుండలేదు." (ఆంధ్రాక్షరములు, పు. ౨.) "అయినను నాంధ్రవర్ణసమామ్నాయమందును గొన్ని లోపము లున్నవి." (ఆంధ్రాక్షరములు, పు. ౨.) ఇతర లిపులకన్న మేలైనమాత్రమున నే యున్న లోపముల దిద్దుకొనకుండఁ గూడదు. అల్పములే యైనను వానినిగూడ సాధ్యమైనంత మట్టుకు సవరింపఁ బ్రయత్నించుట యుక్తము. "ఆంగ్లభాషకు వలసినన్ని వ్యంజనాక్షరములు లేనందుననే రెండురెండుహల్వర్ణములను జేర్చి, ch = చ, sh = ష అనియు, th = ద అనియు నిట్లెన్నియో ధ్వనులను వ్రాసికొనుచుఁ గష్టపడెదరు" అని వెంకయ్యగారే చెప్పుచున్నారు. అట్లు వర్ణలోపముచేత కొంతయైన మన మేల కష్టపడవలెను? మన కట్టికష్టము లల్పములు. దిద్దుకొనవలసిన యంశములు తక్కువ. కనుక సులభముగా దిద్దుకొనవచ్చును. అనవసరముగ నన్యభాషాపదములను దెనుఁగునఁ జేర్చుట భాషాభివృద్ధికరమగు పని యేనాఁటికిఁ గాదనుటలో వెంకయ్యగారితో నేనుసంపూర్ణముగ నేకీభవించుచున్నాను. "ఇట్లనుటచే ననవసరముగ నన్యభాషాపదముల మన భాషయందుఁ జేర్చి మాట కొక్క యన్యదేశీయపదము నుపయోగించుచుఁ జక్కనిభాషను జెఱచి విరూపమును జేయఁదగునని నాయభిప్రాయము గాదు. విధిలేని సందర్భముల నన్యభాషాపదములను గొన్నిటిని గైకొనుట యావశ్యము." (ఆంధ్రాక్షరములు, పు. ౨-౩.)

ఇక నావకారణము:—

"ఇతరస్వరవర్ణముల రూపాంతరములు వ్యంజనవర్ణములతోఁ గలియునప్పుడు సైతము అకారచిహ్నమగు తలకట్టు చేర్చి వ్రాయఁబడుట తెలుఁగులిపియం దొక లోపమని తలంపఁబడుచున్నది. ఇది తెలుఁగునఁ బ్రత్యేకముగాఁ దెచ్చిపెట్టుకొనినదిగాదు. ఇదివఱకు వంశపారంపర్యముగా వచ్చిన యాచారమే" అనుచు వెంకయ్యగారు నాగరీ, వంగ, కర్నాటాదుల యక్షరములపైన యడ్డుగీట్లున్నవనియు, అవి తెలుఁగుతలకట్లవంటివే యనియు వాదించుచున్నారు. అట్లుకాదని నాభావము. నాగరిలో నీయడ్డుగీటు అక్షరమును ముగించువిధమే గాని అకారసంకేతము గాదు. అది యన్నియక్షరముల కున్నది. ఇకారాద్యచ్చులను జేర్చునప్పుడుగాని మఱి యెప్పుడుగాని దానిని విడుచుట లేదు. తెలుఁగున నట్లు గాదు. ఇకారాద్యచ్చులను జేర్చునప్పుడు వానిని వదలుచున్నాము. మఱి 'ఖ'కారాదులకు తలకట్టును జేర్చుట లేదు. తలకట్టు ఎప్పుడును నుండకతప్పని నాగరియడ్డుగీటువంటిది గాదు.

ఒకవేళ నాగరిఅడ్డుగీటు తెలుఁగుతలకట్టువంటిదైనను కేవలము 'ఉ'కారముమాత్ర ముండవలసినచోట 'అ'కార'ఉ'కారసంకేతముల రెంటిని గలుపుట స్వభావవిరుద్ధమనునది స్వతస్సిద్ధముగా నుండ నాయక్రమపద్ధతి నాగరిలో నుండినను మన మేల దాని నంగీకరింపవలయును? ఇతరులయందలి మేలును గైకొనఁదగునుగాని లోపములను గ్రహించుట యుక్తము గాదు. (ఆంధ్రాక్షరములు, పు. ౧౧-౧౩.) "అనేకస్వరసంకేతముల సంయోగరూపముల నుచ్చారణమునం దుపయోగము లేకయే యొక్కహల్లుతోఁ జేర్చి వ్రాయఁగూడదు. ఇట్లుండ 'ఉ'కారసంయోగరూపమైన (ు) కొమ్ము నొకహల్లునకుఁ జేర్చి వ్రాయునప్పుడు ప్రాయికముగా 'అ'కార సంయోగరూపమగు (ˇ) తలకట్టునుగూడఁ జేర్చి వ్రాయుట కలదు. ఇట్లు 'కు' 'రు' 'చు'. ఇది తప్పు. 'కు' అనునది 'క్'కార 'అ'కార 'ఉ'కారము లగును. 'అ'కార 'ఉ'కార మేళనము సంస్కృత వ్యాకరణపద్ధతిని 'ఓ'కార మగునుగనుక నిది 'క'కార

'ఓ' కారమును 'ఔ' అనుటకు సంకేత మగునేకాని కేవలము 'క' కార 'ఖ' కారములకు సంకేతము గానేరదు. 'క' కారాదులపై నున్న 'ఆ' కారములు (తలకట్లు) అక్షరాలంకారములే గాని యుచ్చారణోపయోగములు గావని వేంకటనారాయణశాస్త్రిగారు వారి యాంధ్రాక్షర తత్త్వమునఁ జెప్పినారు గాని పద్ధతికి విరోధమును సందేహజనకము నగు దురాచారమును మానుట యుక్తము. ఇట్లే 'ఓ' కారమును......(ఆంధ్రాక్షరములు, పు. ౧౧) 'అ' కారమునకు సంయోగరూపము తలకట్టని నిర్ణయించినతరువాత నేహల్లునకుఁగాని 'అ' కారమును జేర్పవలె నన్న నాహల్లునిజరూపమునకుఁ దలకట్టిచ్చియే వ్రాయవలెను. కొన్ని హల్లులకు మాత్రము దలకట్టిచ్చి, మఱికొన్నిటిని 'అ'కారసంయుక్తము లైనప్పటికిని దలకట్టు లీయక నిజరూపమువమాత్రమే వ్రాయుచుంట యుక్తమైన పద్ధతి గాదు. ఇట్లు 'క' వర్గము రెండవహల్లునకు 'అ' కారమును జేర్చి వ్రాయవలె నన్న 'ఖ' అని వ్రాయుట యుక్తముగాని 'ఖ'అని తలకట్టీయకుండ నిజరూపమునసే నిలుపుట పద్ధతి గాదు." (ఆంధ్రాక్షరములు, పు. ౧౩.)

'నాగరియందుఁగాని తెలుఁగునందుఁగాని, కన్నడమునందుఁగాని ప్రతియక్షరమును వ్రాయునప్పుడు క్రిందివైపున నారంభించి పైపైపున ముగింపఁబడుచున్నది. అందు కనుగుణముగా నాతలకట్టు చేర్చఁబడి యున్నవి. అవి లేకున్నచో వ్రాయుట చాలకష్టముగును.' అనుచు వెంకయ్యగారు దానికిఁ గొన్ని యుదాహరణము లిచ్చినారు. ఈసమాధానము యుక్తియుక్తముగా లేదు. తలకట్టులే లేని 'ఖ' కారాదు లెన్ని యున్నవి? ఇకారాద్యచ్చులఁ జేర్చుటచేతఁ దలకట్టులు మాను నక్షరము లెన్ని యున్నవి? వీని కన్నిటికి వ్రాఁత సౌకర్య మేమైనది? వీని కన్నిటికిఁగూడ లేఖనసౌకర్యార్థము తలకట్టుల నేల పెట్టలేదు? 'పురుషోత్తముఁడు' అను నుదాహరణ మిచ్చినారు. తలకట్టు అక్షరము ముగించునప్పు డుండుట పైయక్షరము నందుకొనుటకు వీలిక యనియా, లేక కొమ్మునకు ముందుండిన కొమ్ము నందుకొనుటకు వీలిక యనియా వెంకయ్యగారి యభిప్రాయము? నిర్ణయముగాఁ దెలియలేదు. అక్షరము నిలుపునప్పుడు పై యక్షరము నందుకొనసౌకర్య మనుపక్షమున నీతలకట్టు కొమ్మునకుఁ జేర్పవలెను. వారిచ్చిన యుదాహరణములను జూడఁ గొమ్ము నందుకొనుటకు దానిముందు తలకట్టు వ్రాసిన సుఖమని వారి భావముగాఁ దోఁచుచున్నది. అట్లయినఁ గొమ్ములులేని యక్షరముల కేమి చెప్పుదురు? మఱియుఁ దలకట్టు అక్షరముతోఁ గలిపియుండని 'ప, స, హ' ల కీతలకట్లు సౌకర్యమును గలిగించు నందురు?

"హల్లు లచ్చుల సహాయము లేక పలుక వలనుగాదుగావ సాధారణముగ మొదటి యచ్చును 'అ' కారమును జేర్చి పలుకుచుందుము. వ్రాఁతలో నట్లే 'అ' కారసంయోగరూపమగు (✓) తలకట్టును జేర్చి వ్రాయుచుందుము. అది మిక్కిలి వాడుకయైనతరువాతఁ బ్రత్యేకముగ నిజరూపమును దెలుపవలసివచ్చినప్పుడు తలకట్టును దొలఁగించినమాత్రము చాలదని దానికి మాఱుగ వేఱొక యొత్తు (ˉ) ను జేర్చుచున్నాము. ఇట్లు మొదటి హల్లు నిజరూపమును వ్రాయవలె నన్న నూరక 'క' అని వ్రాయక 'క్' అని వ్రాయుచున్నాము. ఇది యుక్తము గాదు. నిర్వికారమైన మొదటిరూపము నిజరూపము. దానిపైన స్వరములఁ జేర్చునపుడు తక్కినమార్పులన్నియుఁ గలుగవలెను.

'క. పొల్లులయి తాము పుట్టియు, హల్లులు ప్రాణములతోడ సంబుధితవయా, వల్లభ కూడికదాతల, ముల్లు సుడులు శృంగములును మొదలుగఁ దాల్చున్.'

(అప్పకవి, ౪౭.)

కాఁబట్టి మొదట హల్లుయొక్క నిజరూపము 'క' దానిపైన 'అ' కారాద్యచ్చుల సంయోగరూపములను జేర్చిన 'క' 'కి' మొదలైన వగుచున్నవి." (ఆంధ్రాక్షరములు, పు. ౧౨.) కాఁబట్టి 'అ' కారసంయోగమునసే తలకట్టు రావలెను. పొల్లులకుఁ దలకట్లుండుటకుఁ జైన నే జెప్పినదే కారణ మైనచో 'ఖ' కారాదులకుఁ దలకట్లు లేకపోవుటకుఁ గారణ మేమని యడుగవచ్చును? అవి యంతఁగా వాడుకలో లేనివనుచే నాకు సమాధానము తోఁచుచున్నది.

ఇక నేడవ కారణము:—

"సవర్ణ ములను వ్యంజనాక్షరముల యాకారము లొక్క పోలికగా నుండకుండుట యొక లోపముగాఁ దలంపఁబడుచున్నది. ఇదియుఁ బరంపరాగతమే. ఆవిషయమునఁ దెలుఁగే నాగరలిపికన్నఁ జాల మేలనవలసియున్నది." అని యిందుకు వెంకయ్యగారు నాగరలిపి నుండి యుదాహరణము లిచ్చినారు. నాగరలిపికన్న నీ విషయమునఁగూడఁ దెలుఁగు మేలనుట నిక్కమేగాని యిక్కడఁగూడ లోపములను దొలఁగింపఁగూడమికి పరంపరను దెచ్చిపెట్టినారు. "వర్గాక్షరములలోని మొదటి హల్లునకును, రెండవహల్లునకును ధ్వనియందుఁ గించిద్భేదము మాత్రమే కలదు. మొదటిహల్లునే కొంత యొత్తి యొక్కవయుబారి విడుచుచు 'హ' కార స్వభావమును గలిగించిన రెండవహల్లగుచున్నది. కావుననే సామాన్యముగ మొదటి యక్షరమునకును, రెండవ యక్షరమునకును రూపభేదము చేయక మొదటి యక్షరమునకు (।) సంకేతమును గ్రిందఁ జేర్చి రెండవయక్షరముగ మార్చుచున్నారు. 'సీ. క్రిందఁ గంబముపోల్కి గీటొక్కటిడిన నాద్యములు రెండవలిపు లై పొసంగు.' (అప్పక. పు. ౪౬.) ఇట్లే మూఁడవహల్లునకు (।) చేర్చుటచే నాల్గవ హల్లగుచున్నది. చఛ, డఢ, దధ, పఫ, బభ,ల విషయములో నీపద్ధతి నవలంబించుచున్నాము. ఇదియే సహజ పద్ధతి. తక్కిన 'కఖ, గఘ, జఝ, టఠ, తథ'ల విషయములోమాత్రమీ సహజమైన పద్ధతిని విడిచి మఱియే యొక్క పద్ధతినేనియు ననుసరింపక వేఱక్షరములను జేర్చుట యసంగతమేగాక మిక్కిలి యసౌకర్యమునకును గారణమైనది. కాబట్టి యీయక్షరముల విషయమునపైతము పైపద్ధతినే యవలంబించి క।, గ।, జ।, ట।, త।, యని వ్రాయుటవలన సహజమైన చక్కని పద్ధతి ననుసరించుటేకాక యనవసరమైన యక్షరముల నైదింటిని దొలఁగింప సాధ్య మగుచున్నది. వేంకటనారాయణ పాతిగారి యభిప్రాయమును దీనిఁ బోషించుచున్నది. (హా. శి. ఆం. త. ౬౩, ౬౪.), (ఆంధ్రాక్షరములు, పు. ౧౪.) "పైఁగనిన మూఁడు, ఆఱు, ఏడుకారణములందుఁ జేర్కొనఁబడిన లోపములు లేకయు, ఆంగ్లేయాదిసకలభాషలకు నిర్దుష్టముగాను, యథోచ్చారణముగాను, లిఖించుట కనువుపడునట్లులును నుండు నొకలిపి కావలయునను గ్రొత్తగాఁ గల్పింపఁబడవలసినదే"యనిరి. ఆంధ్రాక్షరమున నేఁ జెప్పినరీతి కొన్ని యక్షరసంకేతములను మాత్రము కల్పించినఁ దెనుఁగులిపితోనే యీకార్యము సాధింపఁగలము. ఇవి లోపములని యెంచియేగదా వెంకయ్యగారు రెండు లిపులను నిర్మించినది.

ఇక ఎనిమిదవ కారణము:—

"ముద్రాక్షర మంజూష (Type case)యందలి యక్షరములు దాదాపు ౯౦౦ లకు పైననే యుండుట వలన ముద్రాక్షరసంయోజకుల (Compositors) కు మిక్కిలి శ్రమము గల్గుట." ఇది నిక్కమని వెంకయ్యగారే యొప్పుకొని "సంస్కరణము మాత్ర మత్యావశ్యకమనియే నే ననుచున్నాఁడను. అసలు లిపిసంస్కరణ ప్రసక్తి యేర్పడుటకుఁగల ముఖ్యకారణము మనముద్రణా విధానమునందలి కొన్నిలోపములే గాని మఱియొండు గాదు" అనుచు "...మాత్రము లను కొద్దిమార్పులతో సర్దుటకుఁ జూడవలయును. అట్లొనరించిననే సంస్కరణ మనిపించుకొనును" అని చెప్పినారుగాని వారు చెప్పిన మార్పులు చేసినంతట లిపిస్వరూపమే మిక్కిలి మాఱుచున్నది. ఇట్లక్షరరూపములను మార్చకయే సంయోగ రూపభేదములను వదలి హల్సంయోగములను వడిక్రింద వడిని వ్రాయక ప్రక్క ప్రక్కను వ్రాయుపద్ధతి నవలంబించిన లిపిరూపము మాఱకయే ముద్రణసౌకర్యము కలుఁగఁగలదు. "హల్లుల కన్నిటికిని సంయుక్త రూపభేదము గలిగి వడిక్రింద వడిని వ్రాయుటలో ననేకము లసౌకర్యము లున్నవి. చిన్ననాఁటినుండియు నలవాటయియున్నందున మన కాసంకటములు స్ఫురింపవు. ముద్రణము చేయువారికిఁ గొంతవఱకు తెలియకపోయుండ నోపు. ఒక్కొక్క సంయుక్తాక్షరమున కొక్కొక్క ప్రత్యేకముద్ర కావలెను. వీని నన్నిటి నెఱింగి కూర్చుటెంతకష్టము. ఈవిషయమును నేను ౧౯౧౯-వ సంవత్సరము మద్రాసున సాహిత్యపరిషత్సభకుఁ బోయి యుండ నక్కడ ముద్రణానుభవముగల యొక యాంధ్ర

పండితునితోఁ బ్రస్తావింపఁగా నాపండితుఁడు సంయుక్తాక్షరముల విడఁదీయుపక్షమున ముద్రణ మిఁక చాలంగంతలు సులభ మగుననియు, నీ కష్టమువలననే యాంగ్లేయ పత్రికలతో సమానముగ విపులమైన యాంధ్రదినపత్రికల ముద్రింపలేకయున్నామనియుఁ జెప్పెను.' (ఆం. అ. ౮౭, ౮౮.)

ఇఁక తొమ్మిదవ కారణము:—

"ముద్రాక్షరలేఖనయంత్రము (Type-writer), లినో టైపు (Lino-type), మొనో టైపు (Mono-type) మున్నగుయంత్రములను నిర్మించుట కనుకూలింపకపోవుట." దీనినిగుఱించి వెంకయ్యగారిపు డేమియు వ్రాయలేదు. "అచ్చువ్రాఁతయంత్రమును దెనుఁగుభాషకు నిర్మింపవలెనన్న వర్ణసమామ్నాయము దీమార్పు లత్యవశ్యము. హల్లుల సంయోగరూపముల నట్లే నిలుపుకొనవలె నన్నఁ బ్రతిసంయుక్తరూపము నొక్క-ప్రత్యేకాక్షర మగుటవలన నన్ని యక్షరములతో నచ్చువ్రాఁతయంత్రమునునిర్మించుటగాని, నిర్మించినను దానివాడుటగాని సులభసాధ్యము గాదు. కనుకనే యింకను మన కచ్చువ్రాఁతయంత్రము ఏర్పడలేదు. పైనఁ జెప్పిన మార్పులతో నాంధ్రమున కచ్చువ్రాఁతయంత్రము నిర్మింపఁ బ్రయత్నించుచున్నాను. "అన్యభాషాపదములను దెనుఁగున వ్రాయుటకును, నాంధ్రవర్ణసమామ్నాయమున కనన్యాపేక్షమగు స్వతంత్రతఁ గలిగించుటకును క్రొత్తగఁ జేర్చిన యక్షరములు కేవలము లోక్యవ్యవహారోపయోగార్థమును నీయచ్చువ్రాఁతయంత్రమున నవసరముగాన వానిని నన్నిటి నందుఁ జేర్చుట లేదు. ఈయంత్రము వలన నాంధ్రమునకుఁ గలుగఁగల లాభములను నేఁ దెలుపనక్కఱలేదు." (ఆం. అ. పు. ౮౮.) ఇప్పు డాయంత్రమున కేర్పాటైనది. అచిరకాలములోనే యంత్రము వచ్చును. ఆంధ్రభాషాభిమాను లందఱు నీయంత్రమును నాదరింపవలెనని వారిని బ్రార్థించుచున్నాను.

నేఁ జెప్పిన మార్పులు మార్పులనుటచేతనే కొందఱి కవి యిప్పుడు రుచింపకపోవచ్చును. ఉండుఁగాక! కాలాంతరమున నైన నవి సమ్మతిఁ బడయఁగలవని నేను దృఢముగ నమ్ముచున్నాను.

---

## లీలాశుకము

అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయులుగారు (కవితాసమితి)

ఓ శుకవాణి నీ కళల నేనగు తత్త్వము; స్థూలమూర్తికిన్
గ్లేశము లున్న, నాత్మకవి లీలలు, గానకళావిలాసముల్;
నీ శివసంపదైక్యఫలనీమమె తత్కృతనిత్యదీక్ష; త్వ
ద్దేశికతాప్తి నభ్యుదయదీప్తి నలర్పవె శ్యామలాకృతీ!
పలుకుఁ దియ్యందనమ్ములఁగులికికులికి-శ్రుతిమహోత్సవ మొలయించి చతురరచనఁ
గొమ్మపై రాగ మొలికించి కుతుకలీల-ద్విజవతంసమ! వెలయవె విజయగరిమ.

'మణిద్వీపము.'

---

# 'పూర్వప్రేమ'

శ్రీ కాళహస్తీశ్వర రావు, సీతారామమూర్తి గార్లు

How sweet it is to sit and read the tales
Of mighty poets and to hear the while
Sweet music, which when the attention fails.
Fills the dim pause. — Shelly.

కాలప్రవాహమున నుత్తుంగతరంగములు లేచుచున్నవి. ఒక్కొక్క తరంగ విఱుపునకు నూత్నమణి యొక్కొక్కటి ప్రకృతిపై విరఁజిమ్మఁబడు చున్నది. నవ్యకావ్యవాహిని యందుఁ దేలిన రత్నశలాక 'పూర్వప్రేమ.'

జాతిముత్తెములు తెనుఁగుతల్లికి సమర్పించిన గుఱజాడ అప్పారావు 'కొయ్యబొమ్మల మెచ్చు కనులకు కోమలుల సౌరెక్కవా ?(నా?)' అని కవితకు నూత్నప్రతిష్ఠ నిచ్చియున్నాఁడు. ఆ దేవీపూజారంగమున కుఱికినవారిలో నుత్తమ శ్రేణి నలంకరించినవాఁడు అబ్బూరి రామకృష్ణారావు. ఈతని కవనమంతయు నాంధ్ర సువర్ణయుగమునకుఁ జెందిన ప్రత్యేకశిక్షా విధానమునఁ జేరి విలక్షణసార్థకతను నిరూపింపఁ గలుగునది.

సమకాలికకావ్య మత సంప్రదాయము రామకృష్ణారాయని కవితయందు పొడసూపుచున్నది. భావముకన్న ముందు పదములు, పదములకన్న ముందు భావము పరువు లెత్తు నొకయూట యిందు ప్రతిబింబితము. ఒక్కొక్కప్పు డది యూహాపథమున నుద్విగ్న విహారము సల్పు 'పులువుల కేకలు'.

'పూర్వప్రేమ' "A gentle story of two lovers young, who met in innocence and died in sorrow" .(Shelly.)

ఇందలికథకు పూర్వగాథ — "రాచబిడ్డ యగు లక్ష్మీంద్రుని వంశీయులందఱును రౌద్రరూపిణి యగు మనసాదేవి యారాధకులు. లక్ష్మీంద్రుని జనకుఁడు మాత్రము వంశము నుండి వంశమునకు ధారావాహకముగ వచ్చుచున్న యీ దేవీ భక్తిని నిరాకరించి మానసదేవికి పూజాంజలి నీయ మానెను. ఆమె తన యాగ్రహజ్వాలచే నతని ననేక విధముల సంక్షోభ పెట్టెను. కాని యతని మనోనిశ్చయ మేమాత్రమును క్షీణింపలేదు. చివరకు లక్ష్మీంద్రకుమారుఁడు వివాహశోభన వేళ రాత్రిజామున సర్పసందష్టుఁడై మృతి నొందునట్లు శపించెను. శాపబాధ నివారించుటకై సర్పప్రవేశమున కసాధ్యమగు నినుప మేడ నిర్మింపఁబడెను. సర్వజ్ఞ యగు మనసాదేవి దానిలో నొక రంధ్రముఁ గల్పించెను. ప్రకృత మిందు లక్ష్మీంద్రునియొక్కయు, నతని ప్రాణసఖి యగు వేహుళయొక్కయు ప్రేమానుభవమును దాని విషమ పరిణామమును వర్ణింపఁబడినవి."

వివాహశోభనవేళ 'చెదరెడు పశ్చిమారుణ విచిత్రముల' చీఁకటులు గ్రసించినంతనే లక్ష్మీంద్రునితో 'వృద్ధనారీ తపస్విని' "ఈప్రా

యస్సతీ నూత్న శోభాలక్ష్మల్ ధరియింపు మోయి యిఁక నీపై కొత్తమోదమ్మునన్" అని "ఆ యపూర్వ మగు నయోగ్యగృహమ్ము నందు పలుకకయె భావమెఱుగు దంపతుల వీడి" వెడలిపోయినది.

వేహుళ అకలంకమూర్తి. ఆమె వినయ మనోజ్ఞములయిన చూపులు నేలకు వ్రాల్చి నిల్చియున్నది. ఆమె వంచియున్న మోమును ప్రియుఁ డెత్తినాఁడు. ఆమెసౌందర్యమును త్రావుకొన నోఁచిన భాగ్యకుమారుఁ డతఁడు; కాని యతని భాగ్యచిహ్నమగు కుంకుమరేఖ ఆమె త్తినమోముపైఁ గనుఁగొనలేక యతఁడు చకితుఁడయ్యెను రాఁబోవు నభాగ్యఫలితము వానికి ప్రియాముఖమ్మున నిలిచిన ట్లయినది. అప్పుడు లక్ష్మీంద్రుఁడు "ఆర్ద్రవాణీ! యని మోము నెత్తి యట నిల్పె మనోహరకుంకు మాంకము." పాపము సుకుమారయగు వే హుళ నవ్వినది.

మహాకఠినమగు విధిపాతము నెఱుంగని యాయభాగ్యప్రియుఁడు ఆచిఱునవ్వుతో ప్రే మోన్మాది యైనాఁడు.

"వేసఁగిసంజలందు పురి
విచ్చిన తెల్లమొయిళ్ల గుంపులన్
డాసి మెఱుంగు వెట్టెడు ది
నప్రభు కాంతులువోలె వైభవో
ల్లాసిని! నామనోనియతు
లం గరఁగించి పసిండిపూఁతలన్
వ్రాసితి వందు నీయమృత
రాగకదంబిత హారమాలికల్."

ఇట్లు అంపలేని ప్రేమతోఁ బలికి యామెను దరిఁజేర్చుకొనిన నిముసమున నామెసర్వస్వము నతని యధీన మైనది. ఆమెయం దొకభయ ము, భవిష్యద్విచారము పొడమి "జీవిత పతీ! సతిమున్ భవదీయనాచు నీదాపున ప్రాణముల్ నిలుపుదాన నిజ" మ్మని పల్కించి నది. అంతట వా రొంటిపాటున శయనించిరి.

"క్రమమున రెండుయామముల
కాలము రాత్రి గతించె లోకమం
దమృతకరోదయమ్ము తెలి
యం జనుదెంచెడు దూలవోలె రం
ధ్రము నొకదానినుండి కిర
ణ మ్మొకఁ డాగదిలోని నేలపై
తెమలుచునుండె పాండువయి
తెల్లని సర్పము ప్రాఁకుపోలికన్."

ఈపద్యము భవిష్యద్విపత్సూచి. మనసా దేవి సర్వజ్ఞత్వముచే నిర్మింపఁబడిన యారం ధ్రమే లక్ష్మీంద్రుని జీవితమునకు కాలద్వా రము. సర్పాకృతిగల చంద్రకిరణమే లక్ష్మీం ద్రుని భయావహునిఁ జేసి లేపినది. అతనికి నో రెండిపోయినది. పానకము తయారుచేయు టకు ధర్మపత్నియగు వేహుళ సామగ్రి లేని యా యయోగ్యగృహమున "నారికేళ ఖండంబె పానకపు పాత్రకాఁగ, నాయింటిమూలల దాఁగి యున్న చినిఁగిపోయిన బట్ట లింధనము కాఁగ" ప్రాయి రాఁజఁజేసెను. వంటకము పూర్తియై నంత నే లేచి యామె వివర్ణమైనది. ఎదుట నొక మలినోరగము. తటిల్లతవలె నామె హృదయ

# తెలుఁగులిపియుఁ దత్సంస్కరణమును—కొన్ని సూచనలు

ఓ. వేం. సుబ్బారాయశాస్త్రి గారు

తెలుఁగులిపిసంస్కరణవిషయమై యిదివఱ కెందఱో మహాశయులు వ్యాసముల వ్రాసి పత్రికల యందుఁ బ్రకటించిరి. ఇటీవలి "శ్రావణమాసపుభారతి" సంచికలో, యం. యస్. వెంకయ్యగారు నీవిషయమును విపులముగఁ జర్చించి యిఁకముందు వాఁడఁదగినలిపిని చూపియున్నారు. నేను సుమారు 3 వత్సరముల క్రిందట నీ విషయమునఁ గొంతపరిశ్రమఁ జేసితిని. నాయభిప్రాయము వెంకయ్యగారి యభిప్రాయముతో నేకీభవించినది. కాని కొన్ని విషయములలోమాత్ర మభిప్రాయభేదము కలదు. వానిని దెల్పినచో సవిమర్శముగా పరిశీలించి యర్హమగుచో సాధ్యమగుసవరణ చేయఁగలరని నమ్మి నేను దెల్ప సాహసించితిని.

ప్రాచీనలిపియందలి లోపము లేవియో, లోపములు గలవని తలఁచు కారణము లేవియో, లిపి యెందులకు సంస్కరింపఁబడవలయునో, మున్నగు విషయముల విపులముగఁ జర్చించి, దాదాపు ౯౦౦ వఱకు నుండు పూర్వవర్ణమాలను ౧౮౫, లేక ౧౦౮ లోనికి తగ్గించి, సరియగు నుపపత్తులఁ జూపియున్నారు. వర్ణమాల యెంత తగ్గిన నంత సులభముగా కంపోసుచేయవచ్చునుగదా! గుడి, ఎత్వము, వేరుగా నతుకువిధములో ౧౦౮ వర్ణములతో చేయించవలసినవి సరిపోవుననియు, వర్ణములు తగ్గిన పైన, క్రిందు నొత్తులు పెట్టుట కష్ట ముండదనియు బాగుగా వ్రాసిరి. ఇంకను కొన్ని చేయింపవలసినవి తగ్గించిన ముద్రాక్షరసంయోజకులకు శ్రమ తగ్గును. కేసుకూడా తగ్గిన లాభము మెండుగదా! నాముఖ్యోద్దేశ్యము చేయింపవలసిన యక్షరసంఖ్య తగ్గించుటే. విమర్శించి గ్రహింపఁగలరని మనవి. నే చెప్పఁబోవు విధమునకు సరిపోవు నటులే చేయింపవలయును.

## అచ్చులు

* ఔకారమును, ఒకారమును తిరుగవేసిన సిద్ధింప చేయవచ్చును. అవసరమగుచో ఒకారములో కొద్ది మార్పుచేసినను పూర్వవర్ణముతో భేదింపదు.

ఎకారమునకు మీఁదను దీనిని చేర్చిన ఏకారమును-ఒకారమునకు మీఁదను చేర్చిన ఓకారమును-చేయింప నక్కఱలేదు. భేదము కొద్దిగా నున్నను సహ్యమే.

## హల్లులు

చవర్గము.—ఇందు చే, జే, లకు వేరురూపములఁ జూపియున్నారు. అవాల్గ నవసరములే. పూర్వవర్ణపురీతిగా ౨ దీని నతుకురీతియె బాగు. దీనిని వేఱుగా చేయింప నక్కరలేదు.

పై నతుకువిధములో కష్టమున్నచో, వీని నుంచినను, వీని ఒత్తులు ౨ అనవసరములు. రచ్చ, ఒజ్జల, మున్నగుచోట్ల చ, జ, ల ఒత్తులనే ఉపయోగించుట అనుభవసిద్ధము. చే, జే, ల ఒత్తులకు లాభము లేనేలేదు. తగ్గింపవచ్చును.

ఛకారము — చకారమునకు క్రిందిభాగమున | లేక | దీని నతుకురీతి చాల సులభము. ఇప్పటివర్ణముల రీతి కిది చాల సులభమే. ఒత్తువర్ణము నంతే.

లేక | దీని నతుకురీతివలని లాభములు మెండు.

టవర్గము — డకారమునకు పైదాని నతికిన ఢకారము.

ణ-కారములో కొద్దిమార్పుచేసి, ఐకారములో కొద్దిమార్పు చేసి ప్రక్కగా నుండు రీతిచే ణకారము ననవసరము.

* ఈఅభిప్రాయ మముఖ్యము.

తవర్గము.— దకారమునకు పైదాని నతికిన ధకారము.

అడ్డుగా నతుకురీతిచే థకారమును అనవసరము. థకార ము మాత్రము మాఱిపోవును. త, థ, లకు సంబంధ మెప్పుడు లేదుగదా?

పవర్గము.—పకారముచే ఫకారమును, బకారముచే భకారమును సిద్ధింపచేయవచ్చును. పూర్వ బకా రముకన్న ఇప్పటిదే మేలు.

అంకెలచే కొన్నిటిని గతార్థముచేసిన పైపుకేసు గళ్లు తగ్గింపవచ్చును. ఇది అముఖ్యము.

౧ గవత్తును, ౨ తవత్తును, 3 లవత్తును, ౪ వత్తును, ౫ శవత్తును, ౬ ఔత్వమును, ౭ కవత్తును తగ్గింప వచ్చును. కష్టసాధ్యము—౪వత్తో, లవత్తో అనవసరమే.

ఈరీతి చేయించినచో ౯౦కన్న నెక్కున యవ సరము లేదు. చూచితిరా? ౯౦౦ లెట్లు ౯౦ వర్ణము లైనవో: తీసినది సున్నే.

---

# శబరి



చింతా దీక్షితులుగారు

[మతంగవనములో శబరిఆశ్రమము. వెనుక చెప్పిన రెండుకుటీరములూ ఆప్రకారముగానే ఉన్నవి. వాటికి ముందుభాగాన చిన్నచెరువు. చెరువుచుట్టూ శిలా కూటములు. ఎప్పుడూ జలము వాటిలోనుంచి పైకి చిమ్ముతున్నది. శిలాకూటములచుట్టూ పూలమొక్కలు. పువ్వులు వికసించి ఉన్నవి. చెరువుకు నాలుగుగజాలముందు రెండుఉన్నతాసనములు. వాటిపక్కలు జేగురుమన్నుతో అలికి తెల్లచుక్కలూ పచ్చచుక్కలూ లతలూ చిత్రించి ఉన్నవి. ఆసనములమీద పత్రము లొకదాని కొకటి అంటించినవి పరిచి ఉన్నవి. పత్రముల అంచులకు పువ్వులు కుట్టి ఉన్నవి. ఆసనములవరకూ పారిజాత పుష్పములు పరిచి ఉన్నవి. వాటికి రెండుపక్కలా కదంబపుష్పములు ఎర్రఅంచులవలె ఉన్నవి. కుటీరములకు వెనుక సాగరజలము. దానివెనుక ఆకాశము. అంతటా చెట్లు. అప్పుడే చిన్నతుషారము పడి వెలిసింది. శబరీ, ఇర్రీ, హనుమంతుడూ కుటీరములదగ్గిర ఉన్నారు. హనుమంతుడు కాషాయవస్త్రం దట్టిలాగ బిగించుకొన్నాడు. ఇంకోబట్ట కప్పుకొన్నాడు. వెనుకవైపు అర్ధచంద్రాయుధము. ఇర్రి పసుపుపచ్చనిబట్ట కట్టుకొన్నది. పక్షి వెండ్రుక లంతటా పెట్టుకొని పక్షివేషము వేసినట్లున్నది. శబరి కాషాయవస్త్రం మొలకు చుట్టబెట్టుకొంది.

ఆకాశంమీద నల్లమబ్బులు. పావురములు ఎగురుతూ పల్లటీలు కొట్టుతూ ఉన్నవి. ఎడతెగని బలాకముల బారులు.]

శబరి

వచ్చేశారు, నాపెన్నిధి! నాతండ్రి వచ్చేశారు! నాయనా, హనుమంతూ, నే నిలాగ అవుపిస్తే నవరదా న్నని అసహ్యించుకోరు గదా శ్రీరాములు?

హనుమంతుడు

ఎంతమాట అన్నావు తల్లీ!

ఇర్రి

శబరీ, ఉండు, నేను నీకు ముస్తాబు చేస్తాను. ఆకాషాయవస్త్రం, అదీ, అలాగ కట్టుకో. ఈకావిబట్ట ఒంటిమీద కప్పుకో!

ఆఁ, అలాగ. జుట్టు దులిపి ముడి వేస్తానుండు. ఆఁ, అదీ. ఈమాటు బాగుంది.

ఏదీ ఆపువ్వులురెండు జుట్టులో పెట్టనియ్యి. ఈమాటు బాగుంది.

[ఇర్రి తల దులిపి ముడివేసి పువ్వులు జుట్టులో పెట్టును.]

ఈమాటు శ్రీరామచంద్రుడు లేమీ అనుకోరు!

శ బ రి

ఇర్రీ, మానాయన వస్తున్న ట్లున్నారు. నాహృదయం గబగబా కొట్టుకొంటూ ఉంది. చూడు ఇర్రీ, నీవు ఆపత్తులవెనుక నిలబడి నేను చెప్పినప్పుడు పాటితోకూడా పాడు. నేనూ పాడతానులే. చూడు హనుమా, నీవు ఆపీఠాల కెదురుగా ఆపారిజాతవృక్షం మొదట కూర్చో. శ్రీరామచంద్రుని పాదాలమీద మాత్రం దృష్టి ఉంచు. నీదృష్టులతో వాటిని చుట్టబెట్టు. వదలకుమా. వెళ్లండి—నాహనుమా, వెళ్లు; నాఇర్రీ, వెళ్లు.

[ఇర్రీ, హనుమంతుడూ తమస్థానాలకు వెళ్లుదురు.]

శ బ రి

[ముందుకు వచ్చి] వచ్చారు నాతండ్రి. నాహృదయం చెప్పతూ ఉంది వచ్చారని. ముసలిదానికి నాకు గగుర్పా టేమిటి? దేహమంతా ఎలాగ కంపిస్తున్నదో! కళ్లంట నీళ్లు ఎలాగ వస్తున్నవో! తుడుచుకొని నాతండ్రిని కరువు తీరా చూచుకోవలె. కళ్లల్లోంచి నీరు రాలకూడదు. కాళ్లూ చేతులూ తడబడకూడదు. ఎలాగ? ఏమి చేసేదీ? అరుగో! అరుగో! వచ్చారు! మేఘమూ మెరుపూలాగ ఉన్నారు నాతండ్రులు. మాట్లాడుకొంటూ వస్తున్నారు. మేఘగర్జనములవలె వినబడుతున్నవి వారిమాటలు. వెడుతున్నా, నాతండ్రులదగ్గిరికి! వెడుతున్నా! నాతండ్రులు; శ్రీరామలక్ష్మణులు; నారాముడు, నాతండ్రి వచ్చారు! వచ్చారు! నాతండ్రులు. ఏడీ, నారాముడు; ఏడీ నాముద్దులతండ్రి; ఏడీ నానాయన; ఏడీ, ఏడీ, ఏడీ, నాశ్రీరాముడు!

[ముందుకు గబగబ పరుగెత్తును. శ్రీరాముడూ లక్ష్మణుడూ ప్రవేశింతురు. శ్రీరాముడు నల్లగా ఉన్నాడు. నల్లటిజుట్టు వెనకవైపు ముడి వేసుకొన్నాడు. ఒకనారబట్ట విరిచి వెనకకు బిగించి కట్టుకొన్నాడు. ఇంకోనారబట్ట వేటకట్టు కట్టుకొన్నట్లు దేహానికి చుట్టబెట్టుకొన్నాడు. ఎగుబుజములు. రక్తనయనములు. బలమైన నిగనిగలాడే శరీరము. ముఖములో బెంగ ఉన్నది. చేతిలో పెద్దవిల్లు. భుజముకు తగిలించిన అమ్ములపొది. మొలలో కఠారు. లక్ష్మణుడు రామునివలెనే బట్టలు కట్టుకొన్నాడు. పచ్చనిదబ్బపండులాంటి శరీరం. దృఢకాయము. చేతిలో పెద్దవిల్లు. మొలలో కఠారు. భుజమున అమ్ములపొది. వారు వచ్చీ రావడముతోనే హనుమంతుడు శంఖము పూరించును.]

లక్ష్మణుడు

ఇదే మతంగవనము. అల్లదే శబర్యాశ్రమము.

శ్రీరాముడు

ఆవిడే శబరి. శ్రమణి అనే సిద్ధశబరి.

శ బ రి

మానాయనలు, మానాయనలు, వచ్చారా? నన్ను చూడడానికి వచ్చారా? ఈ ముసలిదాన్ని ఉద్ధరించడానికి దయచేశారా!

# ఆకస్మిక ఛాయా చిత్రములు

## (SNAP SHOTS)



౧. విజయనగరము పెద్దబజారున గల ఘటికాస్తంభము

శ్రీ కోరిమిల్లి బసవరాజుగారు తీసిన ఫోటో.



౨. కూరగల బజారు

శ్రీ సి. జి. జగన్నాథదాసుగారు తీసిన ఫోటో



సామ్రాజ్య రాజ్యాంగభవనము, న్యూయార్కు నగరము

ఇది వాయువిమానముపైనుండి తీసిన ఫోటో. ఇందు రాజ్యాంగభవనము చాల చిన్నదిగ నున్నది కాని తక్కిన పెద్దపెద్దకార్యాలయములుగూడ దానికన్న చాల చిన్నవిగా నున్నవి. సామ్రాజ్యమునందలి సుందరసౌధ పంక్తి యీచిత్రమున గన్పట్టును.

G. S. A,

ఇన్నేళ్లు నిరీక్షించిన ఈసవరదాన్ని రక్షించడానికి దయచేశారా? రండి, నాతండ్రులు, రండి. దయచెయ్యండి నాఇష్టదేవుళ్లు, దయచెయ్యండి!

[చేతులు చాచి ఆత్రముగా శబరి గబగబ వచ్చి శ్రీరామునకు సాష్టాంగనమస్కారము చేసి పాదములు గట్టిగా పట్టుకొని ఉండుండీ ముద్దు పెట్టుకొంటూ కన్నీళ్లతో పాదములు తడుపుతూ ఆపాదాలమీదే మూర్ఛిల్లును.]

లక్ష్మణుడు

అన్నయ్యా, పాపం శబరి నీపాదాలమీద మూర్ఛపోయింది. నీచేతులతో స్పృశించి ఆవిడను లేవనెత్తవా?

శ్రీరాముడు

భక్తిపారవశ్యంవల్ల స్మృతి తప్పింది. రవంతసేపట్లో ఆవిడే లేస్తుంది.

[వంగుని ఆవిడదేహాన్ని చేతితో నిమురుతూ] లే, అమ్మా, లే; నీబోటిమహాతపస్వినుల దర్శనము చేసుకోకపోతే నావనవాసము ఇంకా దుఃఖకరముగా ఉండదా?

[శబరిని రెండుచేతులతోనూ లేవనెత్తి ఒళ్లు తడిమి చిరునవ్వుతో!] ఎంతగా కృశించిందో తమ్ముడూ! మనకోసం నిరీక్షించి నిరీక్షించి ఈశబరి!

లక్ష్మణుడు

అన్నయ్యా, ఈవిడ గొప్పభక్తురాలు!

శ్రీరాముడు

శబరి మతంగమహాముని పరిచారిక, శిష్యురాలు! చిరజీవిని; మహాభక్తురాలు.

శబరి

[శబరి లేచి నిలబడి కళ్లు మూసుకుని]

నాతండ్రి ఏడీ, నా రామచంద్రు డేడీ? నానాయన ఏడీ? ఏడీ, ఏడీ నాముద్దులమూట!

[కళ్లు తెరిచి శ్రీరాముని చూచి]

వచ్చావా, నాతండ్రీ, నాకోసం వచ్చావా? నన్ను చూడ్డానికి వచ్చావా? నన్ను రక్షించడానికి వేంచేశావా, నాతండ్రీ, నారామచంద్రమూర్తీ!

శ్రీరాముడు

[శబరిదేహము చేతితో నిమురుతూ]

తల్లీ, శబరీ, దిగులుపడకమ్మా? నీకోసమే మేము వచ్చాము! నిన్ను చూడకపోతే ఇందరు మహర్షులను చూచినఫలమూ వ్యర్థమై పోదా మాకు?

శబరి

నామీద నాతండ్రిగారి కెంతదయ, ఎంతదయ! రారూ, నాతండ్రులు; రండి, అదే బాట. కాళ్లనొప్పులు తీరుతవి ఆ పువ్వులమీదనుంచి నడవండి. రండి, నాతండ్రులారా, రండి, కూర్చోండి, నాయనలారా, ఆపీఠాలమీద, కూర్చోండి. ఎంత శ్రమపడి వచ్చారో! ఈకొండల్లో నడవడంవల్ల కాళ్లెంతనొప్పులు

పట్టావో? నాకళ్లకరువుతీరా చూచుకొం టాను నాతండ్రులను; కూర్చోండి.

[వారు కూర్చుందురు.]

అందుకోండి, నాయనలారా, అందు కోండి అర్ఘ్యము. ఈపాద్యము స్వీకరించండి.

[కాళ్లూ చేతులూ కడిగి తనఉత్తరీయ ముతో తుడుచును.]

రండి, హంసల్లారా, రండి. మానాయ నలకు మీరెక్కలతో నిమ్మళంగా విసరండి.

[హంసలు రెండుపీఠములపక్క నిలబడి రెక్క లాడించుచుండును. శబరి శ్రీరాముని తదేకధ్యానముతో చూచుచుండును.]

నానాయనగారు వచ్చారు; నానాయన గారిని కరువు తీరా చూచుకొంటాను. ఇవిగో, ఇవిగో నాతండ్రిగారిపాదాలు, నానాయనగారి పాదాలు; ఎంత చక్కగా ఉన్నవో! నాతండ్రి ఈపాదాలనే జనకమహారాజు కడిగి మాఅమ్మ సీతమ్మతల్లిని నాతండ్రికి కన్యాదానం చేశాడు. ఓహో ఏమిమహత్తు నాతండ్రిపాదాలకు? నాతండ్రిపాదాల నంటుకొన్న భూరజముకు ఎంతమహత్తు! నాతండ్రిపాదరజము సోకిగానే ఒకరాయి గగుర్పొడిచి, చెమర్చి, కదిలింది! ఏమిఆశ్చర్యం! ఆరాతికి చేతులు. ఆరాయి కన్నీరు కార్చింది. ఆరాతిలో హృదయము తటతట మద్దెల వాయించింది. ఆరాతికి బంగారుచాయ వచ్చింది. సౌకుమార్యము వచ్చింది, సౌందర్యము వచ్చింది, అది లేచి నిలుచుంది. పాదాలపైని వాలింది. పాదా లను కౌగలించుకొంది. ముద్దు పెట్టుకొంది. ఓహో, ఓహో, ఏమి నాతండ్రిపాదముల మహత్తు. రాతిని నాతిని చేసినవి నాతండ్రి దివ్యపాదములు. నేను అహల్యను నన్ను రక్షించవా తండ్రీ అనిఆ రాతినాతి పలికింది. నా తండ్రి చిరునవ్వుతో ఆమెను అనునయించాడు. ఏమి నాయనా, ఎంతదయ, నీకు ఎంతదయ!

ఎంతదయా కాకపోతే ఈపాదములను గుహుడికి ప్రసాదిస్తావా నాతండ్రీ! గుహుడు కడిగినపాదాలు,జనకుడు కడిగినపాదాలు నాకు ప్రసాదించావా, నాతండ్రీ! నాతండ్రికి ఎంత దయ! భరతుడు ఎంతపుణ్యాత్ముడు! నాతండ్రి పాదాలూ, నాతల్లిసీతమ్మ పసుపూ పారాణీ రాచినపాదాలూ నెత్తిమీద పెట్టుకు కలకా లమూ మోస్తున్నాడు. నాతండ్రిపాదము లెంత శక్తిమంతములు! నాతండ్రిపాదాలను భరిం చినపాదుకలకు రాజ్యము లేలగలసామర్థ్యము వచ్చింది. పదమూడుసంవత్సరాలనుంచి రాజ్య మేలుతున్నవి నాతండ్రిపాదుకలు...

శ్రీరాముడు

అమ్మా, శబరీ.

శ బ రి

నాయనా, నాతండ్రీ, పిలుస్తున్నావా? నామీద ఎంతదయ! నా ఆశ్రమానికి దయ చేసినావు!

శ్రీ రా ము డు

నీగురువు లైన మతంగమహర్షులవా రె క్కడ ఉన్నా రిప్పుడు?

శ బ రి

నాతండ్రీ, తాము చిత్రకూటం వచ్చిన పిమ్మట నాగురువులవారు విమాన మెక్కి-స్వర్గము దయచేశారు! నాగురువుగారి అనుగ్రహమువల్లనే అవతారపురుషుల దర్శనం నాకు లభించింది.

అందుకోండి, నాముద్దు తండ్రులారా, అందుకోండి ఈచందనం. కమ్మనిపుప్పొడి కలిపినగంధం, అందుకోండి.

[శబరి ఉత్తరీయములు తీసి వారిదేహమునిండా గంధము పూస్తూ]

ఇవిగో నాతండ్రిచేతులు. భక్తులను రక్షించే దీర్ఘ బాహువులు. ఈచేతులతోనే నాతండ్రి మునిపుంగవులకు అభయ మిస్తాడు. ఇదిగో ఇది దక్షిణబాహువు. దీనిలోనే అమృతమూ హాలాహలమూ ఉందట. ఎంతటి చేతులు! సీతామహాదేవికంఠాన మంగళసూత్రము కట్టిన దివ్యహస్తములూ ఇవి! ఓహో ఏమి నాపుణ్యము! ఈచేతులతోనా నన్ను స్పృశించావు నాదేవా? నాతండ్రీ, భక్తులు ఒకచేత్తో పిలిస్తే వచ్చి రెండుచేతులతోనూ కౌగలించుకొంటూ వట నాతండ్రీ, ఈచేతులతోనేనా? నాకేసి చూస్తున్నావా నాతండ్రీ! ఆహా ఏమి నానాయనగారికన్నులు! సూర్యచంద్రులూ ఇవి! నాయనా, ఏవీ, నీకళ్లు చూచుకోనియ్యి.

ఇదిగో నాతండ్రిదేహము. కోమలదర్భాంకురాలను నిరసించేదేహము. నవమేఘశ్యామలమైనదేహము. ఆకాశమువంటి దేహ మిదా? కౌసల్య పొత్తిళ్లలో పెట్టి పెంచిన దేహమా ఇది! దశరథుని బాహువులలో పెరిగిన దేహమా ఇది!

నాతండ్రీ, నన్ను చూచి చిరునవ్వు నవ్వుతున్నావా? నవ్వులో నక్షత్రపుతళుకులు ఏలాగు ఉన్నవో!

ఓహో, నాతండ్రి నాకు సాక్షాత్కరించాడు. నాతండ్రిని నేను పూజిస్తున్నాను. నాతండ్రీ, నన్ను రక్షించు, నాతో మాట్లాడు. ఇదిగో ఆత్మసమర్పణము చేసుకొంటున్నాను. అహల్యాప్రాణదాతా! ఇదిగో మొక్కు-కొంటున్నాను. జానకీమనోహరా! ఇదిగో నమస్కరిస్తున్నాను. భక్తజనపారిజాతా! ఇదిగో వందనము. నన్ను రక్షించవా, నాతండ్రీ, నారామచంద్రమూర్తీ!

శ్రీ రా ము డు

శబరీ, నావెర్రితల్లీ, ఎంతటి నిర్మలహృదయమమ్మా నీది!

ల క్ష్మ ణు డు

ఎంతటి ఆవేశం అన్నయ్యా, శబరిది! ఎంతభక్తి!

శ్రీ రా ము డు

తల్లీ, శబరీ! నీగురువుగారిసేవ నీ వెంత కాలము చేశావు?

శ బ రి

జ్ఞానము వచ్చినప్పటినుంచీ నాగురువుగారికి పరిచర్య చేస్తున్నాను నాతండ్రీ! నా

గురువుగారు వెళ్లుతూ నాకు నాఇష్ట దేవుని సంగతి చెప్పారు. అప్పటినుంచీ మిమ్మలిని మరవ లేదు నాతండ్రీ!

అయ్యో! నాతండ్రి ఎంత శ్రమపడ్డారో! విసరండి రెక్కలు బాగా హంసల్లారా, విస రండి. నాతండ్రు లెంత శ్రమ తీసుకొన్నారో నాకోసం, న న్నుద్ధరించడానికి! ధరించండి, నాముద్దు దేవుళ్లు, ధరించండి—ఈ పూలదండలు, ఈమందారమాలలు, ఈ కుందమాలలు, ఈ తులసిమాలలు. న న్నుద్ధరించడానికి వచ్చారా! [పూలదండలు వారిమెడల నిండా వేయును.] ఈముసలిదానిమీద ఎంత ప్రేమ నాతండ్రులకు! ఈసవరదాన్ని చూస్తే ఎంతఅభిమానం! శ్రమ తీర్చుకోండి నాదివ్య మూర్తులు, శ్రమ తీర్చుకోండి! రండి, నా చిన్న పక్షులు రండి. శ్రీరాములవారికి పాటలు పాడి శ్రమ తీర్చుదాము రండి.

[నెమిళ్లూ, చిలకలూ, గోరువంకలూ, కోయిలలూ, హంసలూ బారులు తీరి నృత్యము చేస్తూ పాటలు పాడును. ఇద్దరి పక్షుల వెనుకనుంచి వాటితో పాడును. శబరి పీఠములకు ముందు శ్రీరాములవారి పాదములు పట్టుతూ కూర్చుండి పాడును.]

శ బ రి

పక్షు లన్నీ రామ, ఎవరికై పాడేను

పక్షులు, ఇద్దరి

నీకొరకే, నీకొరకే, నీకొరకే!

శ బ రి

పుష్పాలసౌరభం బెవ్వరికి శ్రీరామ

పక్షులు ఇద్దరి

నీకొరకే, నీకొరకే, నీకొరకే

శ బ రి

పండ్లలో మాధుర్య మెవరికొరకో రామ

పక్షులు, ఇద్దరి

నీకొరకే, నీకొరకే, నీకొరకే

శ బ రి

ప్రకృతిసౌందర్యాతిశయ మెవ్వరికి రామ

పక్షులు, ఇద్దరి

నీకొరకే, నీకొరకే, నీకొరకే

శ బ రి

భక్తకోటుల ఆత్మ లెవరి కోయీ రామ

పక్షులు, ఇద్దరి

నీకొరకే, నీకొరకే, నీకొరకే.

శ బ రి

వింటున్నావా నాతండ్రీ, పాటలు? విను, శ్రమ తీర్చుకో! మళ్లీ పాడండి......

పసరుటాకు నిగ్గులోని భావ మేమి రామచిలుక

చిలుకలు, ఇద్దరి, శబరి

రామ కోదండరామ రామ శ్రీరామ రామ

శ బ రి

వన్నెవన్నె పళ్లతీపి భావ మేమి రామచిలుక

చిలుకలు, ఇద్దరి, శబరి

రామ కోదండరామ రామ శ్రీరామ రామ

శ బ రి

సృష్టి కింత కాంతి దేనితోడ వచ్చు రామచిలుక

చిలుకలు, ఇద్దరి, శబరి

రామ కోదండరామ రామ శ్రీరామ రామ

శ బ రి

భక్తకోటి కొంగుబంగార మెవరు రామచిలుక

చిలుకలు, ఇద్దరి, శబరి

రామ కోదండరామ రామ శ్రీరామ రామ.

శ బ రి

రండి, న్నా కోయిలలు, రండి, భయము లేదు. పాడండి.

శ బ రి

పిలవవే కోయిలా గొంతెత్తి రాముణ్ణి

కోకిలలు, ఇద్దరి

కోరామ కోరామ కోయి కోయి

శ బ రి

పాడవే కోయిలా ప్రభువువారల గూర్చి

కోకిలలు, ఇద్దరి

కోరామ కోరామ కోయి కోయి

శ బ రి

లోక మంతా నిండి ఉన్నవా రెవ్వరే

కోకిలలు, ఇద్దరి

కోరామ కోరామ కోయి కోయి

శ బ రి

శ్రీరామకంఠాన్ని వినిపించు కోయిలా

కోకిలలు, ఇద్దరి

కోరామ కోరామ కోయి కోయి

శ బ రి

భక్తకోటులఆత్మ లెవరివే కోయిలా

కోకిలలు, ఇద్దరి

కోరామ కోరామ కోయి కోయి.

శ బ రి

నాతండ్రులాలకిస్తున్నారా!ముసలిదాన్ని, తెలియనిదాన్ని, చదువు లెరుగనిదాన్ని క్షమించండి, స్వాములారా, క్షమించండి. నన్ను కృతార్థురాలను చేయండి.

[లేచి నిలబడి పోకదొన్నెలలో పళ్లు మొదలయినవీ, తామరదొన్నెలలో పాలూ, అరటిఆకుదొప్పలలో మధువూ, తెచ్చి శ్రీ రామలక్ష్మణులముం దుంచి]

ఆరగించరా, నాదివ్యమూర్తులు. ఆరగించండి, ఈఫలములను. ఇవి కీరములు తెచ్చినవి, మధురములు; నేటివి, దోరవి.

శ్రీరామలక్ష్మణులు

ఇలా తే అమ్మా, ఇలా తే.

శ బ రి

అనుభవించండి, సుందరమూర్తులారా, ఈకందమూలములు—మీకొరకై నేను సంతరించాను. అనుభవించండి. కీటకసంపర్కము లేనివి, లేతవి, తియ్యటివి, ఇవిగో ఇప్పపువ్వులు, తేనెలు ఓడుతున్నవి; గ్రహించండి, నాతండ్రులు, గ్రహించండి.

శ్రీరామలక్ష్మణులు

ఇలా తే అమ్మా, ఇలా తే.

శ బ రి

నాతపఃఫలములారా, ఆస్వాదించండి ఈమధువు. మందార మాలతీ పద్మములనుంచి మీమీద పాటలు పాడుతూ తేటులు గ్రహించినవి మీకొరకు. ఆస్వాదించండి, నాయనలారా, నాతండ్రులారా, ఆస్వాదించండి.

శ్రీరామలక్ష్మణులు

ఇలా తే అమ్మా, ఇలా తే.

శ బ రి

దాహము తీర్చుకోండి, మహాస్వాములు, దాహము తీర్చుకోండి. ఇవిగో గోక్షీరములు. లేతపచ్చిక తిని పంపాజలము తాగి పురాణ శ్రవణమందే కాలక్షేపము చేసినకపిలగోవులు మీకొరకై పొదుగులలోనుంచి స్రవియించి నవి. ఈగోక్షీరములు తాగండి, నాతండ్రు లారా! నన్ను ధన్యాత్మురాలిని చేయండి; నాసపర్య లందుకోండి; నన్ను ఉద్ధరించరా, నాతండ్రులు!

శ్రీరామ లక్ష్మణులు

ఇలా తే అమ్మా, ఇలా తే. అనుభ విస్తాము, అనుభవిస్తాము.

[శబరి వారికి అన్నీ అందించి శ్రీరామ మూర్తిపాదములు పట్టుతూ]

శ బ రి

పాడండి ఈసూరు, నాచిన్న పక్షులారా, పాడం డమ్మా! శ్రీరామచంద్రులవారు సంతోషిస్తారు; నాతండ్రులు సంతోషిస్తే నా కు లేని దేమిటి? పాడండమ్మా, పాడండి.

[హనుమంతుడు శంఖము ఊదును.]

నెమిళ్లు, ఇద్దరి

నీలనీరదగాత్ర, నీరజనేత్ర,
శివతనూభవ పద చిహ్నితాంగులము,
వర్షోదయము మాకు భవదాగమంబు;
పర్జన్యగంభీర గర్జన బోలు
కంఠాన్ని విననిమ్ము, కరుణార్ద్రహృదయ;
హృదయాల నర్పించుచున్నాము మీకు;
శబరితో మస్తకాంజలి ఘటిస్తాము,
అభయం బొసంగ వయ్యా, దేవదేవ!

చిలుకలు, ఇద్దరి

మృదుఫలలావణ్య భాసితమూర్తి,
పంచబాణుని దివ్యవాహనంబులము,
నిత్యవసంతంబు నీరాక మాకు;
ఫలరసమాధురీ భాషావిలాస,
నీపలు కాలించని మొక్కెక్కమారు;
నీవాక్కు లనుకరించగ నిమ్ము మమ్ము;
శబరితో మస్తకాంజలి ఘటిస్తాము,
అభయం బొసంగ వయ్యా, దేవదేవ!

కోకిలలు, ఇద్దరి

కిసలయకోమలాంచిత దివ్యదేహ,
శ్రీపతిపుత్రున కాప్తమిత్రులము,
నీరాక మాకు వసంతంబు దేవ;
చూతపల్లవనేత్ర, సుకుమారగాత్ర,
నీరక్తనయనాలు మామావులకును
నిత్యలక్ష్యంబులై నిలువగా నిమ్ము;
చల్లనిమావు ప్రసాదింప వయ్య!
శబరితో మస్తకాంజలి ఘటిస్తాము,
అభయం బొసంగ వయ్యా దేవదేవ!

హంసలు, ఇద్దరి

శరదంబరసమాన సన్నుతమూర్తి,
బ్రహ్మదేవుని పాదపద్మద్వయంబు
మాపక్షయుగళంబుపై నాట్య మాడు.
నీరాక మాకు శరత్కాలశోభ;
స్వర్ణదీపద్మ సంకాశంబు లైన
నీపాదములు దిద్దు మాయానములను;
బిసరుహకాండాల బోలు బాహువులు
మ మ్మెల్లకాలంబు పోషించు దేవ!

శబరితో మస్తకాంజలి ఘటిస్తాము,
అభయం భోసంగ వయ్యా దేవదేవ!

శబరి, ఇర్రి, పక్షులు

రావయ్యా దేవదేవా, స్వాగతంబు
రావయ్యా మామహాస్వామి, స్వాగతము
రావయ్యా లోకైకనాథ, స్వాగతము
రావయ్యా రామచంద్రా, స్వాగతంబు.

శ బ రి

ధన్య నైతిని ధన్య నైతిని
శ్రీరామచంద్రుని
దర్శనంబున ధన్యనైతిని
ధన్యనైతిని ధన్య నైతిని
ధన్యనైతిని రామచంద్రుని
దివ్యపదములు తలను దాలిచి
దివ్యనామము జిహ్వ నిలిపి
ధన్య నైతిని ధన్య నైతిని
శ్రీరామచంద్రుని
దర్శనంబున ధన్య నైతిని.

ఏమి తేజం బేమిసోయగము
నాముద్దులయ్యది
ఎంత చక్కని దివ్యరూపంబు
ఏమి తేజం బేమిసోయగ
మెంత చక్కని దివ్యరూపము
కలవొ లేవో మాటలా ఘన -
ఘనశ్యామలరూప మెన్నగ
ధన్యనైతిని ధన్యనైతిని
శ్రీరామచంద్రుని
దర్శనంబున ధన్య నైతిని.

పావనంబై మారె దేహంబు
నాహృదయంబు
పావనంబై వెలుగు నిత్యంబు
పావనంబును నిత్యసంతో
షావహంబును ముక్తికాంతకు
తావలం బగుశాఘవేంద్రుని
రూపసందర్శనము చేసి
ధన్య నైతిని ధన్య నైతిని
శ్రీరామచంద్రుని
దర్శనంబున ధన్య నైతిని!

ఏలుకొని పాలించవా స్వామీ +
నను గన్నతండ్రీ
ఏలుకొనవా భక్తమందార!
ఏలుకొని పాలించ వయ్యా
ఇనకులాగ్రణి మనవి చేకొని
తావకారుణ చరణరేణువు
నై జరించెద కనికరింపుము,
ధన్య నైతిని ధన్య నైతిని
శ్రీరామచంద్రుని
దర్శనంబున ధన్య నైతిని!

[హనుమంతుడు శంఖము ఊదును.]

ఆలకిస్తున్నారా, అవతారమూర్తులు, మునలిదానిపాటలు; ఆరగిస్తున్నారా, అవతారమూర్తులు, మునలిదానినైవేద్యం, ఎంత దయో! ఎంతవిశాలహృదయమో, నాతండ్రు లది! కరుణాసముద్రులు; భక్తపారిజాతములు; దీనబంధువులు.

శ్రీరాముడు

తమ్ముడూ, చూశావుటోయి, శబరి భక్తి శ్రద్ధలు!

లక్ష్మణుడు

ఇంతటి ఆవేశం, ఇంతటిభక్తీ, ఎక్కడా చూడలేదు అన్నయ్యా! ప్రకృతి నంతా తన వశం చేసుకొని తనహృదయం నీవశం చేసింది.

శ్రీరాముడు

మహాభక్తుల లక్షణమే అది.—శబరీ, ఈఫలములు నీస్నేహితులకూ పక్షులకూ పంచి పెట్టమ్మా!

శ బ రి

నే చెప్పలేదూ, ప్రేమస్వరూపుడు, నా తండ్రనీ; రా, హనుమా, రా; ఇర్రీ, రా; రండి, పక్షుల్లారా, రండి. శ్రీరామచంద్రుడి పాదాలకు మొక్కుకోండి.

[వా రందరూ సాష్టాంగ పడుదురు.]

కళ్లకు అద్దుకు తినండి ఆమహాస్వామి ప్రసాదము. ఇందండి.

[శబరీ, వా రందరూ ఫలములను తిందురు. నాశరీరం పవిత్ర మైనది శ్రీరామచంద్రుని చూచుటవల్లా, పాదము లొత్తుటవల్లా, ప్రసాదం అనుభవించడంవల్లా! ఇంతకీ నా మహాస్వాములదయ! స్వామివారికి నమస్కారము చెయ్యండి. నాతండ్రిగారి పాదపద్మాలు ఎప్పుడూ మరవరుగదా! మరవకండమ్మా, మరవకండి. ఇంకోమారు నాతండ్రిపాదాలు కౌగలించుకొని వెళ్లండి.

[మళ్లీ సాష్టాంగపడుదురు. పక్షులు వెళ్లి దూరముగా శ్రీరాముని చూస్తూ నిలుచుందురు. హనుమంతుడు పారిజాత తరుమూలము చేరును. ఇర్రి అతనిసమీపమున నిలబడి శ్రీరామలక్ష్మణులను చూచుచుండును.]

నామనోరథము నెరవేరింది; నా తండ్రులను మిమ్ము, చల్లనిమూర్తులను తనివి తీరగా చూస్తున్నాను.

శ్రీరాముడు

అమ్మా, శబరీ, ఈవనములో నీకు తపస్సు సరిగా జరుగుతూ ఉందా, మృగభయమూ రాక్షసభయమూ లేకుండా?

శ బ రి

మీఅనుగ్రహంవల్ల తండ్రీ, జరుగుతూ ఉంది. నాగురువులవారిదయ, మీఅనుగ్రహం నాకు ఉంటే నాకు లేని దేమిటి? నానిధానమూ, నాతండ్రీ, శ్రీరామనామస్మరణమే నాతపస్సు నాయనా; నేడు నాతపస్సు ఫలించింది, నాతండ్రులకు నామీద కటాక్షం ఉంది కాబట్టి.

శ్రీరాముడు

అమ్మా, శబరీ, ఈప్రాంతములందు రాక్షసుల వల్ల మునులతపస్సుల కంతరాయము లేమీ కలుగడం లేదు గదా?

శ బ రి

అవతారపురుషులు నాతండ్రి! అవతారకార్యం చక్కబెట్టుతున్నారు. నాబోటి దీనురాండ్రను రక్షిస్తున్నారు. ఏమీ లేవు నా తండ్రీ. రాక్షసభయము లేదు.

శ్రీరాముడు

మీగురువు లైనమతంగమునుల పూజ చేస్తున్నావా?

శ బ రి

చేస్తున్నా, నాయనా; చెయ్యను మరీ. నాగురువులేగా నాఇష్టదైవతము నాకు ప్రత్యక్ష మయ్యేఉపాయం చెప్పారు. నిత్యమూ గురుపూజ చేస్తున్నాను తండ్రీ!

నాగురువులు ఇక్కడ యాగము చేశారు. చూపిస్తాను వస్తారా నాయనలారా, శ్రమ లేదుకదా? నాగురువులమహత్తు చూపిస్తాను రండి, నాతండ్రులు.

[శ్రీరాముడూ, లక్ష్మణుడూ, శబరీ కుటీరమువైపు వెళ్లుదురు.]

ఇవిగో నాయనా, యాగవేదులు. వీటికి గొప్పమహత్తు ఉంది. తమకు తెలియని దేమిటి నాయనా! ఏదో ముసలిదానిమాటలు, కోపగించుకోకండి నాయనా!

శ్రీరాముడు

దూరముగా ఆ నీ రేమి టమ్మా?

శ బ రి

అవి సప్తసాగరములు నాయనా, నాగురువుగారి స్నానార్థమై వచ్చినవి. ఆయన సంకల్పమాత్రంచేత వచ్చినవి తండ్రీ.

శ్రీరాముడు

ఈకావిబట్టలు శబరీ?

శ బ రి

ఈతడికావిబట్టలు పూజ్యులైననాగురువుగారివే మహాస్వామీ, ఇవిగో పూలదండలు, ఏరీతిగా వాడకుండా ఉన్నవో చూశారా నాయనా? వారిబట్టలకు తడి ఆర లేదు. వారి పూవులు వాడలేదు.

లక్ష్మణుడు

ఇన్ని సంవత్సరములైనప్పటికీ?

శ బ రి

అవును, నాయనా, నాగురువులవారి తపఃప్రభావ మటువంటిది, చిట్టితండ్రీ!

శ్రీరాముడు

అంతటిగురువు కాబట్టే ఇంతటి భక్తురాలు అయింది ఈవిడ.

శ బ రి

నే నెంతపుణ్యము చేసుకోబట్టి మీదర్శనలాభం నాకు కలిగింది మహాస్వామీ. మీరు రాబట్టి నాఆశ్రమము స్వర్గతుల్యమైనది. మీ పాదధూళిచేత నాఆశ్రమమూ, నేనూ, నాఆశ్రితులూ అందరమూ పవిత్ర మయ్యాము దేవా! మామహాస్వాములను దర్శించుకోబట్టి నాజన్మము ధన్యమైనది తండ్రీ! నాపుణ్యము పండినది, నాతపస్సు ఫలించింది, నాదేవా! మీ పాదయుగళముపై భక్తి చెయ్యలేని దేమిటి నాతండ్రీ? నా కంతకంటె కావలసిన దేమిటి నాస్వామీ!

శ్రీరాముడు

అమ్మా శబరీ; నీసత్కారము మాకు నచ్చినది. నీసపర్యలు మే మందుకొన్నాము. నీభక్తి గట్టులేని సముద్రం. దానిలో మమ్ము ముంచెత్తినావు!

శ బ రి

బహిరింద్రియాలకు సంతోషం కలిగించడానికి ప్రయత్నించాను, స్వామీ, హృదయానికి సంతోషం కలిగించడం నాకు వశ మౌతుందా రామా!

శ్రీరాముడు

బహిరింద్రియములద్వారా హృదయము తృప్తి చెందింది, శబరీ!

శ బ రి

ఇంక నాకు కావలసిం దేమిటి ? నాస్వాములు సంతోషించారు! నాస్వాములు సంతోషించారు! నేను ధన్యను, ఇంతికీ శ్రీరామచంద్రులకు నామీద అమితవాత్సల్యం!

శ్రీరాముడు

అమ్మా శబరీ, నీఆశ్రమంలో పక్షులూ, జంతువులూ కాలవిరోధం లేకుండా నీకు తోడ్పడినవి. పక్షులు తమస్వభావాలను కూడా మార్చుకొన్నవి. జంతువులు తమవైరములు మానినవి. ఎంతటి తపశ్శాలిని వమ్మా నీవు!

శ బ రి

అంతా మీనామప్రభావమే, నాతండ్రీ, అంతా మీదర్శనప్రభావమే శ్రీరామచంద్రమూర్తీ! నాగురువులవారిదయ, మీకటాక్షంనా కుండగా నాకు లో టేమిటి కన్నతండ్రీ! నాలో మంచి ఏమైనా ఉంటే దానికి కారణం నాగురువుగారే శ్రీరామా!

శ్రీరాముడు

గురుభక్తి కలవారికి లో టేమి టమ్మా!

శ బ రి

శ్రీరామచంద్రా! మీయెడల ఒక్క అపచారం చేశాను. నన్ను మన్నించాలి. తెలియనిదాన్ని, మీరు కష్టసమయములో ఉండగా ఈఉత్సవము మీకు నచ్చునో నచ్చదో అని ఆలోచించకుండా.........

శ్రీరాముడు

నీభక్తిపారము తెలియ జేస్తున్న దీఉత్సవము శబరీ!

శ బ రి

నాయనా, ఆదుర్మార్గుడిచేతు లెట్లా ఆడాయో నాతల్లిని తీసుకొని పోవడానికి! నాచిట్టితల్లిని ఏమికష్టాలపాలు చేస్తున్నారో ఆదుష్టరాక్షసులు! [ఏడ్చును.] నాతల్లి ఎక్కడుందో తెలిసిందా నాయనా!

లక్ష్మణుడు

ఇంకా తెలియలే దమ్మా!

శ బ రి

నాతల్లి ఏమికష్టాలపా లవుతోందో! నాతండ్రి కింతకష్టము తటస్థించనా! నాయనా, చూశావూ. అదుగో ఋశ్యమూకపర్వతము. వాలి తరిమితే సుగ్రీవుడు ఆకొండమీద ఉన్నాడు. నాయనా, అతనిస్నేహము చెయ్యండి. మీకు తప్పకుండా కార్యసిద్ధి అవుతుంది. అబ్బాయీ, హనుమా, ఇలా రా, శ్రీరాములవారికి మొక్కుకో. [హనుమంతుడువచ్చి శ్రీరామునకు మొక్కును.]నాయనా, శ్రీరామచంద్రా, ఇతడు హనుమంతుడు, సుగ్రీవుడు నమ్మినబంటు, బుద్ధిమంతుడు, ఇతడు మిమ్ము సుగ్రీవుని దగ్గిరికి తీసుకు పోతాడు.

శ్రీరాముడు

[కన్నీళ్లు తుడుచుకొని] ఎంతమంచి దాన వమ్మా, శబరీ, నీవు!

శబరి

ఇర్రీ, రావే, శ్రీరామచంద్రులకు మొక్కుకోవే. [ఇర్రి అట్లు చేయును.] తెలియని పిల్ల నాయనా, దీవించండి. [శ్రీరాముడు చేతులు తలపై చాపి దీవించును.] వెళ్లు, ఇర్రీ, వెళ్లు. హనుమా, అక్కడుండు నాయనా, అక్కడ ఇర్రిదగ్గిర నిలబడు, శ్రీరామలక్ష్మణులను సుగ్రీవుడి దగ్గిరికి తీసుకు వెళ్లుదువు గాని. ఇర్రీ, హనుమా, శ్రీరామనామం మరచిపోకండమ్మా! నే వెడుతున్నాను. నేను వెడుతున్నా. [ఇర్రికేసి చూచి] అయ్యో, వెర్రితల్లీ, దిగులుపడి ఏడవ కమ్మా. నానాయనగారిని మరిచిపోకుండా ఉంటే నీకు ఏమీ లోటు ఉండదు. ఇంకోమారు వచ్చి మొక్కుకో. [ఇర్రి అట్లు చేయును.]
నే వెడుతున్నా నమ్మా, నే వెడుతున్నా.

[శబరి, శ్రీరామలక్ష్మణులూ కుటీరములకు దూరముగా ఉత్తరపువైపునకు పోవుదురు.]

ఇర్రి

చూడు, హనుమా చూడు; ఎక్కడికి తీసుకువెళ్లుతోంది శ్రీరామలక్ష్మణులను?

హనుమంతుడు

శబరి తన దేహాన్ని వదిలిపెట్టుతోంది. ఇర్రీ, చూడు, చూడు!

ఇర్రి

శ్రీరామచంద్రులను కౌగలించుకొంది. ఆయన పాదములు శిరస్సుమీద పెట్టుకొంది. ఆయనచేతులు పట్టుకొని తీసుకు వెడుతోంది. అదుగో, అక్కడ ఆగారు! శ్రీరాములవారికి ప్రదక్షిణం చేస్తూ ఉంది శబరి!

హనుమంతుడు

అదిగో, అదే చితి. చితి సమీపించారు. శ్రీరాములవారిచేయి వదల కుండానే చితిపై కెక్కింది.

ఇర్రి

శ్రీరామమూర్తిపాదములవైపే చూపు!

హనుమంతుడు

మంటలు వస్తున్నవి. చితి కాలిపోతోంది!

ఇర్రి

ఏమిటి ఆపెద్దమంట? ఆఁ, అది మంట కాన ట్లున్నది.

హనుమంతుడు

మంట కాదు. ఆచితిలోనుంచి దివ్యస్త్రీ, అరుణ శరీర, కిరీటధారిణి, దివ్యమాల్యాంచిత, దివ్యాభరణభూషిత, పైకి లేస్తోంది, లేస్తోంది. [హనుమంతుడు శంఖ మూదును.]

ఇర్రి

శ్రీరామచంద్రుని కాదివ్యస్త్రీ మొక్కుకొంటోంది.

హనుమంతుడు

అంతరిక్షాని కెగసిపోతోం దామె!

ఇంద్రి

అదుగో, అదుగో, విమానం!

హనుమంతుడు

ఏమిపుణ్యశాలిని! ఆవిమానంలో మతం గమహర్షి ఉన్నాడు. చూడు, చూడు, ఆ మధ్య ఆతళుకు !

ఇంద్రి

మతంగుడు దివ్యస్త్రీని చేతితో పై కెత్తి తనపక్క కూర్చో బెట్టుకొన్నాడు. పైకి వెళ్లిపోతోంది విమానం!

హనుమంతుడు

అదృశ్య మైనది!— ఇంద్రీ, నే వెళతా, శ్రీరామలక్ష్మణులను ఋశ్యమూకానికి తీసుకువెళ్లాలి.

ఇంద్రి

వెళ్లు; నాతండ్రులను జాగ్రత్తగా తీసుకు వెళ్లు. నేనూ నెమ్మదిగా వారివెనకే వస్తానులే; చాతక మునికిదంతా చెప్పాలి. [హనుమంతుడు వెళ్లును; ఇంద్రి కొంచెము తూర్పుగా నడవగా చాతకముని కానవచ్చును.]

విన్నావా, చాతకా!

చాతకముని

చూశా నమ్మా; ఈచిత్ర మంతా ఇక్కడ నిలబడి చూశాను. ఏ దమ్మా శబరిఆశ్రమము? నాకళ్లు చీకట్లు కమ్మినవా ఏమిటి?

ఇంద్రి

[వెనుకకు తిరిగి చూచి]

చిత్రం! ఏది ఆశ్రమం! ఇంతట్లో మాయమైన దేమిటి! అంతా అడవి కమ్ముకొంది. సాగరాలు మాయ మయినవి !

చాతకముని

అ దేమి టమ్మా ఆకొత్తకొండ ?

ఇంద్రి

చిత్రం, చిత్రం! అది శ్రీరాములు కూర్చున్న ఉన్నతాసనం; శ్రీరామగిరి అయింది!

చాతకముని

అ దేమి టాశబ్దం?

ఇంద్రి

చూడు, చూడు, పంపాసరస్సుగట్టు తెగింది! నీరు ప్రవహిస్తోంది! వెడుతోంది, ఫైడుతోంది! ఓహో ఏమి చిత్రం, ఏమిచిత్రం! శ్రీరామగిరిపాదము నంటి పారుతోంది.

చాతకముని

అదే, శబరి, ఇంద్రీ; ఆప్రవాహమే శబరి; సందేహం లేదు.

ఇంద్రి

విన్నావా, చాతకా, శ్రీరాములవారు శబరికి వరం ఇచ్చిన ట్లున్నది.

చాతకుడు

ఏ మని?

ఇంద్రి

ఆమె నిత్యమూ స్నానము చేస్తూఉండే పంపాసరస్సు ప్రవాహముగా మారగల దనీ, దానికి శబరి అనే పేరు వస్తుం దనీ, అది శ్రీరామగిరిపాదముల నాశ్రయించి ఉంటుందనిన్నీ.

చాతకుడు

ఆమె చిరజీవిని గదా! ఆమె కందువల్లనే భూలోకమందూ స్వర్గలోకమందూ కూడా శాశ్వతత్వము సిద్ధించింది.

ఇర్రి

ఇంకా విను చాతకా; శబరి మహాపవిత్రమైన ప్రవాహమై పవిత్రమైన గోదావరితో కలిసి ఉంటుం దెప్పుడూను. శబరిమాహాత్మ్యమువల్లనే గోదావరిపవిత్రత ద్విగుణీకృత మైనది. గోదావరీజలము సీతారాముల దేహములను కడిగి పవిత్ర మైనదిగదా, వారు పర్ణశాలలలో ఉన్నప్పుడు! శ్రీరామ పదధ్యానము చేతనూ, తత్పాదములను సమ్మార్జనము చేయుట వల్లనూ శబరి పవిత్ర మైనది.

చాతకుడు

పాపఘ్న మైన శబరీగోదావరుల జలము మనుష్యులను తరింపజేస్తుం దన్న మాట! చూడు, తూర్పుగా చూడు, ఇర్రీ!

ఇర్రి

ఔరా! హనుమంతుడు శ్రీరామలక్ష్మణులను వీపుమీద పెట్టుకు తీసుకు వెళ్లుతున్నాడు.

చాతకముని

ఋశ్యమూకానికా?

ఇర్రి

అవును.

చాతకముని

ఇ దంతా చూస్తే సగుణబ్రహ్మోపాసన కూడా మోక్షసాధన మనిపిస్తోంది.

ఇర్రి

నీ దంతా ఒకగొడవ చాతకమునీ! ఇ దంతా చూస్తే శ్రీరామభక్తికి సాధ్యము కాని దేదీ ఈలోకములో లే దనిపిస్తోంది. అప్పు డెప్పుడో పాట కావా లన్నావు. చాతకా ఇప్పుడు నాతో కలిసి పాడూ!

చాతకముని

అలాగే, ఇర్రీ!

చాతకముని, ఇర్రి

సాదరం శబరీదత్త ఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్.
స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.

[తెర.]

# వసంతము

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

ఏమనోరథసిద్ధియో యిది తలంపఁ - బుడమి నొక సముద్రపు పోటు వోలె పొడిచె;
పూలఁజివురుల నిలువెల్లఁ బులకరించి - పగులఁబడి నవ్వుచున్న దీ ప్రకృతికాంత!
రావలెను నాదు ప్రాణంబు ప్రాణ మిపుడు,-ననుఁ గటాక్షింప స్వర్భవనంబు విడిచి,
పోవలెను నేను నాప్రేమమూర్తిఁ గలియ - నీ ప్రపంచపు పొలిమేర లెల్ల దాఁటి.

కలిసికొని యొక్క-రొకరిలోఁ గరఁగిపోయి - యనుభవింతు మనిర్వాచ్యమైన ప్రేమ;
దైవమునకైన నచట పెత్తనము లేదు, - దేశకాలంబులును విడఁదీయ లేవు.

* * * * * * * *

ఈమహానంద సంరంభ మే భరింపఁ - జాల దుర్బలంబైన నా స్వాంతమందు,
ప్రాణమా, నీవు నాదండ రాకయున్న - మృదుసహోదరి మరణలక్ష్మియె మెఱుంగు-
నీకును నాకుఁ గల్గురమణీయ శుభప్రణయైకబంధనం
బై కళలూరు నీప్రకృతి యంతయుఁ బూవులతోఁ జివుళ్లతో
నోకమలాక్షి! యీశుభముహూర్తము తానయి వచ్చె మించెనే
నీకుసుమాసవద్రవము లింకునొ, లేఁ జివురుల్ నశించునో!

కలవు నీకును నా కనేకములు కాల - దేశవినిబద్ధములు, రసోద్దీపితములు,
నిత్యనూతనములు రమణీయములయి, - వనజలోచన! సంబంధ బాంధవములు.

అలరులు, తేనియల్, చివురు, లాపయిఁ గోకిలకాకలీస్వనం
బులు, నునుగాలివీవనలు, పుప్పొడి తిన్నెలు చూడఁ జూడ ని
స్తులగతిఁ బొల్చు నీప్రకృతి శోభ లివన్నియు నీవు రామి, ని
ష్ఫల మనిపించెదేని తెలివా! తెరు వేది ప్రపంచకంబునన్.

రంగులు పూసి యున్న బహిరంగపు సృష్టి నతిక్రమించి, యే
రంగును లేని యాహృదయాంతరంగ గభీరతలోఁ గరంగి, ర
స్వాంగి, వినీలకోమలఘనాంత తటిల్లతవోని, నీగృహ
ప్రాంగణ సీమ నిల్చితిని ప్రాంజలినై ప్రణయామృతార్థినై.

తలిరులకమ్మఁదేనియలు ద్రావి, నిగారపుపూరజంబు మై
నలఁది మమేకమైన (?) ప్రణయంబున నొండొరుఁ గౌఁగిలించి, ని
ర్మలమృదు దక్షిణానిల తరంగము లూయెల లూఁపఁ బూలతె
ప్పలపయిఁ దేలిపోదము, ప్రపంచము ముంచిన మోదవార్ధిలోన్,

———

# కుటుంబతరంగిణి

కవికొండల వేంకటరావు గారు, బి. ఏ., బి. యల్.

౭

## సార్థక సౌదామని

"సౌదామని" నిజంగా మెఱుపుచేగ గల ఎలనాగ.

ఆపేరామె కుంచడంలోకూడా కొంచెం చరిత్ర లేకపోలేదు. పగలు జీమూతంగా మబ్బుపట్టి చీకటులు కమ్మేసేసి దీపాలుకూడా పెట్టించిన యొకా నొక ముసుర్రోజున పుట్టిందట. అందుచేత మెఱుపుఅనే అర్థం వచ్చే "సౌదామని" అనే సంస్కృతపుపద మామెకు నామకరణం చేసివారట. ప్రస్తుతాంశాని కాచరిత్ర అంతా యెందుకూ మన కుపకరించదు. కాని, యొకా నొక వ్యక్తి యేపుగా యెదిగిన తరువాత చూపించే అందం చందం, కార్యదక్షత, ధైర్యసాహసం, వివేకం విజ్ఞానం, మనకళ్లు కట్టిన ట్టెదూరకుండా ఉంటూంటే, ఆవ్యక్తి కైన జీవితపు పునాదియొక్క కట్టుదిట్ట మెట్టిదా అని విచింతన చేసే కుతూహలంకొద్దీ వ్రాయక తప్పదనుకుంటూ, కూస్తో కాస్తో పుట్టుకనుగుఱించి, పెట్టిన పేరునుగుఱించి, పట్టిన పుస్తకాన్నిగుఱించి, ఆడదైతే కట్టినచీరను గుఱించి, మగాడైతే చుట్టిన తలపాగాను గుఱించి:— — — —

"సౌదామని" ఉండే ఆమె దీపావళిపండక్కి పుట్టింటికి భర్తతోసహా వచ్చింది. పండగ వెళ్లిన మర్నాటిసాయంకాల మోసారి ఆయూరివారి నందఱ్నీ తా నెఱిగున్న చిన్ననాటి చెలుల నందఱ్నీ ఒక్కసారి తాను మంచిచీర మంచిరైక తొడుక్కొని ఎక్కగుమ్మం దిగేగుమ్మంగా సందర్శించింది. అప్పుడే తిరిగి అమ్మగారి గుమ్మం మెట్టి లోపలి కడుగువేసింది. తల్లి లోపలి నుంచి ఎదురొచ్చి "ఈతెల్లాఱగట్లనే లేవే! మీ ప్రయాణం, మీరు మీయూరు వెళ్లిపోవడం! నాకేం బాగులేదీ అల్లుని వరస" అని అంది. సౌదామని "ఏరి?" అంది. తల్లి "ఇప్పుడే వస్తానత్తా! అని అలా పురమందిరంకేసో, నదీ తీరం కేసో, వెళ్లియుండాలి" అంది.

తల్లి పెఱటిలోనికి వెళ్లి పెఱటిలో కొత్తగా లేచిన అరటిపిలకల నోరెండు మోవాకులు అల్లుని కొకటి ఆయన కొకటీ అని అనుకొంటూ కోస్తూవుంది. పిల్ల 'సౌదామని' తన రయిక నూడ్చి గదిలో కూర్చానికి తగిలించి, త్రిప్పటచే పట్టిన వీపుమీది చెమ్మట వట్టి, చీరచెఱగు, పైనున్న చెఱగు పైనున్న పాళంగా గుప్పిట పింజె పోసికొంటూ కొసలు కుడిచేత నూచిపట్టి ఎడంచేత నెడమబుజాన్ని ఉన్న చీరభాగ ముడిసిపట్టి, ఒక్కరాయిడి దుడిచివేసికుని మెడపై నాచెఱగును మగవాడు మెడమీద కండువ వైచుకొనువ ట్లుంచుకొని తన లేకపెట్టె ముందు కూరుచుండి, ఆవీ అవీ దీపావళినాడు కాల్చివేయకుండా మిగుల్చుకున్న మతాబుపెట్టెలు, తిని వేయకుండా దాచుకున్న తీపిసరుకులు, మాయకుండా ధరించుకున్న పవిటెపరికిణీ పట్టుకబ్బా, ఒక సేవిటి, తాను వచ్చేటప్పుడు తెచ్చుకున్నవి, వచ్చినతరువాత తనకు తలిదండ్రు లిచ్చినవి అన్నీ సవరించుకుంటూ వుంది క్రమశః బాసెంపట్టుగా ఒకింత ముందుకు ఒరిగి.—

ఆగదికి రెండేగుమ్మాలు, ఒకటే కిటికీ: ఒక గుమ్మం నడవలో కుంది: ఒకగుమ్మం పెఱటిలో కుంది. కిటికీ, పెఱటిగుమ్మంప్రక్కనే, అరటిచెట్లకు తిన్నగా వుంది. అన్ని తలుపులూ బార్లెట్టున్నాయి.

సౌదామని భర్త తన చడావులు నడవలో వదలి సౌదామని సర్దుకుంటూవున్న గదిలోనికి వచ్చి, సౌదామని పెట్టె సవరించుకోవడం చూస్తూ తన కండువాను లాల్చీని కూర్చాన్ని వేసి కూర్చాన్నివున్న తువాలు తీసికుంటూ "భేష్! అలా తయారవాలి! ఎప్పుడు ప్రయాణం అంటేఅప్పుడు లేడిల్లే లేవడానికి—సర్దేశావా పెట్టెనిండా అన్నీ? కాసంత ఖాళీ ఉంచేవా? ఇదిగో! రూకల చిక్కం: అందులో పడెయ్యి." అని తనలాల్చీ జేబులో నుంచి తీసి భార్యఒడిలో పడేటట్లు గిరాటేసినాడు.

ఆగిరాటు కుల్కిపడి "అంత యిదా? ఆలా గిరాటేసు
కుంటారా? దీని కొక్క దానికే ఉంది చోటు: మరే
మీ నామీద పడేయ్యకండి. తక్కినవి మీసీమతోలు
పెట్టెలో పెట్టుకోండి" అని ఆచిక్కం తన రేకుపెట్టెలో
ఒక జరీచీరమడతలో పొదుపుగా ఉంచి పెట్టె మూసి
మూత నొక్కుతూవుంది.

సౌదామినితల్లి తన అల్లుడు గదిలోకి రావడం
కిటికీలోనుండి అరటిఆకులు కోస్తూ, వెనుదృష్టిని చూచి,
కోసిన ఆకులు చేవరోడుతూ ఎడంచేత నుండగా,
మానేచాకు మాయనిపడివాయి కగ్గనలకగ్గనలగా కన
బడుతూండగా, ఆగదియొక్క పెరటిసుమ్మముదగ్గర
కొచ్చి, "అమ్మాయీ! నీకు వంట్లో తిప్పుగా వుందన్నా
వుగదా! ఎల్లా నుండే? పోనీ తెల్లాఅగట్ల ప్రయాణం
మానేసి నాగులచవితి వెళ్లాకో కార్తీకపున్నమి వెళ్లాకో
వెనకనుండి మీతండ్రిగారు తీసికొనివస్తా రని చెప్పు—
కనుక్కో ఏమాటా—" అని ముభావంగా అడిగింది
ముఖాముఖి అల్లునితో మాట్లాడలేక.

అల్లున కామభావం, మొగమాటం లేదు. వెంటనే
"ఏమండో అత్తా! నాతోటా దాంతోటా మీ రం
టూన్నది? ఒళ్లు తిప్పుతూందా దానికి?" అని యథేచ్ఛ
నాసౌదామనియొక్క వెనుపట్టిసే వంగి ఆమె రెండుకళ్ల
ల్లోనుంచి తన రెండుచేతులను తన మోచేతివరఘులు
పర్యంతం పోనిచ్చి నేలనుండి ఆమెను లేపనెత్తి తా
తిరుగుతు తనతో నామెనుగూడ గిర్రున త్రిప్పి యథా
ప్రకారంగా పెట్టెముందు కూరుచుండబెట్టి "చూడండి!
ఇంత తిప్పినా మీఅమ్మాయికళ్లు తిరగలే. మళ్లీ సరిగా
తాళం వేసేస్తూంది." అన్నాడు.

ఆశ్చర్యపోయింది అత్తగారు. ఆమె అక్కడ
నిలబడలే:—సిగ్గుచే కొంత: అవతలకు పోయి పూర్తిగా
నవ్వుకొని ఆనందిద్దామని యో కొంత.—

సౌదామని లేచి తన పచ్చని, కమ్మచ్చు తీసిన
తీగల్లాంటి, బుజాలమీదికి రవంత చెంగు దించుకుని
మగనిదిక్కు కళ్లల్లో క్రమ్ముకొచ్చే సిగ్గును, చిరు
నవ్వును, కనురెప్పలచాటే ప్రక్క తెరల్లోని కలకలం
మాత్రంగా సూచించి, నాతెరల నస్పష్టమధురంగా అంది
"నయం! మీచేతులమీద తిప్పడంతో సరిపెట్టారే? సుడి
గుండంలో పడేసి పరీక్షించినారు కారు?" అని. "ఈమా
త్రానికే ఇంత మెలికపోతున్నాయి నీకళ్లు. సుడిగుండం
లో అయితే చెప్పే దేముంది? నాలుగు చేపల్తో కలిసి
పోయి నాచేత వలేయించి యుండేని" అని అత
డన్నాడు.

పై వేడుకా వేడుకపై వ్యాఖ్యానాలూ ముగింపునకు
వచ్చేయి. ఇంతలో సౌదామని తండ్రి తన రాచకార్యా
లన్నీ చక్కపెట్టుకుని యింటికే రేయేడు గంటలకో రే
యెనిమిదిగంటలకో వచ్చినాడు. ప్రయాణం తప్పదని
పెంకపెట్టుగా పడితే అల్లునీ కూతునీ "ఆలాగే వెళ్ల
వచ్చును" అని "భోజనాలు అవీ చేసి తాంబూలాలు వేసి
కొని ఒక్కడునుకు పోండి" అని సలహాయిచ్చినాడు. ఆ
సలహా ననుసరించి కొమారిత జామాత తెల్లవాఅగట్ల
లేచి పెసరంగా "బండి తెప్పించారా?" అన్నారు.
బండి వచ్చింది. తెల్లాఅగట్ల రై లెక్కించి తన తనయను
అల్లుని సాగనంపి తిరిగి యింటికి వచ్చినాడు, ముదురు
గోస్తుడు.

ఇంకా రెండుఘళ్ల రాత్రి వుంది. పెద్ద దంపతు
లిద్దఱూ అనగా సౌదామని తల్లిదండ్రులు తప్ప మరె
వరూ ఇంట లేరు. దాసీ దొచ్చి "అమ్మగారూ!" అని
పాచిపనికై కేకేసేవఱకు వారిద్దఱూ ఏదోయొకటి అల్లుని
గుఱించి పిల్లదాన్ని గుఱించి చెప్పుకుంటూ చిన్న
బోయిం దిల్లనుకునే వారు, దీపం వెలవెలనే
గదిలో పక్క చెదరిన మంచం చూచి, గోడను మేకు
తొలగిన కూర్పం చూచి, శీలను పెట్టె లెత్తిగా దుమ్ము
దాగిన స్థలం చూచి—

ఆసంభాషణలో ఒక్కభాగం చెప్పి యొప్పిస్తే
ముక్కాలిముదుసళ్లు మఱేమూడు కాలాలపా టింకా
యీకథను తిత్తూత్తూ ప్రజ్వలింపజేస్తా రనుకుంటా.

సౌ. తల్లి—ఏమండోయి! మనల్లుడికి ఏమీ
సిగ్గు లేదు. ఏమీ యొడమఱుపు లేదు. నేను చూస్తాం
టేనే అమ్మాయిని జబ్బ లుచ్చుకు నానాలప్ప తిప్పినట్టు

గ్రథన తిప్పి మూలో పెట్టేశాడు. దానికి ఏమీ సిగ్గ లేదండీ! నవ్వుతూ తిరిగింది. నవ్వుతూ చతికిలబడింది.

సౌ. తండ్రి—నాదగ్గఱ చెయ్యడేమే అలాంటి పనులు, చూడా మనుకుంటూ? కాని చెయ్యడు. వలాగన్నా తండ్రికన్న తల్లి అప్రమత్తురాలు ఆడపిల్లల పట్ల..........................................

..........................................

అయిదారు నెలలు గడచిపోయినాయి,

......ప్రకృతియొక్క యౌవ్వనప్రాయమా అన్నట్లు వసంతకాలం వచ్చింది. ఎటు చూచినా మామిడిపళ్ల ప్రభే, ఎటు వాసినా కామడికుంబటింటి టంకృతే. ప్రకృతిని పరువుప్రతిష్ఠలు నిలబెట్టేది స్త్రీయే అన్నట్లు ఇంటింట నున్న వాళ్లంటే వళ్లెంలో కోసిన బంగినపల్లెకాయ ముక్కలో, కడిగిన దేశవాళీ పీలుపుడో పెట్టి భర్త ముందు నించుని సోగ్గా వాడిగా ఓరగా చూచి ఎలా వుంది రుచి అని అడగడమే. లోకాని కంతకూ ఎదో శుభవర్తమానం ఎక్కడనుంచో తెచ్చినట్లు, పైరుగాలి యూలతోట్లంటే యీ లేసుకుంటూ సముద్రంమీదనుంచి తేలి యేయేజవరాలిముం.పరులూ అల్లల్లాడించడమే.

కాని ఆఅయిదారునెలలనుంచి సౌదామినినుండి గాని సౌదామనిభర్తనుంచి గాని యొక్క యుత్తర మన్నా సౌదామనితల్లి ంద్రులకు రాకపోవడంచేతనూ, "వేసంగి సెలవు లిచ్చినారు. వస్తున్నాము" అని అల్లుడు ప్రతివేసంగీ వ్రాస్తూవచ్చిన ట్లీసంగతీ ఆవేసంగికి వ్రాయక పోవడంచేతను సౌదామనితల్లికి సౌదామనితండ్రికి మాత్రం పైని వివరించిన వసంతఋతువుయొక్క విశ్వ సందేశ మేమీ చెవివద్రుకునపుడి అందుకైనా తగులలేదు.

ఓపొద్దు, తెల్లవాఅగట్లే గాని, మఱి తెల్లవాతిసే వల్లకాదని ప్రయాణమై వెళ్లిపోయిన అల్లునికి కూతురికి ఉత్తరం తానై ముందుగా వ్రాస్తాడా మామగారు? వ్రాయడు. వ్రాయనేరడు. క్రోధం కోపం ఉండక పోయినా "మనం చెప్పినమాట అతడు విననప్పుడు ఎక్కడుంటేం కులాసాగా ఉంటే ఉత్తరం వ్రానే దేమిటి"అని అదోమాదిరి ఆలోచన నూఅకుంటాడు. మామగారి పట్టు బుసహాజాల్ని మించియుంటాయి అల్లుని పబుబుసహాజాలు. అతని దారి వత దూఅకుంటాడు"మామగారినుంచి యుత్తరం వస్తేనే ప్రత్యుత్తరం వ్రాదాం" అని. కాని కూతురు రాయూరినుండి పుట్టినూరు వెళ్లేవారిద్వారా ఎప్పటికప్పుడు తన యోగక్షేమము లంపుతూనే వుంటుంది. తల్లి వచ్చినవారితో తమ మంచీచెడ్డా వెళ్లబోస్తూనే వుంటుంది.

అలాంటి గాలికబుర్ల వల్ల కర్ణాకర్ణిగా శ్వేషపార్ణమికి సౌదామని తండ్రి చెవి బడ్డాది,—సౌదామని నానాటికి చిక్కిపోతూండని, చెక్కిళ్లు రక్తశూన్యము లైపోయి దూధియేకుల్లా గున్నాయి అని, దగ్గుతూండని, చేతులూ కాళ్లూ గొడుగూచల్లా గైపోయినాయని, ఆయూరిలోని వైద్యులందఱూ పరీక్షచేసినా ఆవ్యాధి యిదమిద్ధ మన లేకపోయినారని, ఒక్కసారి తల్లిని గాని తండ్రిని గాని వచ్చి చూచిపొమ్మందని.—

సౌదామనితండ్రికి తెలిసె నన్న సౌదామనితల్లికి తెలిసినట్టే. వారిద్దఱకూ తలవనితలంపుగా నైనా సౌదామనిని "సౌదామనీ" అని పిలిచేసరికి, చీకటి పోయి వెలుగు వచ్చిన ట్లౌ చుండుటచే ఆమెనుగుఱించి యొకరు విన్న దొకరితో చెప్పికొనకుండా ఉండలేరు.

సౌదామనితండ్రి తబ్బిబ్బయిపోయి చెప్పిన చిన్నెల నూహించుకుంటూ "క్షయ" అని భార్యతో అనెను. భార్య "క్షయ అంటే?" అంది. "అంటే అదో మాదిరి దగ్గు.—మ అంతజబ్బొస్తే యుత్తరమన్నా వ్రాసినాడు కాడేమే అల్లుడు?" అని తల్లడిల్లినాడో భుడియ మగడు. పెండ్లాం అంది "భర్తలెన్ని మోస్తర్లున్నాయో అన్ని మోస్తర్లకూ అన్ని కుప్పెలూ మా తండ్రిగారు నాకు ఇచ్చినారు నేను కాపరానికి వచ్చిన మఱుచటియేడు—పిల్లలకు కోరింతదగ్గొస్తే ఇదనీ,నుప దగ్గొస్తే ఇదనీ, పాడిదగ్గొస్తే ఇదనీ, కాకనైనా, జలుబునైనా,అన్నీ నాదగ్గఱ ఉన్నాయి. తీసుకురండి,వెళ్లి తీసుకురండి, వెనకా ముందు చూడకండి,వెంటనే తీసుకు రండి. వెంగవాడు మోటవాడు. అల్లుని కేం తెలుస్తుంది? ఉత్తరమ్మకైకూనా, మీ రన్నట్టు, వ్రాసికోరూ?" అని పెని

మిటికి పెందలకడే మంచి వంట చేసి పెట్టి ఆ యూనయం ౧౦ గంటల బండికి పంపేసింది.

అక్కడ అల్లునికి మామగారు వస్తూవున్నారని తెలియదు. ఏమీ ఎఱుగడు. సౌదామని సుస్తీపడ్డ మాట నిజం. దీపావళికి పుట్టింటికి వెళ్లి తిరిగి అత్తింటికి వచ్చినతరువాత పన్నిపాతజ్వరం తగిలి పిల్ల చిక్కి శల్యమైనమాట సత్యము. కాని కాయలానుండి గట్టెక్కి రెండుమూసాలాదిగా బలం రావడానికి కొత్తనెత్తురు పోసికోవడానికి, సూదిమందులు, సీసామందులు, అన్నీ ఆయూరిలోని హూణవైద్యం తెలిసిన యొక నూతనంగా వచ్చిన యువతి యిస్తూవుంటే తీసికొంటూ, ఎప్పట్లాగ నట్టింట పనిపాటలు చేసికొంటూ తిరుగుతూ వుంది. తిరుగుతూ వుందన్నమాటే కాని మునుపటి పటకే యింకా బుగ్గల్లో కందుకోలేదు. మునుపటి తేటింకా కనుగోకుల్లోకి రాలేదు.

జాయ అంత కాయలాపడ్డా గాని ఆజామాత తన మామగారికి గాని తన అత్తగారికి గాని తెలుపుదు చేయక పోవడానికి కారణ మేమంటారు? ఏమీ లేదు ఒకవిధంగా చూస్తే. అంతా వుంది మఱోవిధంగా చూస్తే.

ఏమీ లేదు ఒకవిధంగా చూస్తే:—అంటే సౌదామనిభర్త కోఅభిప్రాయం—తనూ భార్యా సంతోషంగా, హెచ్చుటెగ్గా, సరదాగా ఉన్నప్పు డెంతమంది యెవరెవరు చూచినా అతని కంతకంత కానందము, అంతకంతకు బలము, అంతకంతకు వినోదమున్నూ. కాని తనుగాని తనభార్య గాని చీకాగ్గా ఉన్నా, చిక్కిపోయివున్నా, చింతాకులులై యున్నా, దగ్గఱనేస్తులుకూడా వచ్చి చూడ్డం కిట్టదు. మామగారూ అత్తగారూ పనికిరారు ఉపచారం వారిరువురూ ఒకరికొకరు చేసికొంటూ ఎవరికీ తెలియకుండా మళ్లీ పైకి తేలాలి. దానికుపమానం లోకమం దేమైనా వుంటుందా అంటే యేయితర ప్రవర్తనమూ కనిపించదు. ఆదంపతులిద్దఱూ కష్టపడుతూవున్నా, కష్టపడుతూవున్నారని యితరులనుకోకూడదు. అనరాదు. కనరాదు. వినరాదు. అంచేత ఏమీ లేదు.

మఱోవిధంగా చూస్తే అంతా వుంది అంటే అది యిది:—హూణవైద్యపద్ధతి సౌదామని తండ్రికి గాని, తల్లికి గాని నచ్చదు. వారు వచ్చిరా ఏదో వాగ్వివాదము తప్పకుండా వైద్యురాలికీ సౌదామనితల్లికీ జరుగుతుందని సౌదామనికి, సౌదామనిమగనికి గట్టినమ్మకము. అయినా గానీ జబ్బుపడి లేచి కొంచెం వారితో వీరితో మాట్లాడ్డంలో చేయడంలో ఎవరో "మీయింటికి వచ్చే వైద్యురాలు చాలా అసాధ్యపుమనిషిలా గుంది. నీకు మందు సీసాలూ అవీ కడిగి సీసాల్లో మందులు కూడా ఆమే పోసి మరీ వెళ్లేదట కాదూ నీజబ్బులో?" అని అడిగేవారు. "అబ్బే! లేదు! మావాళ్లే కడిగి ఆమె చేతికందిచ్చేవారు." అని యేదో చెప్పేసేది యున్న సత్యం సౌదామని.

ఇలా నీరసంలో ఒకనాడు మాట్లాడ్డంలో సౌదామనికి తోచింది "పోనీ ఎవరన్నా రెండోవారు తల్లీ తోడూ వుంటే మంచి" దని. అలా తోచి కబురంపించింది తల్లితండ్రులకు మరీ కొన్నిరోజులై. మరికొన్ని నెలలై ఆకబురుపెట్టినవాళ్లు వాళ్లకు తీరుబడి అయినప్పుడో, వాళ్లకు సొంతపని కలిసివచ్చినప్పుడో వెళ్లి సౌదామని తండ్రిగారితో చెప్పినారు, ఉన్న నీరసం కొంతా లేని నీరసం కొంతా. దానా దీనా నిలుచున్నపాటుగా కూతుర్ని చూడ్డానికి రావలసిన అగత్యం కలిగింది తండ్రికి. ఇదంతా మఱోవిధం.

ఎన్నివిధా లన్నా పైవా ళ్లనుకోవడాన్నిబట్టి వ్రాయవలసిందే గాని సౌదామనిభర్త నడిచినమాత్రం మనకు పట్టే దేమీ లేదు. అతగాని అహర్నిశ ఆలోచన యొక్కటే: సౌదామని కెల్లాగన్నా తిరిగి పూర్వపు పుష్టి, పూర్వపు సౌష్ఠవము, పూర్వపు నిగనిగ, పూర్వపు చకచకి రప్పించాలని. అందుచే వైద్యురాలితో తఱుచు ఆలోచిస్తూ ఆమెసలహాపై నడిపించేవాడు. వైద్యురాలను ప్రతిసాయంకాలము నాలుగ్గంటలకు వచ్చి అయిదు వఱకు సౌదామనితో గమనించవలసిన ఆరోగ్యవిషయాలను గుఱించి, తీసికోవలసిన శరీరవ్యాయామమును గుఱించి, నేర్చికోవలసిన యింద్రియనిగ్రహాయమును గుఱించి, నచ్చ

చెబుతూ వెళ్లిపోయేటప్పుడు జంపతు లిరువురనుండి సెలవు తీసికొని వెళ్లిపోతూండేది.

ప్రతిసాయంకాలము సంగతి మన కెందుకు? సౌదామనితండ్రి సరిగా రైలు దిగి అల్లునింటికి జేరునాటి సాయంత్రము జరిగిన సంగతి కావాలి గాని—

యథాప్రకారంగా వీధితలుపు తట్టింది వైదుష్యరాలు. సౌదామనిభర్త తలుపుదీసి ఆమెను లోపలికి రానిచ్చి తలు పోరగా జేరవైచి తిన్నగా భార్య ఉన్న చోటికి తీసికొని వెళ్లి దిగబెట్టి తాను తిరిగి వీధిచావడి లోనికి వచ్చి చావడిలో వార్తాపత్రిక చదువుకొనుచుండె.

చావడి వెనుదెస నొక తీవలజొంపమును అర డజను కుండీమొక్కలును వానిమధ్య నొక వలయాకారసంస్థితశిలాసలంబును గలవు.

వైదుష్యరాలు సౌదామనికి జెప్పవలసిన దంతా నచ్చచెప్పి యామె నింటిపనుల కొప్పగించి, సౌదామని భర్తకడనుండి సెలవు గొనుటకై చావడిలోనికి వచ్చింది. అతడును "ఏమంటూంది? ఎలాగుంటూంది? నా ప్రియురాలు?" అని అడిగేడు చిరునవ్వు నవ్వుతూ. "ఆమె కేమి? ఆమె ముఖంలో మీకు కనబడ్డంలే కొత్తరక్తము, కొత్తశోభ? దారిలోకి వచ్చింది. కాని ఒకటి వుంది. రోజూ సాయంకాలము మంచిగాలిలో ఆరుబయట బాగా శరీరవ్యాయామం చేయాలి" అంది వైదుష్యరాలు. "మరి నేర్పరాదూ ఆవ్యాయామ పద్ధతి?" అన్నాడు సౌదామనిభర్త. "నేను నేర్పితే నేర్చుకో దాపిల్ల. ఈలా చేయి విసరుమంటే ఆలా చేయి విసరుతుంది. మీరు నేర్పండి, మీరు నేర్పండి." అంటూ ఆలా చావడి వెనుక నున్న యింటి చిన్నజితోటలో విడిచి, ముదుగనీ వాడనీ యొకానొక తురకబంతిపువ్వు కేసి చూస్తూవుంది యూదా లాపంగా.

సౌదామనిభర్త ఆవైదుష్యరాలి ముఖంకేసి చూస్తూ —అంటే—ముఖమంత కేసీ కాదు—అంతా కనబడదు చూడాలన్నా—ఆమె ఆలా పువ్వుకేసి చూస్తూన్నంత సేపు—ఆమెయొక్క యెడమ చెక్కిలి మనుమెఱుగనే తనచూపు జారిస్తూ, "ఆవ్యాయామవిధి ఎలాంటిదో నాకు చూపించినట్లయినా నేను నా సౌదామని నా తీరుగా తరిఫీదు చేయగల" నన్నాడు అప్రయత్నోత్సాహి యైపోయి.

వైదుష్యరాలును తోటలోని ఆరుబయటకు నడచి గుండెకొట్టుకొలగొట్టాలను దూరంగా తీవెలజొంపం వెనుకట్టు తగిలించి, చావడిదిక్కు మొగమై నిలువున నిలుచుండి మునివేళ్లపై మెల్లగ లేచి తన బాహువులు రెండు నెత్తి రెత్తినంత మెల్లన తిరిగి దించి రెత్తి దించుటలో నుచ్ఛ్వాసనిశ్వాసములను బంధించి వెలిబుచ్చి — ఇట్లు చేయుచుండవలెనని యొకవిధి చూపించి, "పటుగాత్రమనండి, ఎగుర మనండి, ఆడుకోమనండి, అప్పు డారోగ్యం, అప్పు డాయుర్దాయం" అని యొకయుపన్యాస మిస్తూవుండె, గబగబ పెదవు లల్లాడిస్తూ అప్పపాటుకు రెండుమూడు వాక్యా లన్నట్టుగా. సౌదామనిభర్త ఆమాట లాలకించడంలో చావడిమారమై యుపవనంలోకి వెళ్లినాడు. ఎప్పుడోనా? అప్పుడే.................. తటాలున సౌదామనితండ్రి రైలు దిగి వచ్చి వీధితలుపు తెఱచి చావడివైపూ చావడివెనుకట్టున్న వనంవైపూ చూచేడు.

సౌదామనిభర్త అదేమీ గమనించలేదు గాని వైదుష్యరాలు గమనించింది. మరి వ్యాయామం చేసిచూపెడితే బాగుండదనో ఏమో, గుండెకొట్టుకొలగొట్టా లంది పుచ్చుకోవా లన్నట్టు, తీవెలజొంపంచాటు కొరిగింది; ఆ ఒరుగులో దృష్టి, కొత్తవా రెవ్వరో వచ్చి రన్నట్టు అట్టె యెట్టయెనటికే బలిపిం దొట, ప్రక్కకు తూలి ఆపుకొని పూర్తిగా తీగెలజొంపము మఱుగునకు మాయమైపోయింది, ఓమాత్రలో మూడు మెలికలు తిరిగి కనులు మిఱుమిట్లు గొలిపే మేఘద్యుతిలాగు. సౌదామనిభర్త, ఆశామాత్రంగా ముందు చూచేవ్యక్తి తిరోహితయవడంలో యెట్టయెదుట చూస్తూ తిరోహితయైన చోటచ్చే, "అరేరే" అని వెనుదిరిగి క్రొత్తగా వచ్చిన మనుష్యుడు తనమామగా రని గుర్తించి, "ఎప్పుడు వచ్చినారు? ఇదేనా యేమి రాక? అంతా కులాసాగ

మున్నారా. లోపలకు వెళ్లండి, వస్తున్నా. మీ యమ్మాయి ఉంది" అని వేకరుపెట్టినట్టు మాట్లాడినాడు.

మామగారికి వింతైంది. "ఆ మెవరు? అమ్మాయి కాదా?" అని అడిగినాడు. అల్లుడును "మీ అమ్మాయి అయితే అలా మీరు వచ్చేతలికి మీకు కనబడకుండా మెఱుపులా మాయమైపోతుందా?" అన్నాడు. మామగారు "అయితే ఆమె సార్థక సౌదామని, మా అమ్మాయి నిరర్థకసౌదామనీనా?" అని అనుకున్నాడు అల్లునకు వినబడేటట్టు. అల్లు డేమన డానికీ, గొట్టా లాడించుకుంటూ "సెలవండీ" అంది వైద్యురాలు..............సౌదామనిభర్త "వందనం: సెలవు" అన్నాడు. మామగా రామె వెడుతూవుంటే ఆమె ముఖంకే సోమారు ఆమె వెన్నుకే సోమారు చూచి "వైద్యురాలా?" అన్నాడు. అల్లుడు "అవును. మీ అమ్మాయికి తిరిగి ప్రాణము!పోసి నన్ను భార్యావంతునిగా జేసిన దామెయే. ఆమెకు మీరూ నేను కూడా కృతజ్ఞుల మై యుండవలెను." అన్నాడు.

మామగారు కిమన్నాస్తి. తిన్నగా ఇంట్లోకి వెళ్లి తన పిల్ల ఆరోగ్యంగా వున్న సంగతి తెలిపికొని తల్లిని పంపిస్తానని చెప్పి మర్నాడే వెళ్లిపోయినాడు.

ఇంటికి వెళ్లిన వెంటనే "అంతా కులాసాగా నున్నారా?" అని అడిగింది సౌదామనితల్లి సౌదామని తండ్రిని. "ఆహా! సార్థక సౌదామనిపిల్ల" అన్నాడు. అర్థం అయినంతైంది, కానంతకాలే దిల్లాలికి.

"ఆహా!"నుబట్టి అంతా కులాసాగా నున్నారని గ్రహించుకుని, దాలిమీద కాగి చల్లారిన పాలమీది దొంగపిల్లి తాను కతికేటందు పడదోనే చప్పు డేదో యింట్లో అయితే వెళ్లిపోయింది.

మళ్లీ అల్లుడు తనింటికి వస్తేమాత్రం అడుగుతాడా మామగారు ఆవైద్యురాలు ఎవ రని? మామగా రడిగి తెలిసికోవా లనుకున్నా అత్తగా రడుగనిస్తుందా? "మన కెందు కెవరివైద్యం అయితేం. మనమ్మాయి కక్కదిరింది. మన సౌదామని సుఖంగా వుంది" అని అంటుందిగాక!

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముం దున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

—మేనేజరు, 'భారతి.'

## మ బ్బు తు న క

వేంకట కాళిదాసకవులు (ఆం. గీ. సా. పరిషత్తు)

సగము సగమ్ము విప్పువడి చల్లనిమాసలు నిండియున్న నె
మ్మొగములఁ గ్రొత్తక్రొత్తవలపుందలఁపుల్ పొడసూప మాధురీ
ద్విగుణితమందహాసముల విశ్వము నెల్ల సుధాపిపాసలన్
సొగయఁగఁ జేయు పూలకు విశుద్ధతరాంబువు లిచ్చుచుండెదన్.

కరము కరమ్మునన్, గనులఁ గన్నులు, చిత్తమునందుఁ జిత్తమున్,
బరఁగఁగ నెవ్వియో వలపుపాటలు పాడుచుఁ బూలు గోయుచున్
దిరిగెడు ప్రేమమూర్తులకు నిత్యవినూతనమాధురీభర
స్ఫురితపరీమళమ్ములు గుబుల్కొన గాడుపు లంపుచుండెదన్.

పసిఁడిహొరంగుబట్ట వలెవాటుగ వైచినయంతఁ బల్లెపి
ల్లసొగసు లీను చంచలవిలాసము లేర్పడునట్లు దృష్టులం
బ్రసరణసేయు నాదెసకుఁ; బక్షివలెన్ శరదిందుకాంతులన్
మిసమిసలాడుచుం జనఁగ నిల్చును గన్నుల వింత క్రమ్మఁగా.

చల్లని వైనరాత్రుల వసంతసుఖోదయవేళఁ బువ్వముల్
చల్లెడువిస్ఫురత్పరిమళమ్ముల తీయఁదనమ్ములోనఁ, గాం
తిల్లినకన్నులం బయికిఁ ద్రిప్పుచు జాబిలిఁ జూచుపిల్లలన్
మెల్లనఁ జిన్కుగాఁ గరఁగి నిండుముదంబున ముద్దులాడెదన్.

లేఁతపసిండిఛాయలు మలీమసకాంతులు నల్లుకొన్న ప్రా
భాతికవేళ కన్నులకుఁ బండుగసేయఁగఁ, జెట్లనీడలన్
గీతములన్ మనోజ్ఞత చిగిర్పఁగఁ బాడు కవీంద్రకోటికిన్
జేతము మెల్లమెల్లఁ దడిసేయుచునుండెద మాటిమాటికిన్.

---

# అప్పు డప్పుడు! (ఒక ఆంగ్ల హాస్యచిత్రమున కనువాదము)



# పిత్తల్ కా దర్వాజా[1]

వేలూరి శివరామశాస్త్రి గారు

౧

క

తాతల నాఁటి కథ. నాఁడు కఱ్ఱదే పెత్తనము, నోటిదే శాసనము.

బాదుషావారి దర్శన మెవ్వరికో; ఎన్నటికి! కాని పది అమరఫీలతో[2] వారి అంగుళి దర్శనము, ఇరువది అమరఫీలతో అగ్రహస్త దర్శనము. అదియు మెఱుఁపువలె.

పైడిమఱ్ఱి దమ్మన్న పండితజీ పాదుషావారి ధర్మాధికారి. నాఁటి తెలుఁగునాటివారి కాతఁ డాశ్రయదాత. అతఁడు చాల లోకజ్ఞుఁడు. చాల పలుకుబడి కలవాఁడు.

ఖ

పన్నాల రామశాస్త్రి పుట్టుశాస్త్రి. సాహసమున రామలింగఁడు. లేఁబరమున జ్యేష్ఠాదేవి. పండితజీకి వేలు విడిచిన మేనల్లుఁడు.

"మామా! ఆలి దెప్పులు చెప్పు దెబ్బలు. లేఁబరము కడుపుకోఁత. 'భవతి! ఉద్యోగ భిక్షాం దేహి!'"

'ఓరి రామా! నీకు ఉద్యోగసద్యోగము లొసఁగ నీయవలయునా? అడవిలో సింహమునకు రాచతిలక మెవ రిచ్చిరి?'

రామశాస్త్రి మోము కొంచెము వికసించెను. పండితజీ కనిపట్టి మరల నిటు లనెను:

'ఈ బస్తీలోని దర్వాజా లన్నియు దాఁటి చూడుము. ఉద్యోగము సంపాదించుకొనునంతవఱకు మాయింట నుండుము. ఓసీ—

ఉత్తమా ఆత్మనా ఖ్యాతాః
పిత్రా ఖ్యాతాశ్చ మధ్యమాః
మాతులే నాధమా ఖ్యాతాః
శ్వశురే ణాధమాధమాః.[3]

అని నీవు చదువలేదా? కావున బస్తీయంతయు తిరిగి చూడుము పొమ్ము!'

గ

రామశాస్త్రి గల్లీగల్లీ తిరిగెను. ఏనుఁగు లంబారీలు వేసికొని తొండములు తోఁక లాడించుకొనుచు పోఁగల దర్వాజా లన్నియు త్రొక్కి చూచెను.

సత్రము లన్నియు సంచరించెను. ప్రాఁత హవేలీ లన్నియు పరిశీలించెను.

అతఁ డాలోకింపని ఆఫీసు లేదు. త్రొక్కి చూడని తోఁట లేదు. కోఁడని కోట లేదు. చూడని చోటు లేదు.

అతఁడు బానిసతో బాతాఖానీ వేసెను. ప్రగడను పట్టి చూచెను.

రామశాస్త్రికి నౌకరులు వచ్చలేదు. మంత్రము లంతకంటె వచ్చలేదు. దేవిడీలు వచ్చలేదు. దేవాలయము లంతకన్న వచ్చలేదు. వచ్చిన వొక్క దర్వాజాలు.

ఘ

రామశాస్త్రి ఒకనాఁ డొక సత్రమున కాలిమీఁద కాలు వైచుకొని పరుండెను. జీవనము చేయ వచ్చిన భారుగూరి పనివాసలవారు పలువు రచట విడిసియుండిరి.

""నా౽విష్ణుః పృథివీపతిః[4] అనుచో ద్వారపాలకులు జయవిజయులు." అనుకొనుచు రామశాస్త్రి పాద మాడించెను.

---

౧. ఇత్తడితో చేసిన ద్వారము. ౨. బంగారు నాణెము. ౩. తమకు తాము పేరు తెచ్చుకొనువారు ఉత్తములు. తండ్రిచే పేరు పొందువారు మధ్యములు. మేనమామవలన పేరందువారు అధములు. మామగారినిబట్టి పేరు పడువారు అధమాధములు. ౪. విష్ణువు కానివాఁడు రాజు కాఁడు. అనఁగా రాజు విష్ణుమూర్తియంతటివాఁడు.

పాదరేఖలు పరిశీలించుచున్న విశ్వబ్రాహ్మణుఁ డొకఁడు 'అయ్యా! పాదము కదలింపకుఁడు' అని వేఁడుకొనెను. రామశాస్త్రి ప్రత్యుత్తరింపక పాద మాడించి యాడించి ఆఁపి, 'రేఖ బయటఁబడినా' దని లోలోపల ననుకొనెను. కుడికాలు కిందమోపి ఎడమ కాలు దానిమీఁదఁ బెట్టుకొనెను.

విశ్వబ్రాహ్మణుఁ డాపాదమునుగూడఁ బరికించి రెండుపాదములను కనుల కద్దుకొనెను.

'అయ్యా! తమ రెండుపాదములందును రెండు చక్రములు గలవు. మీరు మహారాజులు కాఁగలరు.'

'అగుచో దివాణపు పని నీదే.' అని రామశాస్త్రి యనఁగా విశ్వబ్రాహ్మణుఁడు మఱొకసారి యతని పాదములు పట్టుకొని 'ఈమాట మాత్రము మఱవకుఁడు' అనెను.

'మంచిది. కొత్తదివాణమున కొక యిత్తడిదర్వాజా కావలయును. ఇరువది గజములయెత్తు, పదిగజముల వెడల్పు. ఎప్పుడు తయారుచేయఁగలవు?'

'రేపటికి.'

'వాహవా! పనివాఁడ వన్న పనివాఁడవు. ఇరువదిమంది విచ్చుకత్తుల పారావారు కావలెను.'

'చిత్తము. వావారున్నారు.'

౫

కోటకు పోవు దారిముందు ఇరువదిగజముల యెత్తును పదిగజముల వెడల్పును గల ఇత్తడిదర్వాజా యొకటి సూర్యోదయమున నిగనిగలాడుచు ఆవిర్భవించెను.

దర్వాజా కొకప్రక్క క్రిందినుండి మీఁదివఱకును బాదుషావారి వంశావళియు, మఱొకప్రక్క దశావతారములును చక్కఁగా చెక్కఁబడియుండెను.

దర్వాజాకు ఆనుకొని ఒక చిన్న బంగళా. దాన రామశాస్త్రి ఆఫీసు. ఆఫీసులో ఒకకుర్చీ. కుర్చీ ముందు ఒక డెస్కుబల్ల. దానిమీఁద 'పిత్తల్ కా దర్వాజా' అను మొహరు.

రామశాస్త్రి కరోధా.[1] విశ్వబ్రాహ్మణుఁడు పేదర్ మాల్ ఖజార్.[2]

దర్వాజాముందు విచ్చుకత్తుల పారావారు పదిమంది అటు, పదిమంది ఇటు.

౬

ముందు ఖాశీ, వెనుక నూఱుమేఁకలు, వెనుక ఇద్దఱు గొల్లలు వచ్చిరి. దర్వాజాకడ ఖాశీ నిలువఁబడెను.

ఖాశీ ఇత్తడిదర్వాజా యంతయు పరిశీలించెను. బంగళా యంతయుఁ జూచెను—'ఆగా భీఖ్ ఆయా, గావ్ కాజమా'[3] అనెను.

రామశాస్త్రి ముఖము బయటికిఁబెట్టి బిగ్గఱగా 'అమీర్ ఉల్ మోమేనీన్ సాహబ్!

బగల్ మే ఛురీ.

ముహ్ మే రామ్ రామ్.[4]' అనెను.

'ఈ క్రొత్త డిపార్టుమెంటుకు ఏమి యీయవలెను?'

'ఆటులు దారికి రండు! జీవమునకు అర్ధణా. మనుష్యునకు అణా.'

'నాలుగు మేఁకతోళ్లు, ఒక గుండెకాయయును పంపింతును. మఱ్ఱు పోనిండు.'

మీకు జబాబులు ఇచటనే జరుపవలయునా?

వెంటనే ఖాశీ జేబులో చేయిపెట్టి మూఁడు రూపాయల అయిదణాలు తీసి రామశాస్త్రి బల్లమీఁదఁ బెట్టెను.

| | |
|---|---|
| 'నూఱు మేఁకలకు | ౩–౨–౦ |
| మూఁడురుమనుష్యులు | ౦–౩–౦ |
| వెరసి. | ౩–౫–౦' |

౧. పన్ను వసూలుచేయు ఉద్యోగి. ౨. డబ్బు ఖజానాకు చేర్చు ఉద్యోగి. ౩. బిచ్చ మెత్తుకొనుటకు వచ్చి గ్రామ మంతయు జమాబంది చేయుట—భిక్షుపాదప్రక్షేపన్యాయము. ౪. చంకలో కత్తి, నోటిలో రామనామము. ౫. కొరానుమంత్రము చదివి ఈశ్వరార్పణముగా జంతువును నఱకుట.

అని పద్దు వ్రాసి మొహరు వేసి రామశాస్త్రి రసీదిచ్చెను. ఖాజీ వెనుకముందులు ముందువెనుకలు చూచుకొని వాహవావాహవా అనుకొని దర్వాజా దాఁటెను. అతని గుండెలు లటుక్కుమనెను. 'ఈఖర్చు గూడ మేఁకలమీఁద వేసి వ్రాయింతును' అని ఖాజీ అనుకొనెను. అంతట వ్లతనిగుండెలు కుదుటఁబడెను. మేఁకలు వెళ్లిపోయెను.

—— కొంతసేపటికి జోడుగుర్రాల బగ్గీ యొకటి గబ గబ వచ్చి గబుక్కున ఆఁగిపోయెను.

'అరే అది యేమి ?'

'కొత్త దర్వాజా.'

లోపలినుండి మంత్రి తొంగిచూచెను. దర్వాజా నిండ పాదుషావారి వంశావళి. ఆవంశావళిలో తమ వంశావళియుఁ గలిసియుండెను. మంత్రి బగ్గీ దిగి సలాములు చేయుచుఁ బోయి చిత్తరువులను ముద్దుగొను చుండెను.

బంగళాలోనుండి సలాములు కొట్టుకొనుచు రామశాస్త్రి మంత్రికడకు వచ్చెను.

ఈస్ కా చాంన్[౧] అని మంత్రి యనెను. ఆప్ భలా తో జగ్ భలా[౨] అని రామశాస్త్రి యనెను. మంత్రి సంతసించెను. రామశాస్త్రి—

| | |
|---|---|
| "రెండుగుర్రములు | ౦-౧-౦ |
| మార్గరుమనుష్యులు | ౦-3-౦ |
| చెరసి | ౦-౪-౦ |




"

అను చీటి యిచ్చెను. మంత్రి పావలాయిచ్చి 'ఓ ఏమి మొహరు! ఏమి దర్వాజా! ఏమి చెక్కడపు పని!'

అని పాదుషావారి నిర్మాణకౌశలమును బహిరంగముగా మెచ్చుకొనెను.

సదర్ మాల్ గుజారు పావలాను లోనికి తీసికొని వెళ్లెను.

'పాదుషావారి కౌశలమును గ్రహింపఁ గలవారు గనుకనే తమకు అమీర్ ఉల్ ఉమరా[3] అనుబిరుదు వచ్చెను' అని రామశాస్త్రి యనెను.

'వహావా వహావా' అని అమీర్ ఉల్ ఉమరా గారు మెచ్చుకొనిరి.

వెనుకబోవుగుర్రములను బండివాఁడు భద్రముగా తోలెను.

ఘంటాపథము గణగణ మ్రోఁగుట నాలకించి రామశాస్త్రి వచ్చుచున్న బండిని పరికించెను. 'అదిగో! ఆవచ్చుచున్న బండి హిందూమంత్రిది' అని రామశాస్త్రి యనెను.

సిపాయిలిరువురు దర్వాజాను త్రిప్పిరి. ముందువైపు వెనుకకును, వెనుకవైపు ముందునకును తిరిగెను, దశావతారములు కొట్టవచ్చినటులు కానిపించుచుండెను.

తులసీరాముగారి బండి రాఁగనే పారావారు బండి నాఁపివయిచిరి.

'అరే! మంత్రిగారి బండి' అని బండివాఁడఱచెను.

——

'అరే! పాదుషావారి పారా' యని సిపాయి అఱచెను.

తులసీరాము తల బయటికిఁ బెట్టి చూచెను. ఎదుట దశావతారములు!

౧. ముసల్మాను లందఱు చంద్రుని జూడవలసిన దినము. ఆనాఁడు చంద్రదర్శనము విరళము. కావున ప్రియదర్శనము; (అరచేతిలో వైకుంఠము.) ౨. తమరు మంచివారగుచో జగత్తు మంచిది. 3. రారాజు.

తులసీరాము నమస్కరించెను. రామశాస్త్రి చేతులు జోడించి మంత్రిగారికి చీటి యిచ్చెను.

'ఇది యేమి?'

'తలపన్ను కన్న తక్కువ, దర్వాజాపన్ను'— 'రిక్తపాణి ర్న పశ్యేత రాజానం దైవతం గురుమ్[1]'

తులసీరా మెుకతూరి మొహరు చూచెను. ఒక తూరి దర్వాజామీఁది దశావతారములు చూచెను.

పాదుషావారి హిందూ మహమ్మదీయ మతైక్య మున కిది తార్కాణ.

హిందూస్త్రీలకు నిక్కా కట్టుట ఇంతకంటె నెక్కుడు సజీవమగు తార్కాణ.

తులసీరాము రామశాస్త్రిమెుగ మెుకతూరి చూచి పావలా చెల్లించెను. బండి మెల్లగా వెళ్లిపోయెను.

విశ్వబ్రాహ్మణుఁడు రామశాస్త్రిని జూచి 'అయ్యా తులసీరాముగారికి రెండుమతములను కంత పాశ మట' అనెను.

రామశాస్త్రి తల త్రిప్పి—

'గీ. సంధ్య లేదు నమాజులో శ్రద్ధ లేదు
సరిగ నేకాసి లేదు రంజాను లేదు
కాశియును లేదు మఱియు మక్కాయు లేదు
హిందువా? మల్కయా? యితఁడెవఁడు కాఁడు.'

అనెను.

సిపాయి యొకఁడు మరల దర్వాజా త్రిప్పివయి చెను. ఇంతలో పలువురు నవుకరులు వచ్చిరి. వారా వారు వారి నాఁపివయిచిరి.

'ఇది యేమి?'

'దర్వాజా పన్ను.'

'మేము దేవిడీ నవుకరులము.'

'ఇది దేవిడీ—పన్ను.'

పెద్దనవుకరు కనుసన్నచే మిగిలిన నవుకరు లంద ఱును మఱియొకదారిని లోపులకు వెనుదిరిగి పోయిరి.

మీ రందఱకును మఱొకదారి దొరకునేమో యని విశ్వబ్రాహ్మణుఁ డనెను.

'నాఽన్యః పంథా విద్యతేఽయనాయ[2]' అని రామశాస్త్రి యనెను.

ఇంతలో సేనాపతి రుస్తుం ఖాఁ, అలీ హిమ్మత్, అమీర్ ఉల్ బహార్ గుఱ్ఱముమీఁద వచ్చెను. క్రొత్త దర్వాజా చూచి బెదిరి గుఱ్ఱ మాఁగిపోయెను.

రామశాస్త్రి బంగళాలో మొహరు చప్పుడు చేయుచు చీటి తీసికొని వచ్చుచుండెను. సేనాపతి గుఱ్ఱమును రెండుకాళ్లతోడను అదిలించెను. అది వెను కకు నడవఁదొడఁగెను.

రామశాస్త్రి—బాపా కా బేటా.
సిపాహీ కా ఘోడా.
కుచ్ నహీ తో.
థోడా థోడా[3]

అనెను. గుఱ్ఱము మరల దాపునకు రాఁగనే రామశాస్త్రి చీటి యిచ్చెను.

'ఇది యేమి?'

'దేవిడీ పన్ను.'

రుస్తుంఖాను మెులనున్న కైజారు చూపెను.

---

1. రాజును దైవమును గురువును వట్టిచేతులతోఁ జూడఁబోరాదు. 2. దీనికన్న వేఱుదారి లేదు. (ఈశ్వరు నెఱుంగుటకు). 3. ఎంత చెడినను బిడ్డకు తండ్రిపోలికయు గుఱ్ఱమునకు కొతుపోలికయు కొలఁదిగా నయినను వచ్చును.

రామశాస్త్రి—జీత్ ని చద్దర్ దేఖో.
　　　　ఉత్ ని పైర్ ఫైలా ఓ.[౧]

అని మొహరు చూపెను.

దస్తుంఖాను ఆ అరుదు మని ౦-౧-౬ తీసియిచ్చెను. సవర్ మాల్ గుజారు తీసికొనెను.

సేనాపతి గుఱ్ఱము వదలించెను. అది వెనుకకు నడచి మరల ముందులకు వచ్చి దర్వాజాకడ నిలిచి పోయెను.

వెను దిరిగిపోయిన నవుకరు లందఱును వేఱు దారి లేక సంపుగా వచ్చిరి. వారిని జూచి బెదిరి గుఱ్ఱము రెండు దుముకులు దుమికి దర్వాజాను ఒఱసికొని పోయెను. ఎర్రదా గొకటి అచట నలంకార మాయెను.

రామశాస్త్రి—అత్తాస్ కుకుర్
　　　　బత్తాస్ భూకైః[౨] అనెను.

నవుకరు లందఱును నవ్వుకొని అణా అణా యిచ్చి చీటి తీసికొని చూచుకొనుచుఁ బోయిరి.

సవర్ మాల్ గుజారు వీరికి ముద్ర తప్పలేదని నవ్వెను.

రామశాస్త్రి—
డిల్లీకా లడ్డూ జో ఖాయా సో పస్తాయా.
జో నఖాయా సోభీ పస్తాయా)[౩] అనెను.

దేవిడీ ముందు పండ్రెండు మ్రోఁగెను. పాదుషా గారి కపుడే ప్రభాతము.

అర్ రహ్ మాన్ లతీఫ్, పాదుషావారి సొఖ శాయనికుఁడు[౪]. వారి గుఱ్ఱము నడుగులు గ్రక్కుచు వచ్చి దర్వాజాకడ నిలిచిపోయెను. రామశాస్త్రి చీటితో సమీపించెను.

'ఓ ఇది యేమి?'

'పిత్తల్ కా దర్వాజా.'

అర్ రహ్ మాన్ లతీఫు దర్వాజానంతయు సలాములతో నింపినయిది 'నా కిఁక తీరిక లేదు' అను కొనెను. రామశాస్త్రి ౦-౧-౬ చీటి నిచ్చెను. అతఁడు రూపాయ పాఱవైచి గుఱ్ఱము నదలించుకొని పోయెను.

క్రొత్త దర్వాజా సంగతి నగర మంతయు ప్రాఁకెను. దేవిడీలో పనిగలవారును లేనివారును వచ్చి వింత చూచి పోవుచుండిరి. రామశాస్త్రి—డిల్లీ కా లడ్డూ జో ఖాయా సో పస్తాయా; జో నఖాయా సోభీ పస్తాయా' అనుచుఁ గునుకుచుండెను.

ఇంతలో విదూషకుని గుఱ్ఱము తూలుచు వచ్చు చుండెను. రామశాస్త్రి చూచి,

'గళచ్ఛత్రు త్రిశృజ్జానుః ప్రస్థలం శ్చ పదేపదే,
మక్షికాలితః సందుక్తో భట్టతట్టు ర్విరాజతే'[౫]

అనెను.

విదూషకునిగుఱ్ఱ మొక రాఁపకుండఁగనే అచట నాఁగిపోయెను. రామశాస్త్రి చీటితో నతని నెదురు కొనెను.

'ఇదియేమి?'

'షేం షేర్ బహద్దర్ కా దర్వాజా.'

'ఓ ఇది నాకు నయిది.'

పూర్తిగా కాదు. సగము పయిది, సగము క్రిందిది.

విదూషకుఁడు దర్వాజా నంతయుఁ జూచెను. బంగళా నంతయుఁ జూచెను. 'షూచీ దుకాణ్ ఫీకి

౧. జాగా ఎటేఁగి చైకో. ౨. పిడికి కుక్క గాలికి బెదురును. ౩. కొందఱు పెనసగాండ్రు అంపపు పొట్టుతో లడ్డుచేసి డిల్లీలడ్డని పేరుపెట్టి అంగడిలో నమ్మిరి. దొంగలు కొందఱువచ్చి వాని నన్నిటిని వెల యిచ్చి కొనిపోయిరి. వెనుక వారికి లేకపోయెను. కాని కొని తిన్నవారును పస్తాయించిరి. దొరకక తినని వారును పస్తాయించిరి. ౪. వేచియుండి 'తమకు సుఖముగా నిద్ర పట్టినదా?' అని యడుగువాఁడు. ౫. గీ. పేలు పారాడ జోరీఁగ లీలఁ బాడ, గ్రుడ్డికమ్మలు మటీయును దోడ్డికాళ్లు, తినర వయవారి గుఱ్ఱపుఁజట్టు చూడు, పడుచు లేచుచు నల్లదే పరువులెత్తు.

పకార్యాం[1] అనియెను. రామశాస్త్రి 'గైర్ గుడ్ ఫ్రాయా వ హీం బఖ్ శే హైం[2]' అనెను.

విదూషకుఁడు మఱి మాటాడక అణాన్నర ఇచ్చి గుఱ్ఱము నదిలించెను; కొరడాతోఁ గొట్టెను. అది రెండడుగులు వైచి క్రిందఁ గూలెను.

వాఁడు పాదుషావారి కొరడా దెబ్బలు తప్ప వనుకొనుచు అతఁడు గుఱ్ఱమును లేవఁ దీసికొని త్రోసికొని పోయెను.

తరువాత న్యాయాధికారి దాదార్ బఖ్ శ్ గారి బగ్గీ వచ్చెను. బగ్గీయుండరి గుఱ్ఱము తన ముట్టెను దర్వాజా కానించి నిలిచెను. బండివాఁ డెంతలాఁగినను ఈవలికి రాలేదు.

రామశాస్త్రి చీటితో వచ్చెను. న్యాయాధిపతి చీటిని లెక్కింపక 'ఊఁ. తోలుము' అనెను. బండివాఁడు తోలెను. అది కదలలేదు.

'అయ్యా! చీటి పుచ్చుకొననిదే అది కదలదు' అని రామశాస్త్రి యనెను.

'ఏది చీటి?'

'ఇదిగో చీటి.'

'ఈపన్ను అన్యాయము.'

'తాము న్యాయాధిపతులు! చీటి చెల్లింపక త్రోసికొనిపోవుట అన్యాయము—నామ్ బడా దర్శన్ ఖోఁడా'.[3]

దాదార్ బఖ్ శుగారికి కోపము వచ్చెను. 'ఈ దర్వాజా సంగతి పాదుషాగారితో చెప్పుము' మనెను. రామశాస్త్రి అతివినయముతో దాపునకు వచ్చి 'ఇదిగో చూడుఁడు! ఈ మొహరు-పిత్తల్ కా దర్వాజా! మూఁడణాలన్నర ముందు వసూలుచేసి పాదుషావారిని పరామరిపింపుఁడు' అనెను. దాదార్ బఖ్ శ్ డబ్బిచ్చి గుఱ్ఱమును తోలుమనెను. బండివాఁడు కొరడాతో రెండుకొట్టెను. అది వెనుకకు రెండడుగులు వైచి మరల దర్వాజా కానుకొనెను. బండివాఁడు మరలఁ గొట్టెను. గుఱ్ఱము మరల నటులనే చేసెను.

'ఇది యేమి?'

'ఇది దర్వాజా మహిమ.'

రామశాస్త్రి యిటులు చెప్పెను: హిదాయత్ ఉల్లాహ్ వారు మొననొన్న నొక గుఱ్ఱమును కొనిరి. అది యేనుఁగంత ఉన్నది. సాయంకాలమున వారు దానిపై షికారు బయలుదేఱిరి. అది పది యడుగులువైచి ఆఁగి పోయెను. పదుగురు వెనుకకు వచ్చి కొరడాలతో కొట్టిరి. లాభము లేకపోయెను. బస్తీలోని గుఱ్ఱపురౌతు లందఱును పోగయిరి. కొట్టిరి కుమ్మిరి; ఊఁహూ. ఎవరును ఏమియుఁ జెప్పలేకపోయిరి. ఒకఁడు 'దీని కిచటనే లాయము కట్టింపుఁ' డని సలహా చెప్పెను. ఒకఁడు ముందుకు వచ్చి 'అయ్యా దీనిసంగతి నేను తెల్పుదును, వెంటనే భోగముమేళమును పిలిపింపుఁ'డని చెప్పెను. భోగముమేళము వచ్చెను. భోగమువాండ్రు గజ్జె గట్టిరి. మద్దెల మ్రోఁగెను. శ్రుతి సుంయి మనెను. గుఱ్ఱము సకిలించెను. ఆటకత్తెలును పాటకత్తెలును కలిసి పాడఁ దొడఁగిరి.—

'సరివారిలో సరాసము లాడకురా!
పదిమందిలో సరాసము లాడకురా!
నలుగురిలో సరాసము లాడకురా!'

అని పాడుచు ఆటకత్తె ముమ్మాఱు గంతువైచి వెనుదిరిగెను. గుఱ్ఱము నడువఁ దొడఁగెను. భోగమువాండ్రు ఆఁగఁగనే అదియు ఆఁగెను.

అపుడు రౌతు ఉల్లాహ్ వారికడకు వెళ్లి 'తమ రీ గుఱ్ఱముతోపాటు ఈ మేళమునుగూడ ముందుంచుకొనుఁడు' అని చెప్పెను.

ఆరీతిగనే ఈ గుఱ్ఱము కంచరవారిది. కంచర సామాను కనఁబడఁగనే ఇది ఆఁగిపోవును.'

'నిక్షయమే. ఇది కంచర్ కా ఘోడా! మాలో' అని దాదార్ బఖ్ శు అనెను గాని ప్రయో

౧. పయికి బటారము లోపల లొటారము. ౨. వెల్లమునుబట్టి రొట్టె. 3. పేరు గొప్ప ఊరు దిబ్బ.

జనము లేక గుర్రమును విప్పి బండివారును పారావారును బండిని లోనికిఁ ద్రోసిరి.

చెప్ప నక్కఱ లేకయే రొవరికి వారు పిత్తల్ కా దర్వాజా ముద్దర తినుచు పన్ను చెల్లించుచుఁ బోవు చుండిరి.

ఈ దర్వాజా దర్శనము నొనరించుకొనుటకు బలె చంద్రుఁ డుదయించెను. తనకడఁగూడ పన్ను వసూలు చేయుదురేమో యను భీతిచే నతఁడు దూరమునుండియే చూచుచు నిలువఁబడెను.

'ఇఁక మనము ముగించి వెళ్లినమా' యని సదర్ మాల్ సుజా రనెను.

'సరి సరి. ఇపుడే ధనలక్ష్మీతాండవ' మని రామ శాస్త్రి యనెను.

ఇంతలో మేనా యొకటి వచ్చెను. బోయీలు లోనికి త్రోసికొనిపోవుచుండిరి. సిపాయిలు వారి వెంబడి యుండిరి.

'అందర్ కా జనానా' అని బోయీ మెల్లగాఁ జెప్పెను.

'ఔను. ఆర్జూ మంద్ బేగమ్' అని రామ శాస్త్రి అనెను.

ఈలోపల అందర్ కా జనానావారి దాసి పియారీ బేగమ్ వచ్చి కలిసికొని 'వెనుక మేనా రాక మునుపే మనము పోవలెను.' అనెను.

'దక్షిణ?' అని రామశాస్త్రి అడిగెను.

'లేదు కొత్త దర్వాజా అడ్డు వచ్చె' నని బోయీ అనెను.

రేపటినుండి పాఁత దగునని రామశాస్త్రియనెను. ఆర్జూ మంద్ బేగమ్ అవలిప్రక్కనుండి దర్వాజాను తొంగి చూచెను. 'ఆహా! దీనిక్రిందిగా నేలలో దారి యుండినచో ఎంత బాగుండిపోను' అనుకొనెను.

'మేనాలో నున్నవా రెందఱు?'

'ఒకరు.'

'ఎటులు నమ్మిక?'

ఇంతలో వెనుక మేనాబోయీల ఓంకారధ్వని వినఁబడెను.

వెంటనే మేనా రెక్కలు తెఱవఁబడెను. మేనా క్రిందుగా హార మొకటి వ్రేలాడెను. రామశాస్త్రి దాని నందుకొని చీటి పియారీబేగమున కిచ్చెను. మేనా వెళ్లి పోయెను.

వెంటనే మఱియొక మేనా అచట నాఁపఁబడెను. మేనాప్రక్క వచ్చుచున్న గులాపీ బేగమ్—'ముందర మేనాను త్రొక్కిపోవలెను. ఆఁపకుఁడు! బాదుషా వారి ఖాస్ మేనా' అనెను.

'అఁ! ఈమేనా ఖాతున్ లతీ ఫ్ ఉన్నీసాది. మేనా బాదుషావారి ఖాస్ అగుచో పిత్తల్ కా దర్వాజా అంతకన్న ఖాస్.'

ఇటు లనఁగనే రామశాస్త్రి కాలిముంగల రవ్వల యుంగర మొకటి పడెను. అతఁడు దాని నెత్తి రవ్వల వెలుఁగులో చీటి వ్రాయఁ దొడఁగెను.

'మేనా పోనిండు, మేనా పోనిం'డని గులాపీ బేగ మనెను.

'ఆఁగు! ఇదే చీటి' అని రామశాస్త్రి యనెను.

మేనా తలుపును తన్నిన ధ్వని యొండు విన వచ్చెను. 'చీటి లేవు చూతా'మని గులాపీ బేగ మనెను.

రామశాస్త్రి 'ఓహో—డోలీ న కహార్
　　　　　　బీబీ హై తైయార్[౧]'

అని మొహరువేసిన చీటి మేనా కంటించెను. మేనా వెళ్లిపోయెను.

పిదప నొక గుర్రపుబండి అచట నాఁగెను. బండి వాఁడు ముజప్ఫర్ హుసేన్ సాబ్! అని పిలిచెను.

'ఆఁ'.

'క్రొత్తదర్వాజా.'

౧. డోలీ తయారుకాలేదుకాని అపుడే బీబీ తయారయినది.

'క్రొత్తది లేదు ప్రాతది లేదు. పోనీ.'

'దర్వాజాపన్ను' అని సిపాయి.

'పుచ్చుకో!'

రామశాస్త్రి.

| | |
|---|---|
| బండివారికి | ౦-౨-౦ |
| మగవేషమునకు | ౦-౧-౦ |
| ముజఫ్ఫర్ హుసేన్ పేరుకు | ౦-౧-౦ |
| ఫాతిమా బేగమునకు | ౦-౧-౦ |
| సుగ్రమునకు | ౦-౦-౬ |
| జెరసి | ౦-౫-౬ |

అని వ్రాసి ముద్రవయిచి చీటి యిచ్చెను. ఫాతిమాకడ డబ్బు లేదు. ఉంగర మొకటి యిచ్చి వెళ్లిపోయెను.

విశ్వబ్రహ్మ తెల్లబోయెను. 'స్త్రీయం పురుష విగ్రహః'౧ అని రామశాస్త్రి యనెను.

ఈరీతిగా పరిచారికలు రాణులు తాగ్తారవిదూషిలు సిరాజ్ నటులు బాగ్దాదు భాగవతములు పెలస్తీను పేకాటకత్తెలు వచ్చి సర్ మాల్ సుజారుకు మోయజాలని బరువు వేసి పోయిరి.

ఆమరునాటినుండియు పిత్తల్ కా దర్వాజా వ్యాసప్రోక్త మయిపోయెను.

దర్వాజాప్రక్కనే రామశాస్త్రి మేడలు మిద్దెలు లాయములు తోటలు ఖానాలు వెలసెను.

ఇటులు కొన్ని నెలలు కొన్ని సంవత్సరములు గడచెను.

ఒకనాడు బాదుషావారి బగ్గీ పిత్తల్ కా దర్వాజా దగ్గఱ ఆపఁబడియెను. బాదుషా, దాపున నున్న రామశాస్త్రి మేడలును మిద్దెలును చూచి 'ఈ పేట యెపుడు పెరిగినది?' అనెను.

'మన కరోడాగారి మేడ. ఇది వారి ఆఫీసు' అని బండివాఁడు చెప్పెను.

'ఇది యేమి?'

'ఇదియే పిత్తల్ కా దర్వాజా.'

విధూతాల్యలంకృతమగు ముఖముతో రామశాస్త్రి మొహరు వైచిన చీటి పుచ్చుకొని సలాములు కొట్టుచు బాదుషా బగ్గీని సమీపించెను.

బాదుషా దర్వాజా సంతయుఁ జూచెను. అతని శరీరము పులకించెను.

'ఈదర్వాజాను చూచిన గుఱుతు లేదే!'

విశ్వబ్రహ్మ లోలోపల నవ్వుకొనెను.

రామశాస్త్రి చేతులు జోడించి 'జవాబ్ జహాపనా ఖుదావంద్!

ఆప్ నే రామ్ కో భజై
రిష్వ భజే వా భీక్.౨'

అనెను.

'భేష్! నీవు నాకు మంత్రివిగా నుండఁదగినవాఁడవు!'

బగ్గీ వెళ్లిపోయెను. 'వీరు ప్రభువు లగుదురని చెప్పవలేదా?' అని విశ్వబ్రహ్మ అనెను. రామశాస్త్రి 'ఇపుడు పాదముల చూడు' మనెను. విశ్వబ్రహ్మ చూచెను. నాటిచక్రములు లేవు. అతఁడు నివ్వెఱపోయెను.

ఆమరునాఁడు సదర్ మాల్ సుజారు కరోడా ఆయెను. కరోడా మంత్రి యాయెను. ఆదృశ్యము దమ్మన్న పండితునికి వినోదముగా నుండెను. వినూత్నకుఁడు 'హుజ్జతే బాంగాలా, హిక్మతే తెలింగా' అను పాటమెతజేఁటినుండియు,

హుజ్జతే బాంగాలా
హిక్మతే తెంగాలా౩

అని మాఱవలె నని అనుకొనెను.

---

౧. మగవేషము వేసిన ఆఁడుది.(ఇది వాల్మీకిరామాయణమున రామవర్ణనము) ౨. నీవు నీయిష్టదైవము నెటులు భజించినను అతఁడు ఆచందమున గ్రహించును. ౩. బంగాళీలు కూటతార్కికులు. తెలుఁగువారు మోసగాండ్రు.

# విద్యార్థి

సీరిపి ఆంజనేయులు గారు

## నాఁడు

అరుణోదయాత్పూర్వ మందె నిద్దుర లేచు
  సర్వాత్ము నెమ్మది సంస్తుతించు
నొజ్జకుటీరంబు గురుభక్తి సవరించు
  నదులుల జలగోడి పసులఁ దవులు
సలిలావగాహుఁడై సావిత్రి జపియించు
  నర్కున కెలఁగి యర్ఘ్యం బొసంగు
మడుఁగులఁ బిడిచి క్రమ్మఱి, దేశికునకు సా
  ష్టాంగ దండప్రణామాళిఁ జేసి,
భూరుహచ్ఛాయలఁ బూఁబొదరిండ్లను
  నచలభావమున విద్యల నెఱుఁగు
గురుని యానతి జగద్గురుని యానతి గాఁగ
  నెంచి, నేవల గారవించు వలని
నలయక యడవుల ఫలసమిత్కుశతతి
  నడనునఁ గూర్చు నధ్యాపకునకు
నేఁడు సృష్టిఁ దా వీక్షించు కలతమునఁ
  బ్రకృతి పాఠముల నేర్పుకయె నేర్చు
వనమాలికలఁ బక్షివర్గంబు మృగకోటి
  గాఢసఖ్యానురాగమునఁ గాంచు
సాయాహ్న వేళలఁ జను వటువులఁ జేరి
  రమణీయ తరునికుంజముల పొంత
స్వచ్ఛందవృత్తి నిచ్చలుఁ దోఁచు నారోగ్య
  వాతపోతంబులఁ బ్రీతిఁ గ్రోలఁ
దనిసి శకుంతసంతతి కలారవముల
  నిసుక తిన్నియలపై నెనసి యాడుఁ
బసపడి నిర్మలాంభఃపూరములఁ గ్రుంకి
  సాంధ్యకృత్యమ్ముల సల్పి మునుదు
పుష్పసుగంధ తాంబూలముల్ గైకోఁడు
  ఛత్రంబుఁ బాదరక్షలను గొనఁడు
మద్రసోపేతభోజనము నాశింపఁడు
  కందమూలముల నాఁకటి నడంచు
కట్ట వలువఁ గాదు, కాపీనము ధరించు
  శయనించు నిశల భూశయ్య నొకఁడు

సత్యమోగాభిలాషి, వినమ్రవేషి
యక్షవిద్యారతుండు వాశాద్వేషుండు
సతులహితవ్రతుండు నిరామయుండు
జనకులకు నాటివిద్యార్థి సౌమ్యమూర్తి.

## నేఁడు

ప్రొద్దు పొడువ లేచుఁ బొగచుట్టకంపుతో
  వెలవెలనయి వెన్ను విఱిచికొనుచుఁ
బుడిపెఁడు నీట వాఁ బ్రక్షాళించునో లేదొ
  యపుడె హోటలునఁ బ్రత్యక్షమగును
కాఫీ యుపమ దోసె కారకిల్లీలతోఁ
  బ్రాతరాహ్నిక కార్యపటిమ నెఱపు
నావలఁ జెలికాండ్ర యాలాపములతోడఁ
  గడపు, తొమ్మిది కింటికడపఁ ద్రొక్క
నిలువుటద్దపు ప్రోల నిల్చి, దువ్వెన బూని
  నెత్తిబొచ్చు విదిల్చి నీటుసేయు
వివిధశాకంబుల వేఁపుడుఁ గూరల
  సమరింప శాల్యన్న మారగించు
నటుపైన రమ్యవేషాలంకరణమున
  గంటలు క్షణములకరణిఁ ద్రోయుఁ
బెనుసిగరెట్ట్యగల్ పెదవుల నటియింప
  పడిలహారాయల్ మీఱ బడికి నేఁగ
నచట నాచార్యబోధాళిపై రచియించు
  ఖండనోక్తుల మిత్రతండ ముబ్బ
పూరిపల్లెము వేఁడిబోండ లాంబడేలకై
  విరతి మొదవఁగానె పరుగువాఱు
సాయాహ్నమునఁ బాఠశాల వీడ్కొని, పూఁట
  కూటింటి లేనీరు చాలఁ గ్రోలి
తలుపరి నిరవునఁ దనకేశమును దించి,
  ముంగురు లొత్తి, మెఱుంగు రాచి,
కన్నుల నద్దముల్ కరమున బెత్తంబు
  కాళ్లలో జోళ్లు సింగార మొసఁగ
వెడలు వాహ్యాళికై వేద్య మావలఁ గొను,
  బ్రమిసి సినిమరంగములఁ గాంచుఁ
బదిగంటలుఁ బడుఁ గొంపకుఁ జని పాల్ద్రావి
  సఖులతో సరసభాషలు వెలార్చు
బీడాల బీడీలఁ బీల్చి పిప్పి యొనర్చి
  మెత్తపై నావెన్క మేను వాల్చు

క్రమభోగాభిలాషి, సగర్వవేషి
కుక్షివిద్యారతుండు కోర్కుల మగండు
నక్కలకుఁ జుక్క దుర్వ్యసనముల కిక్క
జనకులకు నేటివిద్యార్థి శమనమూర్తి.

# [౧]పకీరు – పాచ్ఛా

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

సర్వసంగపరిత్యాగియు సర్వశాస్త్రజ్ఞుఁడు మహాభక్తుఁడు నగు పకీరు (మహమ్మదీయసన్న్యాసి) కలఁడు. ఆతఁడు సభక్త్యావేశుఁడై గానము చేయు నపుడు వాయించుకొనుటకు 'కంధిరి' యను వాద్య విశేషమును సంపాదించుకొనెను. భిక్షాన్నమును స్వీకరించుట కొక కొబ్బరిచిప్పయు, కౌపీనవస్త్రము కాక మఱియొక యుపకౌపీనమును సంపాదించెను. ఇవియే వాని ధనములు. ఏమసీదునకో ప్రార్థనకుఁ జేయుచు క్షుత్పీడితుఁడైనపుడు మాధుకరాన్నముచే క్షుద్బాధ నడఁచికొనుచు నేమసముననో శీతవాతాతపబాధలఁ దీర్చుకొనుచు కాలక్షేపముఁ జేయుచుండెను.

అతని కొకసమయమున, 'శాస్త్రము లసత్యములు కావు. పరమేశ్వరుని నమ్మినవాని కెట్టి దుష్కరకార్యము లైనను సుకరము లగునను శాస్త్రములలోని యంశములు లోకమునకుఁ జూపింపవలయు'నను కుతూహలము కలిగెను.

అందులకై యాకంధిరీతని దలంచెను: 'ఈదేశ మేలు పాచ్ఛా (మహమ్మదీయచక్రవర్తి) కూఁతును నేను పెండ్లియాడుదు ననిన నెవరును నమ్మరు. అట్లు చేయుదునంటినేని యేమగునో చూతును గాక' అని తలంచి, మఱునాటి యుదయమునఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి కంధిరిని వాయించుకొనుచు పట్టణమున సంచరింపుచు పాచ్ఛాగారి కుమార్తెను నేను పెండ్లియాడుదు నోహో యని కేకలు వేయ నారంభించెను. అది యేమి యని పౌరు లడుగఁగా నీదేశ మేలు చక్రవర్తికుమార్తెను నేను పెండ్లియాడెద నని చెప్పసాగెను. అది వినినవారు నవ్వసాగిరి. కొందఱు హేళనము చేసిరి: మఱికొందఱు మందలించిరి. పకీరు పిచ్చివాఁ డనిరి. ఆపకీ రొకపట్టణమునసె కాదు, పల్లెలనె కాదు, దేశమంతటను చాటించెను. దానికిఁ గినిసి యమర్యాదాకరముగ నతఁడు వర్తించుచున్నాఁడు పిచ్చివాఁ డని తలఁచి రాజభటులు పిచ్చివాండ్ర వైద్యశాలలోఁ జికిత్సం జేయించిరి. నీరోగి యని వైద్యులు పరీక్షించి వదలిరి. పిమ్మట రాజద్రోహి యని రాజపురుషులు కారాగారమున నునిచి బాధించిరి. అందును నాతఁడు పాచ్ఛాకొమరితను పెండ్లియాడుదు ననుమాటను వదలలేదు. భక్తిసంకీర్తనములను మానలేదు. ఇట్లుండ నొకప్పుడు పాచ్ఛా కారాగారమును బరీక్షింప వచ్చెను. అప్పుడు కారాగారరక్షకులు పకీరుతో నీవు పాచ్ఛా వచ్చినసమయమున మిన్నకుంటివేని నిన్ను రేపె చెఱనుండి విడిచెదమని యూసఁగొలిపిరి. పకీ రేమియు ననక మిన్నకుండెను. పాచ్ఛా కారాగారమును జూడ వచ్చెను. శృంఖలాబద్ధుఁడగు పకీరు పాచ్ఛా కంటఁ బడఁగనే, 'ఓపాచ్ఛా! నీకుమారిని నేఁ బెండ్లియాడెద'ననెను. అదేమి యని పాచ్ఛా రాజపురుషులం బ్రశ్నింప, వారీతఁడు రాజద్రోహి యనిరి. కఠినముగా నిర్బంధింపుఁడని పాచ్ఛా వెడలిపోయెను. పకీరునకు నిర్బంధము లెక్కుడయ్యెను. అతని పట్టుదలయు నెక్కుడయ్యెను. రాత్రులు పకీరు సంకీర్తనములచే కారాగారము మాఱుమ్రోయుచుండెను. కారాగారస్థుల మనంబులు ప్రశాంతంబు లగుచుండెను. దురాత్ములు సదాత్ములు, భగవద్భక్తులు నగుచుండిరి. కారాగారవాసులు చేయు నేరములు తగ్గుచుండెను. చెఱనుండి విడుదలఁ గన్నవారు కారనుండి సంపాదించిన సద్బోధామృతరసమును దేశమున వెదఁజల్లుటచే దేశమున నేరములు తగ్గెను. అందువల్ల కారాగారమునకు వచ్చువారు తగ్గిరి. దండనాధికారులకు, కారా

---

౧. ఊకరసు, కీ. శే. మాతంగ్రిగారు నలువదియేండ్లకు ముందు నిష్పృహులై యాచించి కష్టపడుచు "చేండపాడు" గ్రామమున మహాలింగేశ్వరాలయమును గట్టించుచుండ, 'నిది మీకు దుర్లభము విరమింపుఁ'డని కొందఱు మిత్రులు నిరుత్సాహపఱుప, నొకప్పు డామిత్రులతోఁ జెప్పుచుండ వింటిని.

గారపాలకులకు పని తగ్గెను. ఈ యంశము క్రమముగా పాచ్ఛాకుఁ దెలిసి పకీరును సముఖమునకు రప్పించి గౌరవించి, 'నీ కేమి కావలయును' ననెను. 'నీ కూఁతును నా కిచ్చి పెండ్లి చేయవలయును' నని పకీ రనెను. పాచ్ఛా కిపుడు కోపము పోయి నవ్వు వచ్చెను. అపుడు వా రిట్లు సంభాషించిరి:—

పాచ్ఛా—(నవ్వుచు) నాకుమారిని పెండ్లియాడందగిన ఓలిని (పెండ్లికొడుకు కన్యాపిత కిచ్చు శుల్కము) నా కీయఁగలవా?

పకీరు—ఈయఁగలను. ఏమి కావలయును? ఎంత కావలయును?

పాచ్ఛా—పెద్దనిమ్మకాయలవంటి నూఱు మంచి ముత్యములు కావలెను. (దుర్లభమగు నిట్టి వానిఁ దేలేఁడని పాచ్ఛా తలంపు.)

పకీరు—ఈయఁగలను.

పాచ్ఛా—ఎంత కాలమునకుఁ దేఁగలవు?

పకీరు—కాలపు మితిని జెప్పలేను గాని తెచ్చుట మాత్రము నిశ్చయము. నేను తెచ్చునపుడు మీ రాజపురుషు లేయాటంకమును జేయరాదు.

వల్లె యని పాచ్ఛా పకీరును విడచెను.

పకీ రెక్కడ, నూఱు మంచిముత్యములు—అందును నిమ్మపండ్లంత యురువు కలవి,—తెచ్చుట యెక్కడ? పకీరు శాస్త్రము లందు దిరుగవేసెను. దక్షిణ సముద్రమున ముత్యము లుండునని తెలిసికొనెను. ఆ రత్నాకరవేలముం జేరెను. ఇసుకతో గట్టు వేసి శక్యమగునంత చెఱువు నేర్పఱచెను. తనయుంప కాపీనమును నడుమునకుఁ జుట్టెను. కందిరి నొకచోఁ బదిలపఱచెను. కొబ్బరిచిప్పతో సముద్రపు నీటిని దాను నిర్మించిన తటాకములోనికిఁ దోడ నారంభించెను. యాత్రాయాతజను లీవింతను జూచి యిదే మనిరి. సముద్రపు నీటిని దోడి సముద్రములోని మంచి ముత్యములం గొందునని పకీరు చెప్పెను. జనులు నవ్విరి. వెఱ్ఱివాఁడనిరి. వెఱ్ఱి వేయి విధాల నిరి. ఈతని యాయాసముం జూచి కొందఱు విచారించిరి. ముత్యములు దొరకకపోయినను చెఱువులో నీరింకినపిమ్మట నుప్పైన లభించునని మఱికొంద ఱనిరి. పకీరు రాత్రింబగళ్ళు కష్టపడి పనిచేయుచుండఁగ, వెక్కిరింతకు వేడుకకు మఱికొందఱుగూడ నాతనితో కూడ చిప్పలతో కుండలతో నీటిని దెచ్చి తటాకములోఁ బోయసాగిరి. కొన్ని దినాలకు తటాకము నీటితో నిండెను. కాని సముద్రములో నొక్కచుక్కయైన తగ్గినట్లు లేదు. పైపెచ్చు నీరు హెచ్చయి చెఱువుగట్టు తెగి నీరంతయు సముద్రమునకే చేరెను. అందఱు గొల్లున నవ్విరి. పకీరుమాత్రము నిరాశ నొందలేదు. మరల మునపటికంటె పెద్దగట్టును కొన్ని దివసములలో వేసి నీటిని దోడ నారంభించెను. అతని ప్రయత్నమునకు జనులు పరిహసించి యాతని ప్రయత్నమున కాటంకములఁ గలుగఁజేయుచు పిచ్చివాఁడ వనిరి. మీరే పిచ్చివా రని తనపనిని మానక పకీరు నీటిని దోడుచుండెను. ఎంత కష్టపడుచుండినను నియమిత కాలములలో భగవద్భజనము మానకుండెను. మాధుకరాన్నమున క్షున్నివారణము చేయుచుండెను. ఇట్లు కొంతకాలము గడువఁగా సముద్రుఁ డీతని పట్టుదలను భగవన్నామకీర్తనను జూచి మెచ్చి యాశ్చర్యపడి నల్లని దేహముగల వృద్ధబ్రాహ్మణవేషముతోఁ బొడసూపి పకీరును బలుకరించి యాతని వృత్తాంతము నడిగెను. అపుడు వారిరువురకు నిట్లు సంభాషణము జరిగెను.

సముద్రుఁడు—బాబా, నీ వెందులకు సముద్రపు నీటిని దోడుచుంటివి?

పకీరు—సముద్రములోని పెద్దముత్యములం గొనుటకు.

స—సముద్రములోని నీటిని దోడఁగలవా?

ప—తోడఁగలను.

స—ఎంత కాలమునకు?

ప—ఎంత కాలమునకో చెప్పలేను.

స—నీ కా ముత్యము లెందులకు?

ప—పాదుషాకూఁతుం బెండ్లియాడుటకు.

స—సర్వసంగపరిత్యాగివగు నీ కింకను పెండ్లి కావలయునా?

ప—(నవ్వుచు) నాకుఁ బెండ్లి యవసరము లేదు. కాని భగవంతుని నమ్మి పట్టుదల కలిగి పరోపకారముఁ దలపెట్టకున్నట్టి స్వల్పజనుఁడైన నత్యంతఘనకార్యముం జేయఁగలఁడను శాస్త్రధర్మమును లోకమునకుఁ జూపుటకే యిట్టి ప్రయత్నముం జేయుచుంటిని.

సముద్రుఁడాతని యుద్యమమునకు మెచ్చి, 'నేనే సముద్రుఁడను. నీయుద్యమమునకు మెచ్చితిని. నీకుఁ గావలసిన ముత్యములకంటె నధికమగు ముత్యముల నిచ్చెదనని యొకకెరటముద్వారా పకీరు కోరిన వానికంటె దశగుణమగునట్లు ముత్యములు పకీరుకాళ్లకడఁ బడునట్లు చేసెను.

మఱునాఁడావార్త గ్రామములోఁ దెలిసెను. ప్రజలత్యాశ్చర్యము నొందిరి. పకీరునకు బ్రహ్మరథము పట్టిరి. బండిచేసి యాతని ముత్యముల బస్తాలతోఁ గట్టి పదిల పఱచి రాజధానీపురమునకుఁ బంపిరి. కంచిరి వాయించుకొనుచు తన్మయుఁడై పకీరు సంకీర్తనములఁ బాడుచు కొలఁదిదినములకె రాజధాని నర్ధరాత్రమునకుఁ జేరియపుడె పాదుషామందిరమును బ్రవేశించి ఆటంకములేని యనుజ్ఞం గొమటచే నిద్రనుండి పాదుషాను లేపి బస్తాలతో నుండిన నిమ్మకాయల నురువున మించిన యాణిముత్తెముల దిమ్మరించెను. చక్రవర్తి యాశ్చర్యానందములతో నోడలు తెలియక కొంతవడి రిచ్చపడిఁ యెట్లీముత్తెములం దెచ్చితివి వన, పకీరు, 'నీకది యవసరము లేదు, రేపె నీకూఁతును నాకుఁ బెండ్లి సేతువా? లేదా?' యని నిర్బంధింపఁగా పాదుషా మాటఁ దప్పిన, మహాత్ముఁడగు నీపకీరువ కపకారము చేసిన దోషముచే తన సామ్రాజ్యమునకుఁ, దనకు నేమి ముప్పు కలుగునో యని భయము నొంది మఱునాఁడే పెండ్లిచేయుదునని యట్లె వివాహమునకుఁ దగు ప్రయత్నములఁ జేసి చాటఁ బంపెను. దేశదేశముల కీవార్త తెలిసి పాదుషా పకీరుతో సంబంధముచేయుట యత్యాశ్చర్య మనిరి. ఇది కల్లయనిరి. పాదుషాకు మతి పోయిన దనిరి. మఱికొందఱు పకీరు మహిమచే పాదుషాను మించినవాఁడె యనిరి.

ఎట్లయిన నేమి, లగ్నం బెల్లి వివాహముం గదిసె. పకీరు తనమహిమచే నెట్టి యలంకారమును ధరించునో చూతము గాక యని మహాజనులు కల్యాణమంటపముఁ జుట్టి మూఁగిరి. పకీరు పాచ్చాను కల్యాణమండపము కడకు తాఁ దెచ్చిన యాణిముత్యములం జేర్పుమని కోరెను. చూపఱుల కన్నులం మిఱుమిట్లు గొనులాగున ముత్యము లాకల్యాణమండపమునఁ బ్రోగుపోయఁబడెను. మీరలంకరించుకొని రావలయునని పాదుషా పకీరును గోరెను. పకీరు తన కేర్పఱుపఁబడిన గదిం జేరి భగవంతుని బ్రార్థించి ప్రార్థించి పకీ రెంతగ నలంకరించుకొనునో చూడ వేడుకపడుచుండిన కల్యాణమంటపము లోనివారికి ఆశ్చర్యము గలుగునట్లు గోచిని ధరించి, మఱి యొక గోచిగుడ్డను పైని వేసికొని కంచిరిని కొబ్బరిచిప్పను ధరించి పెండ్లియరుఁగుపైకి వేంచేసెను. సభాసదులం గొల్లున నవ్విరి. పాదుషా తన యల్లుఁ డిట్టివాఁడే యని మొగమును చిన్నచేసికొనెను. అపుడు పకీరు ప్రజలను ప్రభువు నుద్దేశించి యిట్లుపన్యసించెను:—

'మిత్రులారా! నాకుఁ బెండ్లితో నిమిత్తము లేదు. ఎంతటి యల్పుఁడుగా నుండినను భగవంతుని నమ్మి నేవింపుచు పట్టుదలతోఁ బనిఁజేసిన నెంతమహత్తర కార్యమునైన సాధింపవచ్చునను శాస్త్రములలోని వాక్యములను సోదాహరణముగాఁ జూపుటకే నే నీపనిని జేసితిని. పాదుషా కూఁతు నన్యవరున కిచ్చి పెండ్లిసేయ వచ్చును.'

పిదప 'నేఁ దెచ్చినముత్యముల నమ్మి యాద్రవ్యమును బధిరపంగ్వంధభిక్షుక జటిపరివ్రాజ కాద్యనాథులకును, సత్యజ్ఞానోపదేశములకు నుపయోగింపుమని పాచ్చాతోఁ జెప్పి భగవన్నామకీర్తనముఁ జేసికొనుచు నెటకో పకీరు వెడలిపోయెను. పాదుషా పకీరుయొక్క యుపదేశముల ననుసరించి సదనుష్ఠాన తత్పరుఁడై వన్నెకెక్కెను.

# ప్రణయసమాధి!!

"వనవాసి"

ఇపుడేదో ప్రణయార్చనావసరమే! ఈవిశ్వగర్భాంతరా
ళపవిత్రాత్మ, హిమాద్రికూట వలదేలాంశాల; గౌరీ త్రపా
స్నపిత ప్రేమతపః ప్రవాసము లటుల్, సర్వేశ సేవా ప్రసూ
నపరాగమ్ములు వోని దివ్యకళలన్ జల్లెన్ కకుప్పాళులన్

ఆశరదిందిరాసతి సుధామల కోమలచంద్రఖండమా
కాశపు పల్లెరాన వెలుగన్ తెలినవ్వుల పాలనోచి లో
కేశున కారతిచ్చు వలపించుచు వెన్నెల; లవ్వె వాసనా
పేశలధూమ రేఖలయి పేర్చెడు క్రొందెలి మబ్బుదొంతరల్.

ఆగగనాంకవాటుల సుధాసవ మత్తలు, శుభ్ర తారకా
రాగవతుల్, వియోగవిధుర శ్రుతి వెన్నెలతీవ వేణువుల్
మ్రోగగ నాలపించుపదముల్, దివిజాపగ దేలి హే:దా! ప్రే
మాగమగానశాలల లయమ్మవబోల్, జగదీశ్వరాత్మలోన్

ఈజ్యోత్స్నావలయమ్ము కమ్మగిలు దేవీ! మన్మనః ప్రేమసా
మ్రాజ్యంపున్ బొలిమేర నీవు పదపద్మాంకమ్ము లంకింప రా
గజ్యోతిః కళికావసంతరుచిమై; కాంతా ప్రఫుల్ల త్రపా
పూజ్యంబీ ప్రకృతి ప్రశాంతి బెళుకున్ బో! స్వాగతామోదముల్.

పానపాన విచ్చుభావములపుప్పొడి రేచుమనోవికాసమో
హాన సుషమామధూదయములో నను భూతులదేలునాత్మ, యా
వనశరదిందుడోల, ప్రసవాలస కౌముదిబాల. పాలతీ
యనియోదమై, సుధాశయ విహాయసముల్ జ్వలియింపజేయునో!

ఈవిపినాంతరాస్ఫుట సితేతరగర్భ నిలీన భావభా
గ్యావరణమ్ము లైతోణకులాడెడునీడల, నీలిమేడలన్,
నావిరహైకవేదనల నాటకరంగములంచు వ్రాలెడిన్,
దేవవధూకటాక్ష మృదుదీధితు లీనునుసోగవెన్నెలల్

జాదుల పాదులై గగనజాహ్నవి తీరములల్లు భావనా
మోదల తాకుటీర సుమమోహనశయ్యల, తారకామణీ
వేదుల, విశ్రమించెడు వివిక్తనిశాంకతలాల, కమ్మగా
బ్రోది యొనర్చినాడ నెలపూతల జవ్వనపుంగలల్ సతీ!

మలయసమీరుతో వలపుమంతన మాడదలంచి యంతల
జ్జిలుదునొకప్డు; మవ్వములచిత్తడి జిత్తరువుల్ లిఖింప. తీ
పులతలపుల్ గపోలముల, పొంగెడునార్ద్రమనోనురక్తి మ్రు
చ్చిలి మెల సంజకెన్నెకయి నేసి కొనం, దిలకింతు గోలనై.

మత్తిలి భిల్లమానినులు మానసమేచు వసంతరాత్రులే
నెత్తములందొ, వెన్నెలలునిండిన దిగ్వలయప్రశాంతులం,
క్రొత్తవిరాళికోయిలలు క్రోల్చినటుల్ విలపింప దేలును
న్మత్తదనాల మేపుదు సమీరకుమారుల పూలపాటలం.

వేసవి శేలరేగి, యుడువీధుల నుక్కిరిబిక్కిరై, తమో
రాసుల దూసికొం చెరుగరాని ప్రశాంత నిశానిశాంతసీ
మాసువిశాల చంక్రమణమాంసల భావవిహారముల్, మదీ
యానమచిత్తవృత్తులిరుకై యెద పిల్లుగ పిక్కటిల్లుటల్

అతిసుకుమారి గండఫలకాచ్ఛ మనోంతర భావబింబసం
గతులటు ఈసరిద్ధృదయగాన విలీనప్రసన్న చంద్రికా
మృతరుచు లానియాని, చలిశేలను రేగడు రాగతృష్ణ, నా
బ్రతు కొకభ్రాంతినై విరియు స్వాప్నికసౌఖ్య సుధాతుషారముల్.

ఏదిక్పుణ్యపురంధ్రి తీర్థములు సేవింపం సుధా జీవనా
స్వాదశ్యామకళాభిరాములయి, స్వేచ్ఛాగాములై. ప్రావృడం
భోదస్వాములు వత్తురో, వినుతురా పుణ్యక్షేత్రమాహాత్మ్యము (?)
ర్యాదల్ నాహృదయప్రశాంతికయి, గర్జాఘోష సందేశముల్.

---

# నిరుద్యోగము

సి. హెచ్. లక్ష్మణరావు గారు, బి. ఎ., బి. ఇ. డి.

ఈ కాలంలో మునుపటికంటె చదువుకున్న వారు హెచ్చుగానే వున్నారు గాని, ఇదివరకల్లా "'ఓ' అంటే 'న' రాదు, నువ్వు ఏవూరెళ్లి పుటంవేసినా దమ్మిడీఅయినా చిక్కదు" అనేవాళ్లంతా, "నువ్విప్పుడు బి. యే. ప్యాసయితేమాత్రం నీ కెవ్వ డుద్యోగం ఇస్తాడయ్యా" అనేవాళ్లే. నూరుసంవత్సరాల్లో కాలం ఇట్లా మారిపోయింది. పెళ్లికొడుకుల్లో బి.యే. గాని, బి. యల్. గాని, యం. బి. గాని చదువుతూన్నాడంటే గొప్ప హెచ్చు, కట్నం హెచ్చు; ఎంచేతంటే, ఏమో ప్యాసయినతర్వాత ఎంవూడ పొడిచేస్తాడో అని. అంటేగాని, బి. ఏ., ప్యాసయ్యేడని గాని, బి. యల్. పట్టా పుచ్చుకున్నాడనిగాని, యం. బి. అయిందనిగాని వింటే గొప్పేం లేదు. ఎంచేతా? ప్యాసయితే ఇప్పు డేం చేస్తున్నాడనే ప్రశ్న వస్తుంది. ఇంటిదగ్గర కూర్చుని తింటున్నాడా? లేక దుకాణం పెట్టేడా? అని అడుగుతారు.

ఐతే మనస్థితి ఇట్లా మారటానికి కారణా లేమిటో కొంచెం వెతకాలి. మొదట్లో యీఇంగ్లీషువిద్య నేర్చుకొన్నవాళ్లు కొంచెమందే వుండేవాళ్లు. అంచేత వాళ్లకు వెంటవెంటనే, నెత్తిమీద పెట్టుకొని వుద్యోగాలిచ్చే వాళ్లు అన్నిశాఖల్లోనూ. రానురాను, ప్రతీతండ్రికి తన కొడుకు గొప్పకీర్తిగా డవాల్ని వుంటుంది గాబట్టి, కొడుకులికి ఆవిద్య నేర్పిస్తూవచ్చేరు. చిరస్నేహితులయిన ఇద్దరు చాలాకాలం విడిపోయి తిరిగీ కలుసుకున్నప్పుడు "ఓహో !" అంటే "ఓహో!!" అనుకోంగానే, "మీవాళ్లంతా క్షేమంటా? అప్పుడూ, మీకు ఇద్దరు మొగపిల్లలు, ఒక ఆడపిల్ల గదూ?—అయితే పెద్ద వాడేం చదువుతూన్నాడేమిటి?" అని అడగడం; "అబ్బే! ఏదో ఇంటర్మీడియటు చదువుకున్నాడు, రెండోవాడు చిన్నవాడూ, ఏదీ ఇంకా ఫోర్తుఫారంలో వున్నాడు-"

"మరేం. ఇంక రెండేళ్లలో మీరు కాళ్లు ముడుచుక్కూచుంటే మీవాడు గడించి పోస్తూంటాడు. మీరు మంచి అదృష్టవంతులండి. అయితే పిల్లకి పెళ్లి డొచ్చింది గాబోసు, పెళ్లి చేసేరా?"

"ఆఁ, చేసేనండి, మొన్ననే మాఘమాసంలో. బందరులో బి. యే. చదువుతూన్నాడండి."

"ఇంకేం. మీ రెల్లాగైనా గడుసువాళ్లండీ—"

ఇట్లా మాట్లాడుకోవటం అలవాటై యున్నాది. చదు వుంటే ఇంకేం అక్కరలేదు. బి. ఏ. ప్యాసయితే వాడింక గొప్పవాళ్లల్లో జమే. ఇల్లాంటిరోజులు మొన్నమొన్నటిదాకాకూడా వుండేవి. అల్లాంటిమనుష్యులు ఇప్పుడుకూడా లేకపోలేదు.

ఈవిధంగా ప్రతీతండ్రీ తనపిల్లవాణ్ణి ౫ ఏళ్లు రాంగానే బడిలో వెయ్యడం, మెల్లిమెల్లిగా రెండేళ్లు ఎలిమెంటరీస్కూలులో అయినతక్షణం, కొంప మునిగిపోయినట్లు, తెలుగంటే ఏమిటో తెలియకుండా వున్న కుర్రవాణ్ని, ఆసర్టిఫికేటు చింపేసి, ప్రైవేటుస్టడీ అని చెప్పి ఏ హైస్కూలులోకో తీసుకువెళ్లి ఫిఫ్తు క్లాసులోనో, లేక ఫస్టుఫారంలోనో ఏకోవిధంగా (అనేకమార్గాలున్నాయి లెండి) జేర్పిస్తారు. ఇదంతా ఎందుకు? వాడేమిటో బి. యే. ప్యాసయితే తన్నుద్ధరిస్తాడని. అప్పు సొప్పు చేసి, ఆవూళ్లో కాలేజి లేకపోతే ఏ గుంటూరో, బందరో, లేక మద్రాసో పంపించడం అలవాటయిపోయింది. ఊళ్లోనేగదా కాలేజి వుంది, బి. ఏ. అవనీండి, తర్వాత చూసుకుందాం అనే వాళ్లు కొంతమంది; బి. యే. ప్యాసయితే వుద్యోగమే దొరకదా? అనేవాళ్లు కొంతమంది. ఈవిధంగా ఓవుద్యోగం అని అనుకోకుండా, అందరూ ఏదో ఒకటి దొరుకుతుందని, పిల్లవాండ్రకు బి. యే. దాకా చదువులు చెప్పిస్తూవచ్చేరు. ప్రతివాడు "నాకొడుక్కి బి. యే. ప్యాసయితే వుద్యోగం దొరకదా" అనుకుంటూ "నే నొక్కడినే గాదా, నీళ్లుపోస్తే ఏమవుతుంది" అని అను

కుంటూ పాలకు బదులు నీళ్లే పోసిన కోమట్లలాగ, చివరకి అందరిపిల్లలూ అందరూ బి. యే. వరకు చదువు చెప్పిస్తూవచ్చేరు.

ఇది గాక గవర్నమెంటువారుగూడ హైస్కూళ్లకైతేనేమి, కాలేజీలకైతేనేమి, గ్రాంటులు ఇస్తూవుండడమువలన, ప్రతిపల్లెటూళ్లోను ఒకహైస్కూలు, ప్రతి జిల్లాకు షుమారు ఒకకాలేజి (కొన్నిట్లో రెండు, మూడు కూడా వున్నాయి) లేచేయి. హైస్కూలుచదువు కాగానే కొంచెం పెట్టుబడి పెట్టగలిగివుండే ప్రతీవాడూ కాలేజీలో జాయినవడమే పద్ధతయిపోయింది. యీవిధంగా ప్రతీకాలేజినుండి సంవత్సరానికొకమారు 80 మందికి తక్కువ లేకుండా బి. యే. లు తయారౌతున్నారు. పాపం, కొన్నేళ్లు గడచినతరువాత గవర్నమెంటువారనండి, లేక యూనివర్సిటీవారనండి, ఎవరో ఒకరు, ఒకసారి తప్పినవాళ్లమీద దయ తలచి, తిరిగి ఒకసంవత్సరం చదువనక్కరలేకుండా ఇంటివగ్గర కూర్చునే చదువుకొని పరీక్షలకు వెళ్లవచ్చునని సెప్టెంబరుపరీక్షలంటూ కల్పించేరు. యీ రెండోరేవులో వాళ్లనికూడా కలిపితే మొత్తంమీద సంవత్సరానికి కనీసం ౧౦౦ మందైనా తయారౌతూ వచ్చేరు. స్కూళ్లు కాలేజీలతోపాటు యూనివర్సిటీలు కూడా హెచ్చయినాయి. ఆ సంవత్సరాల్లో మదరాసురాజధానిలో రెండు కొత్త యూనివర్సిటీలు లేచేయి. ఆంధ్రయూనివర్సిటీలో ౧౦౦ మంది బి. యే. లు తయారైతే, మద్రాసు యూనివర్సిటీలో ౧౫౦ మంది తయారు, అన్నామలైలో ఓ ౨౫ మంది. ఎంత తగ్గిద్దామన్నా మొత్తాన్ని ఓ ౩౦౦ మంది అవుతారనడానికి సందేహం లేదుగదా?

అయితే సంవత్సరానికి తయారైయే యీ రెండువందలమంది బి. యే. లకి వుద్యోగాలు కావాలంటే, ఆకాశంమీంచి కురుస్తాయా, లేక చెట్లనుండి పండుతాయా? లాయరవుదామంటే వీధివీధికి పదేసి బోర్డులు. దేశక్షేమంకోసం, ఎంత జట్టీలు, కూనీలు (ఒక వేపు హెచ్చు అవాలని కోరుతూ) మాన్పినా, ఇంతమంది ఎందుకూ? డాక్టర్లతోపాటు రోగాలుకూడా హెచ్చవుతున్నాయి. చదువుక్రింద తగలేశిన రు ౫,౦౦౦ లు కాకుండా ఇంకో రెండువేలు పోస్తేనే గాని దుకాణం పెట్టడం కుదరదు. పెట్టినా వడ్డీడబ్బులేనా కిట్టవు. పాపం ఒకటిమాత్రం నిజం. స్కూళ్లు, కాలేజీలు, సంవత్సరానికి రెండేసిపరీక్షలు, ఇట్లా ఇవన్నీ హెచ్చవడంవల్లమాత్రం కొంచెం మేష్టరీవుద్యోగాలు దొరుకుతూ వచ్చేయి. అయితే దాన్లో ఒకకష్టం వుంది. ట్రయినింగవులేనే గాని మేష్టరుపని ఇవ్వరు. మేష్టరుగా కొన్నాళ్లయినా పనిచేస్తేనే గాని ట్రయినింగు కాలేజీలోకి రానివ్వరు. యీవిధంగా బి. యే. లు హెచ్చయిపోవటం జూచి మేనేజర్లు కూడా రేటు రు ౫౦ కి, కొన్ని స్కూళ్లల్లో రు ౩౫కి కూడా తగ్గించేసేరు.

అందుచేత స్కూలుఫైనలు ప్యాసయినవాళ్లు దరఖాస్తు చేసే వుద్యోగాలకికూడా బి.యే. లు అప్లయి చేయడము మొదలుపెట్టేరు. తాలూకాబోర్డు ఆఫీసులో గుమాస్తాగిరీకి, మ్యూనిసిపాలిటీలో గుమాస్తాగిరీకి, రిజస్ట్రారుఆఫీసులో గుమాస్తాగిరీకి, ఒకటేమిటి ఆఖరుకి ప్రైవేటుసంస్థానాల్లో గుమాస్తాలపన్లకి కూడా అప్లయి చేయడం మొదలుపెట్టేరు. ఒక స్కూలుఫైనలు కాండిడేటు అప్లికేషనుతోపాటు బి. యే. దికూడా ఒకేపనికి వస్తే, ఎవళ్లకి ఇవ్వాలనుకుంటుంది మీరే చెప్పండి. ఈ విధంగా యీ బి. ఏ. లు పాపం, స్కూలుఫైనలుకంటె హెచ్చు చదవలేని వాళ్లనోట్లో మన్నుకొట్టి వాళ్లకూడా వుద్యోగాలు లేకుండా చేసేరు. కాబట్టి వాళ్లో కొందరు యీనిరుద్యోగపు డిపార్టుమెంటులో చేరేరు. సరే, ఇక నయింది. ఇప్పుడు ఆ ఆఫీసులుకూడా బి. ఏ. లతో నిండిపోయేయి. ఒకసంవత్సరంలో తయారయిన ౩౦౦ మందికే వుద్యోగాలు దొరకక అఘోరిస్తూవుంటే ఇదేం చూసుకోకుండా ఫ్యాక్టరీల్లో వేరుశెనగ కాయల బస్తాల్లాగ ఊరికే సంవత్సరం సంవత్సరం బి. యే. లని తయారుచేసి పారేస్తున్నాయి, యీ యూనివర్సిటీలు. డిమాండు తక్కువ, ప్రొడక్షను ఎక్కువ. అందువల్ల ఫలితం అందరికీ తెలిసిన విషయమే—వస్తువ చవకైపోవడము. స్టాకు అట్టే మిగిలిపోతూంటే, ఎందుకూ యీ ఫ్యాక్టరీలు ఊరికే ఆడటం? లాంకషైరులో బట్టలు తయారుచేసే మిల్లులు ఏం చేసేరు ఇప్పుడు, విదేశబట్ట

నెల్లుబడి ఇండియాలో తక్కువయి పోయినప్పుడు? అట్లాగే యీ యూనివర్సిటీలు కూడా కొన్ని సంవత్సరాలు మూసివేయకూడదా?

అయితే ఇంతమందికి వుద్యోగాలు దొరకక పోవడమునకు కారణం వెతకవలసివుంది. దేనిలో వుందీలోపం? అంటే బాగా ఆలోచిస్తే ప్రస్తుతపు విద్యావిధానంలో వున్నట్లు కనిపిస్తుంది. మన స్కూళ్లలోను, కాలేజీలలోను నేర్పేవిద్య ఉద్యోగాలకి పనికివచ్చే విద్యగాదు. మనోవృద్ధిని, జ్ఞానవృద్ధిని కలుగజేస్తుంది. అంతే కాకపోతే $a^2-b^2=(a+b)(a-b)$, $Cos^2A+Sin^2A=1$, మళ్లీ మేష్టరుగా వుద్రవాళ్లకి నూరిపోయడానికి తప్ప మరెందుకూ పనికిరావు. పూర్వకాలం బి. ఏ. లు చాలా తక్కువగా వుండడము వలన అన్నీ పెద్దపెద్దవుద్యోగాలు దొరుకుతూ వుండేవి. కొంతమంది తహశ్శీల్దారులుగాను, బి. యల్. కూడా ప్యాసయినవాళ్లు జడ్జీలగాను, కుదురుకున్నారు. అప్పటికాలంలో బి. ఏ. ప్యాసయి వుండాలని రూలు లేదు గాని, ప్యాసయినట్లయితే వెంటనే వుద్యోగాలు వచ్చేవి. ఇప్పుడో, యీ బి. ఏ. లు ఎచ్చయిపోవడం వలన, ఇదంతా కనిపెట్టి కార్పొరేషను సుమాష్తాగా వుండాలన్నా, సరే, కనీసం బి. యే. ప్యాసవాలన్న నిబంధనే. ఏ వూరు పేరు లేని ఆఫీసులో పనిచేద్దామన్నా బి. ఏ. ప్యాసయివుండాలి. అచ్చాఫీసులో వుద్యోగం కావలసివున్నా బి. యే. ప్యాసయివుంటే మంచిది. ఇన్సూరెన్సుకంపెనీ ఏజంటుగా పనిచెయ్యాలనుంటే, బి. యే. క్వాలిఫికేషను కావాలి. దీనికి దానికి అని లేదు. ఫిజికలు డైరక్టర్లు, డ్రాయింగు మాష్టర్లు, మాన్యూఅలు ట్రెయినింగుమాష్టర్లు, రైల్వేమాష్టర్లు—అంతా బి. యే. ప్యాసయివుంటే త్వరగా రు. ౩౫ వుద్యోగం దొరుకుతుంది. వీళ్లంతా బి. యే. ప్యాసయివుంటే, స్కూలుఫైనలు ప్యాసయినవాడి కంటె ఏమి గొప్పో తెలియదు. మాటవరసకి ఒకటి తీసుకుందాం. ఫిజికలు డైరక్టరు వుద్యోగం చేసేవాడు బి. ఏ. ప్యాసయితే డ్రిల్లుచెయ్యడానికి ఎందుకేనా వుపయోగిస్తుందా చెప్పండి. సర్కసులో బారుమీద మొగ్గలు వేసేవాడు బి. ఏ. పాసయితే బాగా మొగ్గలు వేస్తాడంటారా? (పాపం వాళ్లఖర్మమా అని వాళ్లుకూడా వాళ్లయాక్టర్లని బి.ఏ.ప్యాసవాలనికోర లేదు.) బి. యే. లో చదివిన ఆషేక్స్పియరు, షెల్లి, డ్రైడెను, మిల్టను, యీవుద్యోగాల్లో పనికొస్తాయా? ఆ రేఖాగణితం, ఆ కేల్కుల్యలేవన్లు; ఆ హీటు, లైటు, ఎలక్ట్రిసిటీ, మేగ్నిటిజము పనికొస్తాయా? ఆ ఓజోను, హైడ్రోజనుపెరాక్సయిడు, అటామిక్కుథియరీ పనికొస్తాయా? ఆసైకాలజీ, లాజిక్కు పనికొస్తాయా? ఏదీ పనికిరాదు. ఇంటర్మీడియటు ప్యాసయితే బి. ఏ. కి పనికొస్తుంది. బి. యే. ప్యాసయితే, యం. యే. కి పనికొస్తుంది. యమ్. ఏ. ప్యాసయితే ఎందుకూ పనికిరాదు. అంతే దాని కర్థం. 'సిటిజను' అనుపించుకోవడానికి తగిన క్వాలిఫికేషన్లు యీ బి. ఏ. ప్యాసయినవాళ్ల కేమయినా వున్నాయేమో పోనీ చూదాం. బి. యే. ప్యాసయినవాడి కెంత కాన్స్టిట్యూషనలు హిష్టరీ (వివిధదేశ పరిపాలనావిధానము) తెలుసునో, స్కూలుఫైనలువాడికి అంతే తెలుసును. తనదేశముయొక్కనై తేనేమి ఇతర దేశములయొక్కనై తేనేమి ఔన్నత్యమును తెలుసుకొనుటకు ఇద్దరు ఒకేపుస్తకములను తిరిగి పఠించవలెను. బి. యే. ప్యాసయినవాను, ఏవుద్యోగమునకైనను కనీసము యిద్దు ప్యాసయివుండవలెను, నాదేశస్థితి యిట్లున్నది, నే నిట్టి స్థితియందు దున్నాను, దేశముపట్ల నావిధి ఇద్ది అని యనుకొందు మన్న ఏమున్నది? దీనియందు ఏభాగమందు భూచనను అన్ని మన్న. అయితే మరి బి.యే. వరకు [illegible]విద్యవలన ప్రయోజన మేమి? ఉద్యోగములకా పనికిరాదు. దేశముసంగతు లెరుంగుటకా పనికిరాదు ఈవిధముగా ప్రస్తుతపువిద్యావిధాన మున్నది.

కాబట్టి ప్రస్తుతపు విద్యావిధానము నామూలాగ్రముగా మార్చినగాని మన కీనిరుద్యోగమునుండి విముక్తి గానరాదు. ఈవిద్యను మార్చి ప్రతిజిల్లాలోను పారిశ్రామికవిద్యాలయములను నెలకొల్పి పారిశ్రామికవిద్య (Industrial Education)లను నేర్పుచు, వానికి తోడు మేధావృద్ధికొఱకు ఇతరభాషలను, ఇతరశాస్త్రములను అప్ప నలుగా నేర్పుచు, దేశచరిత్ర, భూగోళము, స్వదేశ

పరిపాలనావిధానము ప్రతివిద్యార్థికి తప్పక నేర్పుచు, ఆపారిశ్రామికతరగతులలోనే పెద్దపెద్దతరగతులను నియమించిన, ఏపరిశ్రమయం దిష్టము గలవా డాపరిశ్రమను జదివి, దానియందలి పెద్దతరగతియం దుత్తీర్ణుడై, దానియందే యుద్యోగమును పొందగలడు. ఏవుద్యోగమునం దున్నను దేశస్థితిని దెలిసినవా డగును; కొంచెమో గొప్పో దేశాభిమానియు గావచ్చును. అట్టివానిచే నిజమైన పీటి జను అనవలయును. ఈరీతిగా పారిశ్రామికవిద్యలను నేర్పుచు, దేశీయుల కుద్యోగముల నిప్పించు దేశము లిప్పుడు లేకపోలేదు. అట్టివాటిలో అమెరికాను, జర్మనీని పేర్కొనవలసియున్నది. కాబట్టి ప్రస్తుతపు విద్యావిధానమును మార్చునంతవరకు, యీనిరుద్యోగసమస్య మనలను బాధించుచునే యుండును.

---

## నాళీకము

దొండపాటి రామమూర్తి గారు

ఇనుఁ డాత్మేశ్వరుఁ డందరా కరుగుఁ దా నెల్లప్పుడం చెంచియో?
నిను లెక్కింపక సౌఖ్యంచుండు ననియో? నీచగ్రహావాప్తిమై
వనయం బప్రియుఁ డక్షియుగ్మమున కుగ్రాలోకనుం డౌట నం
చునో? యేలా గొన నీ ధ్వజానుసరణౌత్సుక్యంబు నాళీకమా!

కవి నా నొప్పుచు నవ్వలం బడి భవత్కారుణ్య మార్జించి నీ
దవు సర్వస్వముఁ జూఅలాడు విపవిఖ్యాతప్రభావోదయున్
ధవనామప్రతిహస్తవారణములన్ దప్పించెదే భర్త్సపా
దవిఘాతమ్ములనుండి యాశ్రితపరార్థం బొప్ప, నాళీకమా?

---




## ఆంజనేయస్వామి

వి. ఆర్. ఆర్.

అనగనగా ఒకఊరు. ఆఊళ్లో ఒకతలారి వాడికి ఆంజనేయస్వామి అప్పుడప్పుడు ఒళ్లిపైకి రావడం అలవాటు. ఆసమయంలో వాడు ఆఊరి రైతులను జడిపించి కల్లు, సారాయి తెప్పించుకొని తాగడమే కాకుండా కాళ్లకు మొక్కించుకునేవాడు కూడాను. ఎదురుచెబితే స్వామికి కోపం వస్తుందనే మూఢవిశ్వాసంతో రైతులంతా వాడి యిష్టప్రకారం నడుచుకునే వాళ్లు. ఆఊరికరణం చాలా గడుసరి. తలారి వాడు చేసేపని అతనికి బొత్తిగా యిష్టంలేదు. అంచేత ఎలాగైనా తలారివాడికి శృంగభంగం చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. నియోగి బిడ్డ కాబట్టి దొడ్డఉపాయం ఒకటి కనిపెట్టి సమయంకోసం ఎదురుచూస్తూ ఉన్నాడు. ఇలా ఉండగా శ్రీరామనవమి వచ్చింది. ఆరోజు మామూలుప్రకారం తలారివాడు ఒళ్లుపూని బజారువెంబడి పరవళ్లు తొక్కుతూ బయలుదేరాడు. తీరాకరణంగారి యింటిదగ్గరికి వచ్చేసరికి కర్ణంగారుకూడ జుట్టువిరబోసుకొని పంగనామాలు పెట్టుకొని, శంఖం ఒక చేతా, చక్రం ఒకచేతా పట్టుకొని తలారివాడికి ఎదురుగా నిలబడి,



"ఒరే! నన్ను ఎరగవట్రా! శ్రీరాముల వారినిరా" అన్నాడు. తలారివాడు తక్షణం సాష్టాంగపడి లేచి చేతులు జోడించుకొని,



"అపరాధం, అపరాధం. దాసుడి తప్పు మన్నించాలి. చాలాకాలం జరిగింది కాబట్టి తమర్ని గుర్తించలేక పోయాను. దాసుడితో ఏమయినా పనివుంటే సెలవియ్యండి" అన్నాడు. కరణంగారికి పొలం తనిఖీపని ఉంది. అంచేత ఇదే సమయం అనుకొని,

"ఆంజనేయా! నన్ను భుజంమీద ఎక్కించుకొని పొలంలో తిప్పు" అన్నాడు. తలారివాడు కిక్కురుమనకుండా కరణంగారిని భుజం మీద ఎక్కించుకొని పొలంలోకి వెళ్లాడు. కర్ణంగారు స్థూలకాయులు గాబట్టి కొంత దూరం తిరిగేసరికి తలారివాడికి భుజం నొప్పెత్తిబుస వచ్చింది. అయినా కరణంగారు విడువ లేదు. పైగా,

"ఆంజనేయా! ఏడు సముద్రాలు ఎగిరి దాటిన నీశక్తి ఏమయిందీ? త్వరగా నడూ" అంటూ శంఖంతోటి నెత్తిమీద పొడవడం మొదలెట్టాడు. పాపం! తలారివాడికి ఒళ్లంతా ముచ్చెమటలు పోసినాయి. కాళ్లు ముందుకు సాగలేదు. 'చచ్చాను బాబో' అనుకొని కరణం గారిని కిందికి దింపి కాళ్లు పట్టుకొని,

"బాబూ! బుద్ధి వచ్చింది. ఇలాంటి తెలివి తక్కువపనులు ఇంకెప్పుడూ చెయ్యను. కాస్తే కాయండి, కోస్తే కోయండి. మీదే భారం" అన్నాడు. కరణంగారు లోలోపల నవ్వుకుని తలారివాడిని చీవాట్లుపెట్టి ఇంటికి పంపేడు.

కథ కాశీకి వెళ్లింది.




కనకదండి గోపాలకృష్ణశాస్త్రీగారు

అనగాఅనగా ఓవూళ్లో ఓబ్రాహ్మ డుంటూండేవాడు. ఆయన చాలా బీదవాడు. ప్రతి యింటికి వెళ్లి అడుగుకుని తింటూండేవాడు. ఇల్లా వుంటూంటే సంక్రాంతిపండుగలు వచ్చాయి. ఆరోజున పెంద్రాళే లేచి, "ఏమే! ఈవేళ పెద్దపండుగ. చాలాబియ్యం, మినప్పప్పు తెస్తాను. మినపరొట్టె కాల్చు బాగాను" అని బయలుదేరి వెళ్లి, తెచ్చి భార్యచేతి కిచ్చాడు. అవన్నీ రుబ్బి రొట్టెలు కాల్చింది. ఐదురొట్టెలయాయి. రాత్రి తిందాం అనుకున్నారు. రాత్రి భోంచేసి ఇల్లంతా సర్దుకునివచ్చి భార్యేవాటాలు వేసింది, ఆయనకి రెండు, తనకిమూడు రొట్టెలచొప్పున. ఆబ్రాహ్మడు అది చూచి "ఏమే! ఊరంతా ముష్టెత్తి, సరకులన్నీ నే తెస్తే రెండేనా నాకు? మూడోది నాకియ్యి"అన్నాడు. "అదేంమాట? చచ్చిచెడి రుబ్బి నిప్పదగ్గిర కూర్చుని కాల్చిన దాన్ని నేను. అంచేత మూడోరొట్టె నా"దంది భార్య. ఇల్లా కొంతసేపు వివాదం జరిగింది. ఆఖరికి భర్త "నే చెప్పినట్లు చెయ్యి. ఏదెబ్బలాటలే"దన్నాడు. "సరే చెప్పు"అంది. ఇద్దరంకూడా చెరొకగోడకి కదలకుండా చేరబడి నిలబడదాం. నారొట్టెలు నాదగ్గర, నీరొట్టెలు నీ దగ్గర పెట్టి ఐదోరొట్ట మధ్యపెట్టు. ఎవరు ముందర మాట్లాడితే వారికి రెండేరొట్టెలు. మాట్లాడని వారికి మూడురొట్టెలు"అన్నాడు. 'సరే'నంది. ఇద్దరు అల్లాగే నించున్నారు. తెల్లవారింది. సాయంత్రం అయింది. ఎవరూ కదలరు, మెదలరు, మాట్లాడరు. మాట్లాడితే రొట్టె పోతుంది. ఇంతట్లో కుక్క ఒకటి గోడదాటి లోపలకివచ్చి పరకాయించి చూచింది. ఎవరూ కదలటం లేదు. ఆరొట్టెలు ఐదూ తినేసింది. మాట్లాడితే రొట్టెపోతుందని బెంగ. తెల్లవారింది. ఎవరూ కదలడంలేదు. ఇంటిపక్కవాళ్లు వీళ్లగుమ్మంలో ముగ్గు ఏమీ లేకపోవటం చూచి వీ ళ్లేమయారని అనుమానాలుపడి, నాలుగిళ్ల వాళ్లూ వచ్చి తలుపుతోశారు; పిల్చారు. ఏమీ కేక రాలేదు. కొందరు గోడ దిగి లోపలికి వచ్చి చూచారు. శవాలవలె ఉన్నారు ఇద్దరూ కూడాను. అం

తా వాళ్లను చూచి "ఏదో విషం పడింది కాము సు అన్నంలో; ఆఅన్నం తినడంచేత చచ్చా" రని అనుకొన్నారు. అందులో కొందరు ధర్మా



"ఎవరూ కదలటం లేదు......ఐనా తినేసింది"

త్ములు లేచి. "బ్రాహ్మణ కొంపలదగ్గర శవా లుండకూడదు. లాగేదాం రండో"యని ఇద్ద రిని శ్మశానాన్కి తీసుకుపోయారు. ఇదంతా చూచేసరికి పీడికి గుండెలు బేదారై పోయాయి. "ఐనా చూతాం ఇంకా"అని బిగించుకుని కూర్చున్నాడు. నలుగురూ 'ఊ అంటే ఊ' అని అనుకొన్నారు. ధైర్యంగలవా డొకడు నిప్పు తెచ్చి బ్రాహ్మడి తలకింద పెట్టాడు. బ్రాహ్మడు "ఇంక ఊరకుంటే లాభం లేదు. బ్రతుకుంటే బలుసాకు తిని ఉండవచ్చన్నారు. రొట్టె పోతే పోయిం" దని "చచ్చానర్రోయ్ బాబో!"అని గంతేడుగుభాలుమని. భార్యవింది. కట్లు విప్పుకుని దభాలున లేచి "నాకు మూడు రొట్టెలు,ముందర నీవు మాట్లాడావు"అంది.అది చూచి అంతాహడిలిపోయి పరుగెత్తారు."భయ పడకండి, దెయ్యాలము కాము. మీరంతా నాకు మూడో రొట్టెని ఇప్పించా"లని కేక వేసింది. అంతా వచ్చి 'రొట్టేమటి'అని అడిగారు. బ్రా హ్మడు పెద్దపందుగనాడు జరిగినసంగతంతా చెప్పాడు. నలుగురూ ఇద్దరినీ చీవాట్లు పెట్టారు. "ఆడముండ ఎంత ఘట్టిదిరా"అని అనుకుంటూ ఎవరిదారిని వారు వెళ్లారు. వీళ్లిద్దరూ ఇంటి కెళ్లారు. కథ కంచి కెళ్లింది, మనం ఇంటి కొచ్చాం.

---

## యముడు

కొండేపూడి లక్ష్మీనారాయణగారు

అనగనగా ఒక బ్రాహ్మణుడు. అతనికి ప్రపంచము వదలి తపస్సు చేసుకోవాలని అభి లాషగా ఉండేది. ఎట్లాగైతేం కొంతకాలానికి దండకారణ్యం ప్రవేశించాడు. అక్కడ గౌత మీనది ప్రక్కను పర్ణశా లొకటి కట్టాడు. అందులో అతని నివాసం. ఆ చుట్టుప్రక్కల నుండే మునిబాలకుల స్నేహం సంపాదించాడు. అక్కడ ప్రొద్దున్నే ఈశ్వర స్తవంతో లేవడం, తన స్నేహితులు తనూ కలసి నదిలో స్నాన మాడ్డం, సావిత్రిగాయత్రీలు జపించడం, తరు

# విశాఖపట్టణపు టోడరేవు చిత్రములు



౧. ఓడరేవు నిర్మాణము

వాత దైవకృపవల్ల దొరకిన కందమూలాదులు భుజించడం, పగలంతా వేదాంత పురాణాల్లో గడపడం, సూర్యాస్తమయ మవగానే సాంధ్యకృత్యా లన్నీ నెరవేర్చడం, రాత్రి పొద్దుపోయేవరకు హరిభజన చేయడం, తరువాత మళ్లీ పడకకు పోవడం—యిలా కాలం గడపేవాడు.

ఒకనాడు మధ్యాహ్నము ఈ శరీరంతో జీవుడు పరమాత్మను చూడజాలడని అర్థమిచ్చే కొన్ని మాటలు చదివాడు. చదివినవాడు చదివినట్లు ఊరుకోవచ్చునా! అల్లా కాకుండా "నేను ఎందుకు చూడలేను" అని పంతంపట్టి కూర్చున్నాడు ప్రార్థనకి. ప్రార్థన చాలించి కన్నులు విప్పాడు. విప్పి చూసేసరికి గుండెల్లో దడ పుట్టింది. ఎందుకు? నల్లని ఆజానుబాహుడైన యముడు బుజాన్ని గద వేసుకొని ఎదురుగా నిలబడ్డాడు. కొంత సేపటికి ధైర్యం తెచ్చుకొని, "తమరు దర్శన మివ్వడానికి కారణం ఏమిటో కదా!" అని అడిగాడు యముణ్ణి. అది విని యముడు "నేను ఊరికే వస్తానా! ఈ వేళతో నీఆయుర్దాయము సరి. నీవు నాతో నాలోకానికి రావాలి. నీ తపానికి మెచ్చుకున్నాను. ఏదైన ఒకవరం కోరుకో" అన్నాడు. తనకి సమయం వచ్చిందికదా యని "నాకు ఈ శరీరంతో శ్రీమన్నారాయణున్ని చూడాలని ఉంది. కనక ఆవరం యివ్వండి" అన్నాడు ఈనూతనముని. "సరే" అన్నాడు యముడు. ముందర ముని, వెనకాల యముడు బుజాన్ని గద ధరించి బయలుదేరారు. కొంత దూరం వెళ్లాక ముని యముడితో "నీవు గద పుచ్చుకు వస్తోంటే నాబుర్ర హఠాత్తుగా ఎప్పుడు బద్దలకొడతావో అని భయంగా వుంది కనక ఆ గద నా కిస్తే నిర్భయంగా నడుస్తాను" అన్నాడు. యముడు అతని అనవసరభయానికి నవ్వుకొని ఆగద యిచ్చాడు. ఇద్దరు వెళ్లి వెళ్లి వైకుంఠం దగ్గరకి వెళ్లారు. గుమ్మడికాయల దొంగ ఎవ్వడురా అంటే బుజాలు తడుముకొన్నట్లు 'తను జీవుల్ని దయలేక బాధిస్తాను కదా! లోపలికి ఎల్లా వెళ్ళనా' అని యముడు జంకి మునితో "నీవు వెళ్లి చూచిరా, నేను యిక్కడ కనిపెట్టుకుంటాను"అని మునిని లోపలికి పంపాడు. ముని అక్కడివాళ్లందరికీ ఆశ్చర్యం గలిగేటట్లా బుజాన్ని గదవేసుకొని శ్రీమన్నారాయణున్ని దర్శించి అక్కడే కూర్చొన్నాడు. ముని ఎంతకీ రాడు. యమునికి ప్రాణం విసుగుతోంది. ఏమి తోచక తొంగిచూచి శ్రీమన్నారాయణుని దగ్గర ఉన్న మునిని చూచి "కాలం వృథా అవుతోంది. త్వరగా రా"అన్నాడు. అది విని యాముని "నేనేమిటి! రావడ మేమిటి! ఇంతసుందరమైన పట్నాన్ని, సర్వలోకైకనాథుడైన శ్రీమన్నారాయణున్ని విడిచి వస్తానుకనకనా! రాను, ముమ్మాటికి రాను. నీవు పో"అన్నాడు. ఇక చేసే దేమి లేక యముడు మెల్లగా లోపలికి వచ్చి శ్రీమన్నారాయణునితో "అయ్యా యీముని నన్ను ధిక్కరిస్తున్నాడు చూచారా!"అన్నాడు. అప్పుడు విష్ణువు 'నాలోకంలోకి వచ్చినవాళ్లకి, నాఅండ

చేరినవాళ్లకి మృత్యు వెక్కడైనా ఉందా? అందులో స్వశరీరంతో వచ్చిన యీమునికి అసలే లేదు. ఇంక నీవెఱ్ఱితనాలు మానుకుని దయచెయ్యి"అని మొహం మాడేలాగ జవాబిచ్చాడు. అప్పుడు యముడు మొహం చిన్నబుచ్చుకొని కొంతదూరం వెళ్లి తన గదమాట జ్ఞాపకంవచ్చి "నాగద నా కియ్యి"అని మునిని అడిగాడు. అప్పుడు ముని"ఈగద యిస్తే నా సహోదరు ల్నందర్ని హింసిస్తావు కనక యివ్వను"అన్నాడు. దానికి విష్ణువు ఆమునిని మందలించి ఆగద యిప్పించి యముడితో "నీతెలివితక్కువంతా స్వయంగాపోయి ప్రాణాలు తీసుకొనిపోవడంలో కనుపరుస్తున్నావు. ఎప్పుడు స్వయంగాను కనబడేలాగ వెళ్లకు" అని బుద్ధిచెప్పి పంపేశాడు. బుద్ధితెచ్చుకొని అప్పణ్ణించీ యముడు ఎవ్వరికి కనబడకుండా వచ్చి ప్రాణాలు తీసుకొనిపోతున్నాడు.

---

## పాతపాటలు

టేకుమళ్ల కామేశ్వరరావుగారు, బి. ఏ.

### 3. పణతిపాటలు

ఏరంత వెళ్లిన్న యిసుక సన్నంపు
యేరు దాటి వచ్చింది యెవరాడపడుచు?

పచ్చన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
బలగంతో వచ్చింది యెవరాడపడుచు?

తెల్లన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
తేజముతో వచ్చింది యెవరాడపడుచు?

నల్లన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
నవ్వుతూ వచ్చింది యెవరాడపడుచు?

ఎర్రన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
... ... ... ...

పచ్చన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
బలగంతో వచ్చింది పెద్దన్నవదినె.

తెల్లన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
తేజముతో వచ్చింది చిన్నన్నవదినె

నల్లన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
నవ్వుతూ వచ్చింది చిట్టన్నవదినె.

ఎర్రన్ని కుచ్చుల పల్లకీ యెక్కి—
.......................బుచ్చన్నవదినె.

వేసంకాలం వచ్చె వలువల్లు చిరిగె
వనిత నీ పుట్టింటి వా రేల రారు?

సీతాకాలం వచ్చె చీరల్లు చిరిగె
సీత నీ పుట్టింటి వా రేల రారు?

మారుకాలం వచ్చె మడతల్లు చిరిగె
మగువ నీ పుట్టింటి వా రేల రారు?

వైశాఖమాసాన వారింట పెళ్లి
వల్లభుడు అన్నయ్య పెళ్లి చేయించె.

మిల్లి తడియకుండ బొట్టు పడకుండ
నేర్పుతో పెద్దవదినె నేతు లొడ్డించె.

అంతకంటె నేర్పరే చిన్నన్నవదినె
ఆకాశాన మిల్లి ఆడించి పోయె.

"పండాగ వచ్చింది ఓ అత్తగార
పిండిక్కి బియ్యమ్ము ఎన్ని పోసేది ?"
"కొట్టెక్కి తెచ్చియు వెయ్యవే చేడె
తల గోసి తవ్వెడు పొయ్యి బియ్యమ్ము."
పిండి దంపి వాని అత్త పిలవ నంపింది.

రానన్ని అల్లుడు రచ్చకొ మ్మెక్కె
పిలవనని వానిమామ పీటకొ మ్మెక్కె.
పోనన్ని పండుగ పాదికట్టి యుండె.

పుణ్యమ్ము వొకచోట బుద్ధి వొకచోట
ఆచార మొకచోట అజ్ఞ వొకచోట
పుణ్యమ్ము మాయింటి పెద్దలకు వచ్చు
బుద్ధుల్లు మాయింటి బాలలకు వచ్చు
ఆచారం మాయింటి ఆడపడుచులకు
అజ్ఞల్లు మాయింటి కోడళ్ల కగును.

తొల్లింటి కాలమ్ము దొడ్డకాలమ్ము
అత్త వచ్చి కోడలికి దండమ్ము పెట్టె
"చాలు చా లత్తయ్య! చా లత్తగారు!
నీ కొడుకు వెయ్యేళ్లు(య్యేళ్లే) మొదలు కావాలి.
నీకోడలు పట్టంపుదేవి కావాలి
నువ్వొల్లి పంచల్లపాలు కావాలి."
రోటిక్కి మిక్కిలి వాయి పోసేరు
వాడచేడెల్లార! తోడాయి పోండి.

ఓవాడచేడమ్మ అబ్బాయిలక్ష్మి
పుస్తెల్లు మెరియంగ పునిస్త్రీ తోడాయె.
ఓవాడచేడమ్మ అబ్బాయిలక్ష్మి
నానుపేట మెరియంగ నాతి తోడాయె
ఓవాడచేడమ్మ అబ్బాయిలక్ష్మి
కంకణాలు మెరియంగ కాంత తోడాయె

వండవు వార్చవు వంటిల్లు చొరవు
వనిత నీ వజ్రాలకొం గేల మాసు?

పణతిరో అబ్బాయి పుట్టేడు మొదలు
పణతి అమ్మికొంగు పసుపుల్లమాసు;
కాంతరో అబ్బాయి పుట్టేడు మొదలు
కాంత అమ్మికొంగు కాటుకుల మాసు?
చేడరో అబ్బాయి పుట్టేడు మొదలు
చేడె అమ్మికొంగు చేతుల్ల మాసు.

..........................

అరణాలు లేవు ఆవటికట్నాలు లేవు
అతివ! నీ అత్తింట నో రెట్టుకు బతుకు.

ఆళ్లు విసరంగ వచ్చె చుట్టమ్ము
ఆళ్ల తిరగలి చూసి ఆశ్చర్యపడెను
చోళ్లు విసరంగ వచ్చె చుట్టమ్ము
చోళ్ల తిరగలి చూసి చోద్యమ్ముపడెను.

..........................

చక్కన్ని దానివే చదరాల నీవు
ఒక్కర్తె వున్నావు ఈ అడవిలోను.

..........................

వేరింటి కాపరం కూతుర కూతుర
వెర్రిమొగుడే కూతుర కూతుర
ఎద్దరి నీళ్లే కూతుర కూతుర
యేరుపిడకలే కూతుర కూతుర
యిసకలపొయ్యే కూతుర కూతుర.

ఆవాలపప్పు వండ ఓ వొదిన నేర్తు
ఆరనిఅగ్గులు పెట్ట ఓ వొదిన నేర్తు
మెంతులుపప్పు వండ ఓ వొదిన నేర్తు.

కోడలా కోడలా కొడుకు పెళ్లామ!
కొడుకు పూళ్లో లేడు మల్లె లెక్కడివి?



# నిప్పుపెట్టెల బొమ్మలు

కో. నరసింహాచారిగారు

నిప్పుపెట్టెలతోగాని, దీపావళిపండుగలో కాల్చు మత్తాబు పెట్టెలతోగాని, అనేక విధములగు బొమ్మలను సులభముగా చేయవచ్చును. ఒక్కొక్క బొమ్మను చేసినవెనుక దానిపై మన కిష్టమువచ్చు రంగుకాగితమును అతికించినయెడల బొమ్మ అందముగానుండును.

ఒక్కొక్క పెట్టెలో రెండు భాగములు కలవు. ఒకటి పైమూత (Case) చిత్రము 1 A. రెండవది లోననుండు సొరుగు (Drawer) చిత్రము 1 B. ఇచ్చట చూపబడియుండు బొమ్మలన్నిటిలోను మూతలు A అనియు, సొరుగులు B అనియు గుర్తించబడియున్నవి. ఒకపెట్టెను మఱియొక పెట్టెతో చేర్చవలెనన్న ఒకదానిలోని సొరుగును కొంత బయటికి లాగి రెండవదానిమూత లోనికి దూర్చినయెడల రెండు పెట్టెలును చేరి ఒకటిగా నేర్పడును. రెండు మూతలలో ఒక సొరుగు వంతున నుండును. (చిత్రము 2). దానికి ఇంకను ఒకపెట్టెను చేర్చవలెనన్న మఱియొకసొరుగునుదీసికొని సగము భాగము రెండవ మూతయందును, తక్కిన సగము మూడవ మూతయందును ఉండునట్లు దూర్చవలెను. ఈవిధముగా చాల పెట్టెలను ఒకవరుసగా చేర్చవచ్చును.

ఒకమూత లేక గొట్టములోనికి ఒక సొరుగును మూడింట రెండు భాగములు ($\frac{2}{3}$) దూర్చి, మిగిలిన మూడవభాగపు ($\frac{1}{3}$) సొరుగునందు మఱియొకసొరుగును నిలువుగా పెట్టినయెడల చిత్రము 3 నందు చూపిన విధముగా నేర్పడును. ఈరీతిగా అమర్చుటవలన, అడ్డముగానుండు వరుసనుండి నిలువు వరుస ఏర్పడగలదు.

## రైలుబండి (చిత్రము 5)

ఒకమూత $A^1$ యందు ఎడమప్రక్క ఒక సొరుగును, కొంచెముగా దూర్చవలెను. ఆ సొరుగున దారపుబండి నుంచినయెడల ఎంజిను అగును (C) $A^1$ మూతయందు కుడిప్రక్క మఱియొక సొరుగును $B^2$ ఉంచి, దానియందు $B^4$ అను సొరుగును నిలువుగా బెట్టవలెను. $B^4$

నకుపైన B⁵ అను సొరుగును బోరగిలనమర్చవలెను. B⁴ సొరుగునకు వెనుకగల B² సొరుగు యొక్క భాగమునకు A² అను మూతను అమర్చి దానివెనుక వరుసగా పెట్టెలను అమర్చినయెడల రైలుబండి అగును.

పిమ్మట అన్ని పెట్టెలను ఒకరంగు కాగితముతో చుట్టవలెను. ఒక్కొక్క పెట్టెయందలి సొరుగునకును, లాగుటకుగాను, Paper Fasteners (కాగితముల జేర్చిపెట్టు సూదులు—చిత్రము 4D) బిగించవలెను.




బీరువా (చిత్రము 4)

(Chest of Drawers)

4, 6, లేక 8 పెట్టెలను రెండువరుసలుగా చేర్చిపెట్టి ఒకదాని కొకటి అతికించవలెను.

గోపురము

(చిత్రము 6)

ముందు చెప్పిన బొమ్మలను చేయగలిగినపిదప గోపురమును చేయుట కష్టము కాదు. చిత్రము నాధారముగాగొని గోపురమును చేయవచ్చును.

వంతెన(చిత్రము7)

పెట్టెలను వరుసగా చేర్చుకొని ప్రతి రెండుమూతలమధ్య నిలువుగా నొక్కొక్క సొరుగును పెట్టినయెడల వంతెన యొక్క స్తంభము లగును. అడ్డముగానుండు సొరుగులు బోరగిల నుండిన యెడలనే క్రిందిప్రక్క స్తంభములను పెట్టుటకు వీలగును.

# యుగంధరమంత్రి

జీ. జాషువగారు

అక్కట! యుక్కునంకెలలు హస్తములం దగిలించి, ఢిల్లిభూ
భుక్కుని సీన పట్టుకొనిపోయెఁ బ్రతాపనరేంద్రసింహమున్;
నిక్కనఖండగౌతమిని నిల్చిన మ్లేచ్ఛుల యోడచావ, నీ
వెక్కడ డాఁగియుంటివి? వహింపుము టక్కరిపిచ్చివేషమున్.

పౌరుషరాశి, రుద్రనరపాలుని చేతికరంబు, నాలుక
ల్గోరకి యోరుగంటిపురిలోఁ బడియున్నది, తేనిగఁజ్జముల్
ధారుణిఁ దన్నుచున్నవి, బలంబులు భీతిపిశాచవాతఁ గం
గా రగుచుండె, లెమ్మిక యుగంధర, ముక్తి కుపక్రమింపుమా!

అదె, గోదావరి దాఁచి యుంచినది, రాజాశ్రూదకం బబ్జినీ
మృదుపత్రాంకురహేమపాత్రికల లెమ్మా! యందు కర్తవ్య ము
న్నది, యాలింపుము, ఓరుగల్లుపురి చింతాక్రాంతమై మూల్గుచు
న్నది, మంత్రీ! యిఁక నీయలీకరచనానాట్యంబు సాగింపుమా!

తురకఫౌఁజుల ఖడ్గతోమరంబుల నీడ భూపకేసరి కన్ను మూయఁగలదె?
మొగలాయిశృంఖలాపుష్పదామములకు నృపతి హస్తము ముద్దు లీయఁగలదె?
ప్రతిపక్షజన తీక్ష్ణ పరిహాసముల కోఁత యోరుగంటికటారి యోర్వఁగలదె?
ఖానుల జయపతాకాదీప్తిపృష్టికి ఆంధ్రక్రుధాగ్ని చల్లారఁగలదె?
తెనుఁగుభూమండలముతోడ జనన మంది-జీవనము ధారవోసి పోషించుచున్న
గౌతమీగంగ రుద్రభూకాంతు వయసు-పగఱ కర్పించుకొని దాఁటఁ బంపఁగలదె?

లేనవ్వు ల్బలసెన్ విరోధులకు, ఢిల్లీకోటలో రుద్రభూ
జానిన్ ఖానులు నవ్వులాడుకొని రాశాతాండవంబైన ప్ర
జ్ఞానైపుణ్యము మీరఁగా తెలుఁగుజెండా నుద్ధరింపం గదే!
ఆనందద్యుతు లోరుగంటిపురిమధ్యన్ గుప్పవోయింపవే!

---



పి. విశ్వనాథన్‌గారు

ఈ వ్యాసమున మోటారు బండియొక్కయు, చిలుకలయొక్కయు ముగ్గులు గీయువిధమును వివరింపబోవుచున్నాను. ప్రక్కపుటలోని పటమును చూడుడు: నం. ౧. మోటారు బండి ముగ్గును వివరించుచున్నది. అందు మొదటిచిత్రమున మోటారుబండి యాకారము గలదు. రెండవచిత్రమున పైముగ్గుకు చుక్కల నిడు విధము చూపబడినది: మొదటి వరుసయందు నాలుగును, తక్కిన మూడు వరుసలయందు ఆరారుచుక్కలను ఉంచవలయును. మూడవచిత్రము అట్టిచుక్కలతో ముగ్గును ముగించువిధము తెలుపుచున్నది. తొలుత బండియొక్క రెండుచక్రములను గీయవలయును. పిమ్మట చిత్రములో చూపిన విధముగ అడ్డగీతలను, నిలువుగీతలను గీయవలయును. తరువాత బండికి ముందు దీపమును, వెనుక పెట్టెను వ్రాసి ముగించవలయును.

నం. ౨. లో మొదటిచిత్రమున నొక చిలుక కలదు. అట్టి చిలుకను గీయుటకు చుక్కల నేవిధముగ నుంచవలయునో రెండవ చిత్రమున చూపబడియున్నది. నిలువుగ ఆరు చుక్కలతో నారంభించి క్రమముగ నొకటొకటి తగ్గించుచు రావలయును. ఆచుక్కలతో మూడవచిత్రమున చూపినవిధముగ ముగ్గును ముగించవలెను. ఈరీతిగనే రెండు చిలుకల-నొకదానికెదురుగ నొకదానిని-గూడ చిత్రించవచ్చును. చూడుడు నాలుగవచిత్రము.

# హిందూదేశ పరిపాలనా విధానము—దానిచరిత్ర

చా. వెం. హనుమంతరావు గారు, యం. ఏ.

(మొదటి భాగము)

౧

మన దేశపు ప్రస్తుతపరిపాలనాపద్ధతికి పునాది 1773-వ సంవత్సరములో మొట్టమొదటిసారి వేయబడినదని చెప్పవచ్చును. అంతకు పూర్వము ఇంగ్లీషువారు హిందూదేశములో ఏర్పాటుచేసికొనిన పరిపాలనాపద్ధతి స్వదేశరాజులు ఈస్టుఇండియాకంపెనీవారి కప్పుడప్పుడిచ్చిన హక్కుపత్రములపై ఆధారపడియుండెను. ఆపద్ధతి కేవలము వర్తకవ్యాపారముకొరకై ఏర్పాటు చేయబడిన విధానమే గాని రాజ్యపరిపాలనకొరకు ఏర్పాటుచేయబడినది కాదు. దానిప్రకారము కంపెనీవారి క్రిందనున్న భూముల పరిపాలనకొరకు ప్రతిముఖ్యప్రాంతమునందును ఒక డైరెక్టర్ల సంఘమును, దానికి అధ్యక్షుడుగా ఒకగవర్నరును ఉండిరి. ఈసంఘము లన్నియు ఇంగ్లండునందుగల కేంద్ర-కంపెనీడైరెక్టర్ల సంఘమునకు లోబడియుండినప్పటికిని, ఎవరికి వారే స్వతంత్రముగ తమ వ్యవహారములను పరిష్కరించుకొనుచుండిరి. కంపెనీ యొక్క వర్తకవ్యాపారమును చూచుటయే కాక తమ స్థానికప్రదేశములలో కొంతవరకు చట్టములను నిర్మించుట, వాటి నమలులో నుంచుట, న్యాయవిచారణ చేయుట మొదలగు పనులనుకూడ చేయుచుండిరి.

౨

1773-వ సం.లో రెగ్యులేటింగుఆక్టు ప్యాసుచేయబడెను. పార్లమెంటువారు హిందూదేశపురాజ్యాంగవిధానపు సందర్భములో ఏర్పాటుచేసిన చట్టములలో నిదియే ప్రధానస్థాన మాక్రమించుచున్నది. హిందూదేశమునందు కంపెనీవారి చేతిక్రిందకు వచ్చిన రాజ్యభాగములను పరిపాలించుటకు మాత్రము నేర్పాటుచేయుటయే ఈ చట్టము యొక్క ప్రధానోద్దేశ్యమని చెప్పబడినది. దీని ప్రకారము చేయబడిన మార్పులేవన—

(1) బెంగాలుప్రభుత్వపు అధికార మంతయు ఒకగవర్నరుజనరలు, అతనికి సలహా నిచ్చునట్టి ఒకసంఘము, వీరిద్దరికిని ఈయబడెను. ఈసంఘపు సభ్యులపేర్లు చట్టమునందే పేర్కొనబడి, వారు ౫సంవత్సరముల కాలము అధికారపదవులయం దుండవలె ననువిషయముకూడ దానియందే చెప్పబడియుండెను. (2) మద్రాసు, బొంబాయి ప్రభుత్వములు సాధారణముగ బెంగాలుప్రభుత్వమునకు లొంగియుండవలెను. (3) న్యాయవిచారణ సల్పుటకై ఒక సుప్రీముకోర్టు (Supreme Court) ఏర్పాటు చేయబడెను.

ఇంగ్లీషుపార్లమెంటుసభవారు హిందూదేశపు ప్రభుత్వపద్ధతిలో జోక్యము కల్గించుకొనుటకు ఈరెగ్యులేటింగు ఆక్టే మొదటిప్రయత్నము. కాని దానియందు చాల లోపము లుండెను. ముఖ్యమైన లోప మేమన గవర్నరుజనరలుసలహాసంఘములోని ముగ్గురు సభ్యులు ఇంగ్లండునుండి వచ్చిరి. వారు ముగ్గురును ప్రప్రథమము నుండియు కూడ అప్పటి గవర్నరుజనరలగు వారన్‌హేస్టింగ్సుకు ప్రతివిషయమునను వ్యతిరేకులై తమ వోట్లతో అతని సూచనలనన్నిటిని త్రోసిపుచ్చుచు వచ్చిరి. వారి బలము హెచ్చుగ నుండుటచే హేస్టింగ్సుయొక్క స్థితి చాల దుర్భరముగ నుండెను. ఈలోపము 1786-వసంవత్సరములో వేరొకచట్టముచే తీసివేయబడి గవర్నరుజనరలుకు తన సలహాసంఘముయొక్క సూచనలను అవసరమైనప్పుడు త్రోసిపుచ్చి పరిపాలన సాగించుట కధికారమీయబడెను. కాని అట్లు త్రోసిపుచ్చిన ప్రతిసారియు దానికి కారణములను, సంఘమువారి అభిప్రాయములను రికార్డుచేయబడవలెను. ఈవిధములైన సూత్రములతోనే

1793-వ సం.లో బొంబాయి, మద్రాసు రాజధానుల యందు కూడ సంఘమువారితో కూడిన గవర్నరు (Governor-in-Council) అధికారము ఏర్పాటు చేయబడెను. ప్రధాన కార్యనిర్వాహకుల విషయములో జరిగిన ఈమార్పులవలననే ఈపద్ధతికి కేంద్రమున 'Governor-Genetal-in-Councij' అనియు రాజధానులందు 'Governor-in-Council' అనియు పేరు వచ్చెను. ఈ రాజ్యాంగవిధానములే అప్పటి కాలములో రాజకీయవేత్తయగు జాన్ స్టూఆర్టు మిల్ గారు చాల ప్రశంసించి "పరిపాలనా విషయములలో కట్టుదిట్టమును, వివిధరాజకీయవేత్తల సలహావల్ల కలుగు న్యాయదక్షతయు దానివల్ల చేకూరు"నని వ్రాసియున్నాడు.

## 3

పైన సూచింపబడిన క్రొత్త ప్రభుత్వవిధానమేర్పాటు చేయబడినప్పటినుండియు, ఇంగ్లీషుకంపెనీ వారి వర్తకవ్యాపారమునకు సంబంధించిన విషయములన్నియు వేరె ప్రత్యేకముగ ఒక వర్తకపు సంఘమునకు వదలివేయబడెను. న్యాయవిచారణకు సంబంధించిన విషయములు పైన చెప్పినట్లుగా సుప్రీముకోర్టువారికి వదలివేయబడెను. గవర్నరుజనరలుఇన్ కౌన్సిల్ వారు చేసిన చట్టములు సక్రమమైనవా, కావా? యను విషయమును నిర్ధారణచేయుటకు ఈకోర్టువారి కధికార మీయబడెను. ఈసందర్భపరిస్థితులలో గవర్నరు జనరలు అతని కౌన్సిలునకును, సుప్రీముకోర్టునకును తీవ్రమగు అభిప్రాయభేదము కల్గుననుటలో ఆశ్చర్య మేమున్నది? ఈ లోటు వెల్లడియైనవెంటనే 1781 వ సంవత్సరములో కార్యనిర్వాహక ప్రభుత్వముయొక్క అధికారమే గొప్పదియని నిర్ణయించుచు సవరణచట్టము ఆమోదింపబడెను. కలకత్తాలో ఏర్పాటు కాబడిన ఈసుప్రీముకోర్టు ఇటీవల 1861 లో మద్రాసు బొంబాయిలలో ఏర్పాటు కాబడిన హైకోర్టులకు పునాదిగ ఏర్పడెను.

1784 లో పిట్ (Pitt the Younger) మహాశయుడు ప్రవేశపెట్టిన చట్టమువలన కార్యనిర్వాహక ప్రభుత్వపు ఏర్పాట్లలో కొన్నిమార్పులు చేయబడెను. కౌన్సిల్ మెంబర్ల సంఖ్య నాలుగునుండి మూడింటిలోనికి తగ్గించివేయబడెను. వీరిలో ఒకరు సర్వసేనాని పదవియం దున్నవారును, తక్కిన ఇద్దరును ప్రభుత్వోద్యోగమునం దున్నవారును అయియుండవలెనని తీర్మానింపబడెను. ఈపద్ధతిపైననే మద్రాసు బొంబాయి కార్యనిర్వాహక ప్రభుత్వమునందు కూడ మార్పు చేయబడెను. ఈఏర్పాట్లు 1835-వ సంవత్సరములో కంపెనీవారి హక్కుపత్రము (Charter Act) తిరిగి మార్పు చేయువరకు అమలునం దుండెను. దాని ప్రకారము పార్లమెంటువారు గవర్నరుజనరలు సలహా సంఘమునందు నాల్గవసభ్యు నొకనిని ఏర్పరిచి ఆతడు చట్టముల (Law Department) శాఖకు అధికారిగా నుండవలెనని నిర్ణయించిరి. ఈనిర్ణయము ననుసరించియే మన దేశపు ప్రథమ-లా మెంబరుగా ప్రఖ్యాతి వహించిన మెకాలే ప్రభువు (మన హిందూదేశ శిక్షాస్మృతిని తయారుచేసిన దీతడే) ఏర్పరుపబడెను. ఈచట్టమునందే కూడ మొట్టమొదటిసారి "ఏహిందూదేశస్థుడు కాని తన పుట్టుకచేత కాని, మతముచేత కాని మరి ఏఇతర కారణమువలన కాని కంపెనీక్రింద ఏఉద్యోగమున కైన అనర్హుడు కాడు" అను ముఖ్యమైనట్టియు, ప్రధానమైనట్టియు సూత్రము ప్రతిపాదింపబడెను.

కాని వీటియన్నిటికంటెనుకూడ ముఖ్యమైన మార్పొకటి ప్రవేశపెట్టబడెను. అదే దన, మన హిందూదేశపు ప్రభుత్వపరిపాలనావిధాన మంతయు కేంద్రీకరింపబడెను. బొంబాయి, మద్రాసు రాజధానుల ప్రభుత్వములపై గవర్నరుజనరలు-ఇన్-కౌన్సిలు వారికి అన్ని విషయములందును పైయధికార మీయబడి ఆయాప్రభుత్వములకు గల పరిపాలనాస్వాతంత్ర్యము తీసివేయబడెను. ఇట్లు దేశమున కంతను చట్టనిర్మాణపు అధికారము కేంద్రప్రభుత్వమువారి కిచ్చుటలో ముఖ్యోద్దేశము బ్రిటిష్‌వారి అధికారమునకు లోబడియున్న అన్ని ప్రదేశములకును ఒకే విధమగు చట్టముల నేర్పాటు చేయుటకు వీలుండుటయే. గవర్నరుజనరలుసంఘమునకు ఒక లా మెంబరును చేర్చుటలో ఆసతి

ఘమును ఒకవిధముగ చట్టనిర్మాణసభగా మార్పుట జరిగినదనియు, అట్లు మార్చుటకు ప్రథమసోపానము ఆమార్పువలన వేయబడినదనియు చెప్పవచ్చును. మొట్ట మొదట లా మెంబరు గవర్నరు-జనరలుగారి సంఘములో అదనపు సభ్యుడు(additional member) గా మాత్రమే ఏర్పాటుచేయబడెను. 1853-వ సంవత్సరమువరకు అత నికి ఆసంఘసమావేశములలో ఓటు చేయుటకు గాని పాల్గొనుటకు గాని అధికార మీయబడ లేదు.

౪

1853-వ సంవత్సరములో తిరిగి కంపెనీవారి హక్కు పత్రమును స్థిరపరచు సందర్భములో మరికొన్ని ముఖ్య మగు పరిపాలన మార్పులు చేయబడెను. దాని ప్రకారము గవర్నరుజనరలు సలహాసంఘము చట్టనిర్మాణపు అవసర ములకై పెద్దదిగా చేయబడెను. బెంగాలురాజధాని ప్రధానన్యాయమూర్తియు, సుప్రీముకోర్టునందలి జడ్జి యొకడును, బెంగాలు, మద్రాసు, బొంబాయి, వాయ వ్యపరగణాల ప్రతినిధులు నల్గురును, మొత్తము ఆరు గురు ఈపనికై మెంబర్లుగా నియమింపబడిరి. ఇట్లు హెచ్చుచేయబడిన ఈసంఘమువారు బహిరంగముగ తమ చర్చలు జరుపుటయు, ఆచర్చల సారాంశమును ప్రకటిం చుటయుకూడ జరుగుట కేర్పాట్లు చేయబడెను. కాని సంఘసభ్యు లందరును అధికారపదవులకు చెందినవారే యగుటచేతను, దానియందు హిందూదేశస్థుని కెవ్వనికిని స్థానము లేకుండుటచేతను ఆసభ ప్రజాప్రతినిధియని చెప్పు టకు ఎంతమాత్రము వీలు లేదు.

1857 లో సిపాయిల తిరుగుబాటు జరిగెను. దాని ఫలితముగ ఇండియాప్రభుత్వాధికారము కంపెనీనుండి రాణీగారి యాజమాన్యముక్రిందకు మార్పుచేయబడెను. 1861 లో క్రొత్త చట్టనిర్మాణసంఘము నేర్పాటుచేయు టకై పార్లమెంటువారు ఆక్టును ఆమోదించినపుడు ఇది వరలో నున్న లోట్లను చాలవరకు తగ్గించుటకును, తీసి వేయుటకును ప్రయత్నము చేయబడెను. 1861 చట్టము ననుసరించి హిందూదేశములో మొట్టమొదటిసారి ప్రజా ప్రతినిధిసంస్థలు ఏర్పాటుకాబడినవని చెప్పవచ్చును. ఈ మార్పునకు అప్పుడు గవర్నరుజనరలుగా నుండిన కానింగ్ ప్రభువు చాలవరకు బాధ్యుడయియుండుటచే అతనికి హిందూదేశప్రజలు కృతజ్ఞులై యుండవలసియున్నది. ఈ ఇండియన్ కౌన్సిల్సుఆక్టు (Indian Councils Act of 1861) ప్రకారము గవర్నరుజనరలు సలహాసంఘము లోని అదనపు మెంబర్లు రెండురెట్లు హెచ్చుచేయబడిరి. ఇట్లు హెచ్చుగా చేర్చబడినవారిలో సగముమంది అధి కారేతరులై యుండునట్లుకూడ ఏర్పరుపబడెను. మద్రా సు, బొంబాయిరాజధానిప్రభుత్వములకు 1833 లో తీసి వేయబడిన చట్టనిర్మాణాధికారము తిరిగి ఈయబడెను. అట్టిసంఘములే బెంగాలు, వాయవ్యపరగణాలయందు కూడ ఏర్పాటుచేయుటకు గవర్నరుజనరలుకు అధికార మీయబడెను. రాజధానిప్రభుత్వములు చేయు చట్టము లన్నియు గవర్నరుజనరలుయొక్క అనుమతి పొంద వలెను; గవర్నరుజనరలుసంఘమువారు చేయు చట్టము లకు (అవసరమైన రాష్ట్రప్రభుత్వములు చేయుచట్ట ములుకూడ) రాజుగారి(అనగా ఇండియామంత్రియొక్క) అనుమతి అవసరముగా చేయబడెను. కాని క్రొత్తగా ఏర్పాటుచేయబడిన ఈసలహాసంఘము లన్నిటికిని చట్ట నిర్మాణాధికారముమాత్రమే ఈయబడెను. కార్యనిర్వా హకప్రభుత్వమువారి చర్యలను విమర్శించుటకు గాని, వా టినిగూర్చి తీర్మానించుటకు గాని వారి కధికారము లేదు. 1861 చట్టమును పార్లమెంటుసభలో ప్రవేశపెట్టుచు "ఈసంఘములను వాగ్వాదనసంఘములుగ చేయు నుద్దే శము ప్రభుత్వమువారి కెంతమాత్రము లేదని అప్పటి ఇండి యామంత్రి సర్ చార్లెస్ వుడ్ గారు చెప్పిరి. ఈచట్టములో అతిజరుగురుసమయములలో ఆరునెలలకంటె ఎక్కువ కాలము అమలులో నుండకుండునట్లు ఆర్డినెన్సస్ (Ordinances) చేయుటకుకూడ గవర్నరుజనరలుకు అధికార మీయబడెను.

౫

తరువాత మనము విచారించవలసినది 1892 లో ఆమోదింపబడిన ఇండియా ప్రభుత్వపు చట్టము. దీని ప్రకారము 1861-వ సం.లో ఏర్పరుపబడిన చట్ట నిర్మా ణపు సంస్థలయందు కొన్ని ముఖ్యమైన మార్పులు చేయ

బడెను. అప్పుడు దక్షిణ ప్రభువు గవర్నరుజనరలుగా నుండి ఆతడు తన సలహాసంఘమువారి సభ్యులుగా నుండిన ఒక కమిటీని అవసరమగు మార్పులను సూచించుటకు ఏర్పాటుచేసెను. ఆకమిటీసూచనలే ఈ ఆక్టులో ప్రవేశపెట్టబడెను. దీనిప్రకారము గవర్నరుజనరలు చట్టనిర్మాణసభయందు ఈక్రిందివిధముగ సభ్యు లుండవలెను: (1) గవర్నరుజనరలు, ఆతని సలహాసంఘమునకు చెందిన ఆర్గురు మెంబర్లు (2) 6 గురు అదనపు మెంబర్లు, గవర్నరుజనరలుచేత నియమింపబడినవారు (వీరు సాధారణముగ అధికారులుగానే యుండిరి) (3) ఇంకొక ఆరుగురు నియమింపబడిన అధికారేతరులు (4) 5గురు అదనపు అధికారేతరసభ్యులు. వీరిలో ఒక్కొక్కరిని ఒక్కొక్కరాజధాని ప్రభుత్వపు సంఘసభ్యులు ఎన్నుకొనుటకు అధికార మీయబడెను. కలకత్తా వాణిజ్య సంఘమువారు ఒకసభ్యుని ఎన్నుకొనవచ్చును. మొత్తము కేంద్రచట్టనిర్మాణసభయందు 24 గురు సభ్యు లుండిరి. ఈచట్టముప్రకారము ప్రప్రథమమున హిందూదేశపు చట్టనిర్మాణసభలో అధికారేతరసభ్యులకు ప్రవేశము కల్గుటయే కాక ఆసభ్యులకు ఎన్నికమాత్రము కూడ మొదటిసారి ఏర్పాటుచేయబడెను. ఇదికాక, పట్టి చట్టములను చేయుటలో సలహా ఇచ్చు పనియే కాకుండ, ఈ సభకు ప్రభుత్వపు ఆదాయవ్యయపట్టీని చర్చించుటకును, ప్రజాహితవిషయములను గూర్చి ప్రశ్న లడుగుటకును కూడ అధికారము ఈయబడెను. ఈవిధములైన మార్పులే రాజధానులందుగల చట్టనిర్మాణసభల విషయమునందు కూడ 1892 ఆక్టుక్రింద చేయబడెను. అనగా రాజధానులందలి సభలలోకూడ అధికారేతర సభ్యులను చేర్చుకొనుటకు, వారికి బడ్జెట్ విషయమై చర్చ చేయుటకు, ప్రశ్న లడుగుటకు, తీర్మానములు చేయుటకు అధికారము ఈయబడెను.

---

## వేసట

వడ్లమాని అప్పారావు గారు

నదీరేయి కంఠాన నవసిపోయిన వలపు
నీలిసందేశాల తూలెనేమో నేడు
మణితారకల చూపు మంటల మధ్యాన
తరళాశ్రుకణములై తడి యారిపోయెనో!
విరహాగ్ని రొదలలో వేడినిట్టూర్పులో
అశ్రుమాలికలలో స్వప్నాభ్రపటలిలో
పిదిలివిరిగిన సుకలు తెలతెల్లవారెనో!
చీకట్ల వేసట్లు చినిగి వేకువలయ్యె.
ఒండొర్ల మనవలపు ఒరగిలి కృశియించె.

---

తెలివిలేని జంతువులలో గాడిద అగ్రస్థానమలంకరించుచున్నది. అందుచేత మనుజులలో తెలివి తక్కువవారిని గాడిద అని వాడుట గలదు. దూషణ వాక్యములలో నన్ని దేశములవారు గాడిద మాటగా గొనుచున్నారు. మానవకోటికి గాడిద యెంతయో యుపయోగకారిగా నున్నది. అది సాధారణముగా నెంత బరువైనను మోయును. చాకలివాండ్రు బట్టలమూటలు మోయుటకు గాడిదల నుపయోగించుచున్నారు. వీనిని కట్టి మేపుట లేదు. రుద్రభూములలో తిరిగి, బూడిదలో పొర్లాడి, దారిలో కనబడిన దెల్ల నారగించుట వీని స్వభావము. వీనికి దూరగమనము తగ్గించుటకు కాళ్లకు త్రాడు కట్టుచుందురు. వీని వైఖరిని బట్టి "శుక్లాంబరధరం..." అను శ్లోకమును గాడిదలకు సమన్వయించిన పండితులు గలరు. దెబ్బలకు లక్ష్యము చేయని శాంతిసంఘములో చేరుచున్నవి. ఎన్ని దెబ్బలు కొట్టినను కదలనివారిని 'గాడిదలాగు కదల' దని యనుట గలదు. సహనశక్తి యెక్కువగా నున్నంతమాత్రమున గ్రహణశక్తి గాడిదలకు శూన్యమనుటకు వీలు లేదు. ఒక సర్కసులో నొకగాడిద తన యజమాని యెక్కినప్పుడు సరిగా పరుగెత్తి, చూడవచ్చిన వారిలో సవారీ చేయుటలో సమర్థులనువారు సహితము దానిని లోబరచుకొనజాలకపోవుట మొదట కళ్లెమునే తగిలింపనివ్వక తోకనందించుట, తర్వాత కొంతవరకునూ తను నెక్కనివ్వక తిప్పలుపెట్టి పడద్రోసి మీద నిలుచుండుట, తుదకు యజమానిసంజ్ఞను బట్టి కొంతదూరము సవారీచేయనిచ్చి వెంటనే పడద్రోసి మీద దొర్లుటయు మొదలగు గాడిదచేష్టలను జూచినవార లెవ్వరును గాడిదలకు గ్రహణశక్తి లేదనజాలరు. తిట్ల కలవాటుపడినవా రనగా తిట్టుబోతులకు గాడిద నాలుకచివర నాశ్రయించియుండును. ఎవరినైనను తిట్టవలసినప్పుడు 'గాడిదకొడుకా' యని సంబోధించెదరు. ప్రశ్నకు జవాబు చెప్పుటకు విసుగగలిగిన 'గాడిదగుడ్డు' అని జవాబు బయలుదేరును. కోపము హెచ్చిన గాడిద మాతపదముగ బండబూతులకు దిగువారు గలరు. సరియైన జవాబు చెప్పని వారిని 'తప్పుడు గాడిద', 'అడ్డగాడిద' యని సంబోధించుట గలదు. చిన్నపిల్లవాడల్లరి చేసిన 'పిల్లగాడిద' అని, సోమరిగా నున్నవానిని 'గాడిదలు కాయుటకు పనికివచ్చు'నని, పిల్లలు హెచ్చుగా నేడ్చిన 'గాడిదమాసినదాక వదలా'డని, సంకరస్వభావమును బట్టి 'కంచరగాడిద' యని, సంగీతము పాడునపుడు స్వరము బాగుండనియెడల 'గార్దభస్వర' మని యీ విధముగా గాడిద స్మరణము ప్రజలలో హెచ్చుగా నున్నది. కొందరుమిత్రు లొకచోట గూర్చునియుండగా సాయంకాలమునం దొకయోగానుడు స్నోకుగా వారి ముందరనుండి వడిగా పోవుచుండెను. అంతట వీరిలో నొకడు 'గాడిద బాగా పోవుచున్నదిరా' అని హేళన చేసెను. అంతట నాయోగానుడు కొంతదూరము పోయి తిరిగి యీ మిత్రబృందముసమీపమునకు వచ్చి, ఒకచోట నుత్తరీయము పరుచుకొని, దానిమీద కూర్చుని "అమ్మయ్యా! ఇప్పటికి మందలో గలసినా"ననెను. అచ్చట మిత్రబృందము తొందరపడుటచేత గాడిదలుగ పరిణమించవలసి వచ్చెను. ఒక కవీశ్వరుడు కొండవీటి కేగ నచ్చట నందరును కవులైయుండుట గాంచి కనలి 'కొండవీటిలో నుండెడి గాడిద నీవునుం గవివి కాదుగదా'యని సంబోధించెనని వాడుక గలదు.

జంతుశాస్త్రరీత్యా గాడిదకును గుఱ్ఱమునకును విశేషభేదము లేదు. కాని మందుని తెలివిగలవానిని పోల్చునప్పుడు గాడిదకు గుఱ్ఱముకు గల భేదమును సూచించుచుందురు. ఒకడు గుఱ్ఱముమీద పోవుచు పాదచారిగా బోవుచున్నవానిని పరిహాసముగా 'గాడిద ఎలా పోవుచున్న'దని యడుగగా 'గుఱ్ఱముమీద' నని రెండవ వాడు జవాబుచెప్పెనట. ఎదుటవానిని గాడిద యనుట వల్ల తానే గాడిద యనిపించుకొనెను. పంచతంత్రమునందలి గాడిద సింహముతోలును గప్పుకొని పొలములో

జనులను భయపెట్టసాగెను. పిమ్మట తోడిగాడిదలు కన
పడగానే తన మామూలు స్వరము ప్రారంభించ గుట్టు
బయటబడెను. విద్యార్థులు చీట్లాడుటలో దొంగ ఆట
అని ఆడెదరు. అరవవారు దానిని 'కలుదై ఆట్టం' అనగా
'గాడిద ఆట' అందురు. ఆటలో ఓడినవాడు గాడిద యగు
చున్నాడు. సరియైన జవాబు చెప్పనప్పుడు, ఎన్నిసార్లడి
గినను జవాబు లేనప్పుడు అరవవారు 'కలుదా' అని, తెనుగు
వారు 'గాడిదా' అని, ఇంగ్లీషువారు 'యాస్' అని సంబో
ధించుచుందురు. గాడిదకు వెనుక కాళ్లు వంకరగా నుం
డును. ఇతర గాడిదలు దగ్గరకు వచ్చినప్పుడు వెనుక
కాళ్లతో వంకర తన్నులు తన్నును. ఎవరైనను వెనుకకు
తన్నినయెడల గాడిదలాగు తన్నినటుల తలంచబడు
చున్నారు. గాడిదలకు రూపవికారముతో చేష్టావికా
రము గలదు. కొన్ని గాడిదలకు గూను హెచ్చు. పారం
పర్యముగ బరువు హెచ్చుగా మోయుటచేత నేర్పడి
యుండవచ్చును. దానికి తోడు వానికి సహజమైన తెగులు
కూడా ఉన్నయెడల చెప్పవలసినదే లేదు. అందువలనే
పనులు చేయుటకు వెనుకాడువారు గౌరవపదవుల కాశించు
నప్పుడు తెగులున్న గూనిగాడిదలతో పోల్పబడుచుందు
రు. ఎక్కువ గందరగోళముగా నున్నప్పుడు 'గాడిదగోల'
యనియు, స్థల మేదైన చికాకుగా నున్న 'గాడిదగత్తరగా
నున్న'దనియు వాడుచుందురు. గాడిదపిల్ల మిక్కిలి చిన్న
వయసులో చాల కోమలమై గుఱ్ఱపుపిల్లకంటె నవనవ
లాడుచుండును. వయసు హెచ్చిన కొలది వంకర కాళ్లు,
వికృతాకారము బయటబడును. అందుచేత అందముగా
గన్పడుపిల్లలకు బుద్ధిమాంద్య ముండుచో 'గాడిదపిల్ల
ముద్దువాటు'మని లోకవ్యవహారము గలదు.

సన్యాసం పుచ్చుకుంటే ఇంటిబాధ తప్పునని
తలంచిన సన్యాసి తుదకు తన కాషాయవస్త్రములు,
దండకమండలములు మొదలైనవి గల మూటను ధరించి
'సన్న్యాసం పుచ్చుకున్నా గాడిదబరువు తప్పలే'దనెనని
లోకమున వాడుక గలదు. ఒక జడ్జియు, నొక న్యాయ
వాదియు నొకచోట జేరి పూర్వజన్మమును గురించి
చాలసేపు చర్చించిరి. పిమ్మట అట్టి పూర్వజన్మ
ఉండిన యెడల "పూర్వ జన్మలో మీరు
నేను ఏమైయుండుమో చెప్పగలరా" యని జడ్జి న్యాయ
వాది నడిగెను. అందుకు న్యాయవాది తడవుకొనకుండా
"నేను గుఱ్ఱమును, మీరు గాడిద అయి యుందు"రని
జవాబు చెప్పెను. అందుకు జడ్జికిగల ఓపిక సహనశక్తిని
దృష్టాంతముగ జెప్పి తానొక కోర్టునుంచి మరియొక కోర్టుకు
జట్కాగుఱ్ఱమువలె తిరుగుచుండు నిదర్శనమును చెప్పెను.
గాడిదను క్షుద్రజంతువుగా తలంచుట పొరపాటు. వసు
దేవుడంతవానికి శ్రీకృష్ణజననకాలమప్పుడు గాడిదకాళ్లను
బట్టుకొని యాశ్రయించక తప్పినదికాదు. క్రైస్తు బైబి
లులో గాడిదమీద నొకయూరినుంచి మరియొకయూరికి
వెడలినటుల గలదు. ఒకడు మరియొకనిని గాడిదయెదుట
'గాడిదకొడుకా' యని తిట్టగా ఆ గాడిదకు దుఃఖాతిశయము
గలిగి, "ఆడినమాటను దప్పిన గాడిదకొడుకా యటంచు"
తిట్టినందుకు "వీడా నాకొడుకంచును గాడిదయేడ్చెగా"
అని ఒక కవి వర్ణించియుండెను.

వైద్యమున నుపయోగపడు ఆకును 'గాడిదగడ
పాకు' అని పిలిచెదరు. పసిపిల్లలకు శ్వాసకోశములకు
జబ్బుగలిగిన గాడిదపాల నౌషధముగ వాడెదరు. మంద
మతులగువారిని 'చిన్నప్పుడు గాడిదపాలు త్రాగినావా'
అని పరిహసించుట గలదు. గాడిదకూత శకునముగా నిప్ప
టికి హిందువులలో పరిగణింపబడుచున్నది. ఎవరినైనను
'గాడిద' అని అనినయెడల రెట్టింపుపదప్రయోగమో
దేహశుద్ధియో తప్పదు. సాధారణముగా నధికారమునం
దున్నవారు కొందరు తాబేదారులను త్వరపడి 'గాడిద'
యని సంబోధించుట గలదు. అందుకు తాబేదార్లు
లోలోపల తిట్టుచు చేయునది లేక యూరకుందురు. అచ్చ
టచ్చట మొండివాండ్రు తిరుగబడుట గలదు. ఒకప్పుడు
దానివలన తిరుగబడినవారికి పదభ్రష్టత్వము కలుగవచ్చు
ను. అధికారికిని పశ్చాత్తాపము కలుగుట కవకాశము
గలదు. పైసంగతులవల్ల గాడిద సంతతి సులభముగ జంతు
కోటినుంచి తొలగించ వీలులేదని సృష్టికర్త మన కల్లవేళల
దరుచు స్మరించుటకు వీలు గలుగునటుల గాడిదను సృజి
యించెనని తలంచవలసియున్నది. ఎక్కడనో ఒకమత
గ్రంథములో ఆమతస్థులు ఉదయము నిదుర లేచి స్మార్తు
లను జూచిన గాడిదగా బుట్టెదరని యున్న అవకాశము తీసు

కొని అట్టిమతస్థులలో నొక ప్రముఖుని సమక్షమున నున్న ఒక గాడిదపట్టు మున్మారు తిరిగి సాష్టాంగదండప్రణామము చేసిన యొక సాంకృత్తిని జూచి యామతస్థుడు ప్రశ్నించగా, పూర్వజన్మములో నొక ఆచార్యపురుషుడు ఉదయమున సాంకృత్తిని మాచిన దోషమున నటుల గాడిదజన్మమెత్తెనని, అందుచేత వారికి నమస్కరించుచుంటి నని పరిహాసము చేసినటుల గలదు. ఇంతటి గాడిద క్షుద్రజంతువైనను దానికి 'ఘటం భింద్యాత్ పటం ఛింద్యాత్ కుర్యాద్వా గార్దభస్వనం' అనేవిధముగ ప్రసిద్ధి లోకములో గలదు. దానికి తెలివి లేక పోవుగాక, దానికిగల సహనము, లోకోపకారశక్తి, ఫలాపేక్ష లేని కార్యాచరణము గమనింపదగినవై యున్నవి. కేవల ఆకారవికారములనుబట్టి నిరసనచేయుచో మనుజులలో నెందరో గాడిదలను మేలనిపించువారు గలరని యంగీకరింపక తప్పదు. సృష్టిలో ప్రతిజీవకోటియందు ఆత్మ గలదని నమ్ము హైందవులు ముఖ్యముగ సర్వసమత్వమునకై ప్రయత్నించు ఈదినములలో గాడిద నంత మిలకవగా జూచుట తగదు. సత్యాగ్రహసమయములందు కనపరచబడు సహనమున కేది నిదర్శనము! గాడిద లన్నియు తెలివితక్కువవి యనుటకు వీలు లేదు. గాడిదలతో పోల్చబడుట కిష్టము లేనివారలు గాడిదచేష్టలను మానుట అవసరము. సహన మభ్యసింపవలసినప్పుడు మార్గదర్శియగు గాడిద ననుకరించుట తప్ప గాజాలదు. అందుచేత గాడిదయని యెవరైన తిట్టినను సహనశక్తిని కనబరచుటకును తిరిగి తిట్టకుండుటకును ప్రయత్నించువారు వర్ణనీయు లగుచున్నారు. ఈగాడిద గోడున నింతతో చాలించి రాబోవు గార్దభమహాసభలో జరుగు ఉపన్యాసములను, తీర్మానములను వెనుకనుంచి విన్నవించుచున్నాను. గాడిదలను తక్కువగా దలంచువారిక గార్దభసంఘమున రానున్న మార్పులను దెలిసికొని జాగ్రతగా సంచరించవలసి యుండును.

---

## కైలాస యాత్ర

పువ్వాడ శేషగిరి రావు, చోడవరపు జానకిరామయ్య గార్లు

ఇరువయిపులఁ దరుపంక్తులు-తఱచుగఁ దీరిచెను; మధ్య దారి; యనంత
స్మరణీయ దీర్ఘ దూరం-బిరువుర మగు మేము సొంపు నింపు దలిర్పన్.
నడవసాగితి మా పెద్దయడవికోనకు-నేనును సుదర్శనుండు; నన్నే యతండు
పూర్వగామిగ నట్టియపూర్వయాన-మెల్ల గమియింప నలుపు; నవెల్లఁ గాంచి
ఏమిది? యెందుఁ బోవుద, మి దెక్కడకుం దెరు వంచు నే ననన్
"కామితదాయకుం డసురకంత విలుంతన మాచరించి ని
ష్కాముకరతిన్ నలుపుకర్తకు వాసము వెండికొండ నే
నామహనీయపర్వతమునందకుఁ గొందును నిన్నుఁ; ర మ్మనెన్.

అతఁ డన్నట్టి విచిత్రవాక్యము మదీయాహ్లాదపారమ్ము గాం
చి తదేకమ్మగు దీక్ష నామనమునన్ చేసేఁత విత్తైన్ మనో
గతమై యంకురమై నిమేషమున వృక్షమ్మయ్యె; మే మావిచి
త్రతరువ్రాతపథానుగాములయి యంతన్ గోర్కి సంధిల్లఁగన్.

నడచిన దారికి కొననున్-గుడిచేతికిఁ బ్రక్కఁ బెద్ద కోటకుఁ బోలెన్
నిడుపగు ప్రాకారమ్ముల-నడిమిని నొకద్వార మాత్మనైపుణిఁ జూపున్.

దానఁ జొరఁబడి యడుగిడఁగానె, యెడమ-చేతివయిపున నొకతెన్ను చెలువు చూచి
తన్మహామార్గ గాములై తరలినాము-దాని కిరువైపులనుఁ దెల్లనైన గోడ.

ఎంత నడచిన తఱుఁగ దదేమి తెరువొ?-నడచి నడచి మఱింకంత నడచి నడచి
తుద కొకానొక తెల్లని త్రోవఁ బట్టి-సాగినారము కొంతద వ్వేఁగు దనుక.

అనతి దూరాన మాకన్ను లాస్వదించె-పాపపంకిల మూడ్చి పుణ్యాపచయము (?)
నలువు నరునకుఁ గరతలామలకమైన-జలతరంగాంగ, శివశిరస్సంగ, గంగ.

తల్లలితాంగిఁ గాంచిన మొదల్ వివశమ్మయి మేను లుబ్బ యా
వెల్లువలోన మజ్జన మభీప్సితసిద్ధిగ సల్పినార, మ
త్యుల్లసితాంతరంగముల, యోగులతో మహితాత్మకాళితో
వెల్లని కేశపాశముల విచ్చి మునింగెడి వృద్ధపంక్తితో.

'మునుకలు గంగానదిలో-నొనరించుట కన్న భాగ్య మున్నదె? యది నే
నొనరింప లేకపోయియుఁ-గనియుంటిని కలనుమాత్ర కామితదాయీ!

కాలపయోదగర్జనము కారణమై తొలఁ కాడునట్టి శం
పాలతవోలె నేమిపరువమ్ములు కూర్చెదవో యటంచు బా
ధాలసమైన సైఁచికొని దానికిఁగా నెద వేచియుండఁ దత్
కాలము డగ్గరిల్లి తొలుకాఱుమెఱుం గయితో, యుమాధవా!

---



౮. ఓడలను మరమ్మత్తుచేయు స్థలము



౩. సముద్రమును త్రవ్వట

చెన్నరాజధానియందు ౧౯౨౮-వ సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదవరకు గల మూడు నెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

ఆంధ్రవాఙ్మయ మిూ క్రింద పేర్కొనిన వివిధశాఖలతో వెలసియుండుటచేత నీపట్టిక యందాయాశాఖల నుత్పన్నములగు గ్రంథము లాయా శాఖలకే చేర్పబడును. గ్రంథముల నామములన్నియు నకారాదిక్రమమున నుండును.

1. అర్థశాస్త్రము, 2. అలంకారశాస్త్రము-నాట్యకళకు సంబంధించిన గ్రంథములు నయిత మిూ శీర్షిక క్రిందనే చేర్పబడును, 3. ఆయుధధనుశ్శాస్త్రములు, 4. ఆరోగ్యశాస్త్రము, ఇతిహాసములు- ఇతిహాసములలోని భాగములు, కథలు, మార్పుచేయక ప్రత్యేకముగ ముద్రింపఁబడునవి - యీశీర్షికక్రిందనే చేర్పఁబడును, 6. కథలు—ఐతిహాసికములు,పౌరాణికములు, 7.—కల్పితములు, 8.—చారిత్రకములు, 9.కల్పము, 10.కామశాస్త్రము, 11.కావ్యములు, 12. గణితశాస్త్రము, 13. గేయములు, 14. చరిత్ర(దేశ), 15. చిత్రలేఖనము,16. చట్టము(Law), 17. ఛందశ్శాస్త్రము, 18. జంతుశాస్త్రము, 19. జీవితములు, 20. జ్యోతిషశాస్త్రము, 21. తర్కశాస్త్రము, 22. దండకములు, 23. ధర్మశాస్త్రము, 24. నవలలు, 25. నాటకములు, 26. నాట్యశాస్త్రము, 27. నిఘంటువులు, 28. నీతి- నీతికథలుకూడ యీ శీర్షికక్రిందనే వచ్చును, 29. పరిశిష్టము, 30. పాకశాస్త్రము, 31. పారిశ్రామికము, 32. పురాణములు- ప్రత్యేకముగ ముద్రింపబడి ప్రకటింపబడు పురాణములలోని భాగములు నయిత మిూ శీర్షికక్రిందనే చేర్పబడును, 33. ప్రకృతిశాస్త్రము, 34. ప్రబంధములు- ఆంధ్రసారస్వతమునందు ప్రసిద్ధములగు 'హరివంశము', 'ఆంధ్రచంపూభారతము', 'అచ్చతెలుగు రామాయణము'వంటి పురాణేతిహాస కావ్యములకు సంబంధించినవి, 'పాండురంగ మాహాత్మ్యము' వంటి మాహాత్మ్యములు, 'ఆంధ్రమేఘసందేశము'వంటి అనువాదములు, రంగనాథరామాయణము'వంటి ద్విపద గ్రంథములు మొదలయినవి యీశీర్షికక్రిందవచ్చును, 35. ప్రహసనములు, 36. భూగోళశాస్త్రము, 37. భౌతికశాస్త్రము, 38. మంత్రశాస్త్రము, 39. మతము - హిందు, 40.— ఇతరములు (బౌద్ధ, జైన, క్రైస్తవాదిమతములు)- ఇతరమతములకు సంబంధించిన గ్రంథములు— ఏ విషయ విభాగమునకు సంబంధించిన వయినను-

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.- అధ్యాయము ; అను — అనువాదము ; అనువాదకులు. ప.-పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.-భాగము. వ.-వచనము. సం—సంపాదకులు. సటీ.-సటీకము.

ఈశీర్షిక క్రిందనే చేర్పబడును, 41. మాహాత్మ్య ములు, 42. మీమాంసాశాస్త్రము, 43. యక్ష గానములు, 44. యోగశాస్త్రము, 45 రత్న శాస్త్రము, 46. రాజకీయములు, 47. వాస్తు శాస్త్రము, 48. విమర్శనము- ఇందు సారస్వ తమునకు సంబంధించిన విమర్శనలు మాత్ర ముండును, 49. వృక్షశాస్త్రము, 50. వేద వాఙ్మయము- ఉపనిషత్తులు,ఇతర వైదికగ్రంథ ములునయితే యిందే చేర్పబడును, 51 వేదాం తము - భక్తి జ్ఞానవైరాగ్య విషయకగ్రంథము లీశీర్షిక క్రింద వచ్చును, 52. వైద్యశాస్త్రము, 53. వ్యవసాయశాస్త్రము, 54. వ్యాకరణ శాస్త్రము, 55. వ్యాపారము, 56. వ్యాయామము, 57. శకునశాస్త్రము, 58. శతకములు 59. సంగీతశాస్త్రము, 60. సాంఘికములు, 61. సాముద్రికశాస్త్రము, 62. సారస్వతము- భాష, 63. స్తోత్రములు, 64. హరికథలు.

ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్య ప్రబోధ నాటకము—జి. సూర్యనారాయణ

ఆరోగ్యము—సి. వెంకటరమణయ్య

ఇతిహాసములు

నలోపాఖ్యానము (పట్)—(ప్ర) మారుతిరాం అండు కో., బెజవాడ

రామాయణము (మొల్ల) — (ప్ర) రాం అండు కో., ఏలూరు

శ్రీమద్యోగానందాంధ్ర రామాయణము, బాలాయోధ్యా కాండలు (ప్ర)—చ. యోగానందయ్య

కథలు—ఇతిహాసికములు, పౌరాణికములు

కుశలవులు— శేషాద్రిరమణకవులు

కుశలాయకము—(ప్ర) టి. బాలకృష్ణనాయకర్, మదరాసు

కౌసల్య—సి. సూర్యారావు

గణపతి — (ప్ర) సి. కుమారస్వామినాయుడు అండు సన్స్, మదరాసు

జనమేజయరాజ్యము—కె. స్వామినాథ

భాష్యఋషి (వ)—(అను) హెచ్. వాసుదేవరావు

నారదమహర్షి జీవితచరిత్రము—వి. జగన్నాథశర్మ

రఘురామజీవితము—ఇ. శ్రీనివాసవరదాచార్య

పురాణకథాదీపిక— (ప్ర) కులవాణీప్రచురణాలయము, తెనాలి

పురాణగాథలు—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

బాలకృష్ణవిజయము—(ప్ర)జయం అండుకో.,మదరాసు

శుద్ధాంధ్ర కుచేలోపాఖ్యానము — యం. వి. మాధవాచార్య

సీతాకల్యాణము, శ్రీ రంగనాథరామాయణము—(ప్ర) వై. లక్ష్మీనరసింహం, జగ్గయ్యపేట

సీతారాములు—డి. వి. రమణరావు

స్త్రీలవ్రతకథలు—వి. వెంకటరావు

—కల్పితములు

కథావళి—పి. రామచంద్రరావు

కాశీమజిలీకథలు, భా. ౭—మధిర సుబ్బన్న దీక్షితకవి

జయచంద్ర చంద్రరేఖావిజయము—వి. కోటేశ్వరరావు

మానసోల్లాసినీకథలు—యస్. రాధాకృష్ణయ్య

మధ్యాంధ్రకాదంబరి— (అను) యస్. సోమసుందరకవి

వధూవరుల ఆత్మహత్య—వి. కోటేశ్వరరావు

వినోదకథాకల్పవల్లి—సి. వెంకటరామానుజశర్మ

— చారిత్రకములు

గుంటూరు మస్తాన్‌చరిత్రము— యం. అనంతరామయ్య

భట్టి విక్రమార్కుని కథలు, భా. ౨— (అను) యం. శ్రీరామమూర్తి

భోజరాజచరిత్ర—యం. చిన శేష గిరిరావు

మహాత్మా, నేడు—యం. వేంకటకృష్ణశర్మ

శృంగారకాళిదాసు కథలు—యస్. కృష్ణస్వామిశర్మ

సతీరత్నములు, భా. ౧—యస్. రాధాకృష్ణయ్య

## కల్పము

దేవబ్రాహ్మణ సంధ్యావందనము—జి. చంద్రమౌళీశ్వర సిద్ధాంతి

మహా మృత్యుంజయజపవిధి — యస్. పి. పి. బి. వై. సరస్వతిస్వామి

సత్యనారాయణవ్రతకల్పము — కె. అప్పయ్య అండు సన్సు, రాజమహేంద్రవరము

## గణితశాస్త్రము

గ్రామలెక్కల నమూనాలు— బి. యల్. నరసింహం

నోటిలెక్కలు—(ప్ర) రంగా అండు బ్రదర్స్, కాకినాడ

ప్రారంభగణితము, భా. ౨,3.—కె. యస్. శ్రీనివాసాచార్య

## గేయములు

అల్లూరి సీతారామరాజు కీర్తనలు—వై. కృష్ణరావు

ఆత్మబోధక (వేదాంతడిండిమ, అనంతోపనిషత్ సహా)—(ప్ర) టి. నరసింహసెట్టి, మదరాసు

కుశలవయుద్ధము—(ప్ర) కె అప్పయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము

గ్రామ స్వరాజ్యంపాటలు—వి. సత్యనారాయణ

గంగావివాహము— (ప్ర) టి. బాలకృష్ణనాయకర్, మదరాసు

గోగీతము—యస్. కృష్ణరావు

చరగోవిందనామములు— (ప్ర) కె. అప్పయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము

జ్ఞానబోధాధ్యాత్మిలు (పాటలు)—ఆర్. హనుమయ్య

త్రినాథవ్రతగీతము—పి. శ్రీనివాసరావు

నూతన రామాయణ భజనకీర్తనలు—బల్లాస్వామి

పెదకాకాని శ్రీ మల్లేశ్వరధ్యానస్తోత్ర కీర్తనలు—పి. వెంకటసుబ్బయ్య

భక్తపారాయణ కీర్తనలు—యస్. అప్పలనృసింహదాసు

భజన కీర్తనలు—వి. సత్యనారాయణమూర్తి

భద్రాచల రామదాసు చరిత్రము—(ప్ర) కె. అప్పయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము

మాతృసంకీర్తనము—టి. విశ్వనాథము

రామాయణ భజనకీర్తనలు—(ప్ర) కె. అప్పయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము

లక్ష్మణదేవరనవ్వు—(ప్ర) కె. అప్పయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము

లంకాయాగము— (ప్ర) కె. అప్పయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము

వేంకటేశ్వర పద్మావతీ మనోరంజిత పెండ్లిపాటలు—(ప్ర) యం. వి. రుద్రయ్యనాయుడు, తిరుపతి

వేడుక పెండ్లిపాటలు—టి. తిరుమలదాసు

శ్రీ ఆత్మారామ కీర్తనలు—(ప్ర) యస్. ఆదినారాయణ, ఏలూరు

శ్రీ కోదండరామ భజనామృతము—(సం) యస్. వరదదాస్

శ్రీమద్రామాయణ భజనకీర్తనలు—శి. ఆళ్వారుదాసు

శ్రీమద్రామాయణ భజనకీర్తనలు—వి. సత్యనారాయణమూర్తి

శ్రీరామ భక్తికీర్తనలు—ఏ. రామచంద్రయ్య

శ్రీ వెంకటేశ చిద్విలాససరస— (ప్ర) యం. వి. రుద్రయ్యనాయుడు, తిరుపతి

సీతాకల్యాణము—మస్తాన్ షరీఫ్ సాహెబ్

సీతారాములపాటలు— జి. ఇందుమతీదేవి

## చరిత్ర

తక్షిణాఫ్రికా—డి. వి. శివరావు

నరసరావుపేట చరిత్రము—యం. గురుబ్రహ్మశర్మ

హిందూదేశచరిత్రము—సి. టి. శ్రీనివాసఅయ్యంగారు

## చట్టము (Law)

పంచాయతీకోర్టు సంగ్రహం—ఆర్. వాసుదేవరావు

హిందూ లా—ఆర్. వెంకటసుబ్బారావు

## జీవితములు

ఆలీ జనాబ్ ఖాన్ అక్బర్ హుస్సేన్ సాహెబ్ ఖాన్ బహదూర్ గారిజీవితచరిత్రము—జి. సీతారామశాస్త్రి

మహమ్మదు—పి. అప్పలస్వామి
వినాయకసావర్కారు జీవితము—యం. జగన్నాథశాస్త్రి

జ్యోతిష శాస్త్రము

జ్ఞానప్రదీపిక—యస్. వెంకటరాఘవాచార్య
జ్యోతిష ప్రశ్న కంఠాభరణము—సి. లక్ష్మీనృసింహ శాస్త్రి

దండకములు

దండకరత్నములు—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము
దండకరత్నములు—(ప్ర) కె. సుబ్బారావు, బెజవాడ
దండకాభరణము—ఏ. నారాయణరావు
నందికేశ్వరదండకము—యం. వి. బి. మాధవాచార్య
మహానందీశ్వరదండకము—ఎ. వేంకటశేషకవి
శ్రీ మహాలక్ష్మమ్మదండకము, అంకమ్మదండకముసహా—కె. వీరయ్య

నవలలు

అపరాధిని—(అను) వి. సత్యనారాయణశాస్త్రి
అశాపిశాచము—ఏ. సోమేశ్వరరావు
గులాబ్‌కుమారి, భా. ౧—(అను) యం. సత్యానంద రావు
తైలప, రాష్ట్రకూట కులాంతకుడు—ఏ. యస్. వెంకటేశ్వరుడు
రాధామాధవము—ఏ. వెంకటసీతమ్మ
లలిత—యం. శంకరరావు
విమలానందము—డి. వెంకటస్వామిగుప్త
వీరగాంధర్వము—బి. రామానుజులురెడ్డి
సత్యవతి—ఇ. భావ్యకాచార్య
సహస్ర శిరచ్ఛేద అపూర్వచింతామణి, భా. ౨—(అను) పి. పిచ్చయ్యశాస్త్రి

నాటకములు

కనకతార—చి. చంద్రమౌళిశాస్త్రి
కాంతామతి—జి. కోటీశ్వరరావు
కృష్ణలీలనాటకము—బి. కె. సుబ్రహ్మణ్యశాస్త్రి
చిత్తవృత్తి—(అను) యం. దుర్గాశంకరరామాత్యుడు
జగదానందము—డి. బ్రహ్మానందశాస్త్రి
జయంతజయపాలము—(ప్ర) కె. అచ్చయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము
పుష్పూరవ—డి. సీతారామరాజు
ప్రహ్లాదనాటకము—(ప్ర) టి. బాలకృష్ణనాయుడు
ప్రాథకృష్ణలీల—బి. కె. సుబ్రహ్మణ్యశాస్త్రి
మిహిరాండభారతి—(అను) ఆర్. వెంకటరామసోమయాజులు
రామపాదుకాపట్టాభిషేకము—సి. మాణిక్యశర్మ
రామరావణయుద్ధము—యస్. రామానుజరావు
రుక్మిణీసందేశము—బి. యం. వెంకటేశ్వరరావు
రోషనార—యస్. రామానుజరావు
లంకాదహనము—సి. మాణిక్యశర్మ
లాక్షాగృహదహనము—ఏ. వి. జగన్నాథాచార్య
వరవిక్రయము—జి. కామేశ్వరరావు
శ్రీకృష్ణరాయబారము—యస్. రామానుజరావు
శ్రీమతీదేవి—శ్రీపతి త్ర్యంబకరావు
శ్రీమదాంధ్రనాటక మహాభాగవతము—జి. పాపరాజకవి
షాహజహాన్—(అను) డి. సత్యనారాయణ
సత్యహరిశ్చంద్ర—రామనారాయణకవులు
సంగీత విష్ణులీల—సి. మాణిక్యశర్మ
సంగీత విష్ణులీలలు—యస్. రామానుజరావు
సావిత్రినాటకము—డి. సీతారామరాజు

నీతి

నీతికథారత్నాకరము, భా. ౩—యం. శ్రీపతి
నీతికథాసారము—శేషాద్రిరమణకవులు
నీతికోశము—(ప్ర) దీనదయాళు అండు కో., మదరాసు
నీతిగీతావళి, భా. ౨, ౩, ౪—(ప్ర) కింగ్ అండు కో., బెజవాడ
నీతిచంద్రిక—పి. చిన్నయ్యసూరి
పంచతంత్రికథలు—(అను) పి. సూర్యనారాయణతీర్థులు
పిల్లల నీతికథలు, భా. ౨—యం. శ్రీపతి
బాలకహితచర్య—వావిలికొలను సుబ్బారావు
బాలధర్మోపాఖ్యానము—డి. సీతారామరావు

బాలనీతి కథావళి—డి. సీతారామరావు

బాలహితబోధిని—డి. సీతారామరావు

భారతనీతికథలు, భా. ౨—బి. నారాయణమూర్తి

భారతనీతిపద్యరత్నావళి—(సం) యం. శ్రీరామమూర్తి

వేమనపద్యములు (సటీ)—(ప్ర) కె. అచ్చయ్య అండు సన్స్, రాజమహేంద్రవరము

## పరిశిష్టము

అదాలతుకోర్టు తీర్పు - (విశ్వబ్రాహ్మణ వైదికాచరణను గురించి)—(ప్ర)సి. నారాయణశెట్టి, సికందరాబాదు

అన్యకుకోపన్యాసము (నగ్నపూరు తాలూకా తెలగసంఘము) — (ప్ర) బి. వెంకట్రామయ్య నాయుడు, ఏలూరు

అమావాస్యపద్యములు—యల్. ఖాసింఫీరాసాహెబ్

ఆంధ్రకావ్యసారము—(ప్ర) కె. వీరమల్లయ్య

ఆంధ్రగీర్వాణ శిక్షోపసహాప్రపీఠిక — (అను) యం. వేంకటరమణాచార్య

ఆంధ్రపత్రిక పందొమ్మిదవ సంవత్సరాది సంచిక—(ప్ర) కె. నాగేశ్వరరావు, మదరాసు

ఆంధ్రప్రశస్తి—వి. సత్యనారాయణ

ఆత్మసంయమము: అమితనివృత్తాసక్తి — (అను) కె. నరసింహము

ఆనంద వాచక పుస్తకము, ౧—(ప్ర) ఆర్. వెంకటేశ్వర్ అండు కో., మదరాసు

ఉడయవర్ వైభవము—(ప్ర) వి. పెరుమాళ్ శెట్టి అండు సన్స్, మదరాసు

ఏడవవాచకపుస్తకము, టిప్పణము — (సం) పి. యల్. నరసింహము

ఏలూరు మునిసిపాలిటీ—యం. తిమ్మయ్య

కలిపరాజయము—వి. వి. యల్. నరసింహారావు

కావ్యదిపణి—కాశీ వ్యాసాచార్య

కృతజ్ఞత—డి. వెంకట్రామయ్య

కృష్ణావతార నక్షత్రమాలిక—వి. భాష్యకాచార్యులు

కోరుట్ల వేదాన్తవ్యయవర్ధనీ సంస్కృతపాఠశాలా పఞ్చమ వార్షికనివేదిక—(ప్ర) యస్. నరసింహాచార్య, కోరుట్ల

గీతామంజరి—చింతా దీక్షితులు, ఏగ్గైరాలు

గురుజాడగ్రామ దేవస్థానముల చరిత్రము—జి. భాస్కరరావు

గృహస్థాశ్రమ రహస్యములు—యస్. యస్. వాసన్

జ్ఞానరత్నములు—(ప్ర) శ్రీరామకోటిదాసు ఏగ్గైరాలు, ఏలూరు

తెలుగు బాలబోధ—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

దంభాద్వైత నిరసనము—కె. గురుమూర్తి

నందికేశ్వరుడు—(ప్ర) వి. యస్. రత్నం అండు కో., తెనాలి

నక్షత్రమాల—యస్. కమలాబాయమ్మ

నరసాపుర శతావధానము—కె. కొండలరావు

నవకుసుమాంజలి—జె. వెంకటరామయ్య

నవరస ఆనందప్రదాయిని—మస్తాన్ షరీఫ్ సాహెబ్

నాగురువు (వివేకానందస్వామి ఉపన్యాసములు)—(అను) పి. వెంకటనారాయణ

నాల్గవవాచక పుస్తకము—కె. వీరేశలింగంపంతులు

నెల్లూరు గాలివాన—డి. పిచ్చయ్యశాస్త్రి

పతిభక్తి—సి. సత్యనారాయణరాజు

పద్మశాలీయ మహాజన-వినవసభా-రిపోర్టు—(ప్ర)యస్. వెంకటసుబ్బయ్య, అప్పయ్యరాజుపేట

పాతివ్రత్యధర్మము—జె. స్వామినాథ

పీసపాటి కోటేశ్వరశర్మగారి నిర్యాణవార్తికము - నర్సారావుపేట

పుష్పాంజలి—సి. నూరన్న

పోతనరత్నములు—(ప్ర) కె. వీరవెంకయ్య, రాజమహేంద్రవరము

ప్రచ్ఛన్న క్రైస్తవుల ప్రబోధ—వి. సుబ్బారెడ్డి

ప్రభాతము—టి. గోవర్ధనరావు

ప్రశ్నోత్తర రత్నమాల—శంకరాచార్య
ప్రసవారోగ్యనాటకము—జి. సూర్యనారాయణ
ప్రార్థనపద్యావళి—పి. సర్వేశ్వర
బాలకృష్ణలీలలు—బి. కోటీశ్వరరావు
మానవుల పూర్వావస్థ త్రిమూర్తులు పుట్టిన విధము—వై. సీతారామయ్య
మునిమాపు—యస్. సూర్యప్రకాశరావు
మొదటితరగతి క్రొత్త తెలుగువాచక పుస్తకము—యస్. భూషణం
యీనాములు—యం. రామరావు
రామదాసు బందిఖాన—బి. కోటీశ్వరరావు
రూరల్ సైన్సు—కె. వీరభద్రయ్య
రెండవవాచక పుస్తకము—కె. వీరేశలింగంపంతులు
లోకజ్ఞానము, తరగతి ౨, ౩—బి. సుబ్రహ్మణ్యం
వల్లీకల్యాణము; పరబ్రహ్మజననము; భీమార్జున గర్వభంగము—యస్. పి. పి. బి. వై. సరస్వతిస్వామి
శ్రీ నవగ్రహమండలీ (పదములు)—(ప్ర) పి. యస్. శర్మ అండు సన్స్, చిత్తూరు
శ్రీ మధ్వయదోష రహిత కందార్థములు, శ్రీ నిజసురు పూజావిధాన సహితముగా—కె. వీరయ్య
శ్రీమద్భారతసావిత్రి—సి. నరసింహసిద్ధాంతి
శ్రీరామనామము—(ప్ర) కె. కోటయ్యపంతులు, కావలి
సంస్కృత ప్రవేశిని—వి. దుర్గశర్మ
సత్యమును బోధించువా రెవ్వరు? స్వామి కృష్ణాజి—(అను) సి. రామయ్య
సరస్వతీ వాచక పుస్తకము, ౭—పి. రాఘవేంద్ర రావు
సరోజనీదేవి (ఉపన్యాసములు)—(ప్ర) యం. వెంకటకృష్ణశర్మ, మదరాసు

## పాకశాస్త్రము

నలభీమపాకశాస్త్రము—వై. కృష్ణరావు
మాంసపాకశాస్త్రము—కె. బాబురావు నాయుడు

## పురాణములు

పాతాళగంగా పురాణము—శ్రీనివాసరాఘవకవి
పాతాళగంగా పురాణము—వెంకటరామకవి
రుక్మిణీకల్యాణము—(ప్ర) యం. యస్. శర్మ అండు కో., తెనాలి
వామనపురాణము, భా. ౨—(అను) యస్. వీరరాజా

## ప్రకృతిశాస్త్రము

ప్రశ్నోత్తర సృష్టివిషయము—బి. సత్యనారాయణ
సృష్టిపరిశీలన - (రెండవవాచకము)—(ప్ర) పి. కుమారస్వామి నాయుడు అండు సన్స్, మదరాసు

## ప్రబంధములు

పాండురంగమాహాత్మ్యము—తెనాలి రామలింగకవి
మనుచరిత్రము—(ప్ర) పి. వెంకట్రామయ్య అండు బ్రదర్స్, రాజమహేంద్రవరము
సారంగధర చరిత్రము—చే. వెంకటకవి

## ప్రహసనములు

అంతగమ్మత్తు—జి. రామకృష్ణశాస్త్రి
కాకినాడ కన్నిపిల్ల—కె. సుబ్బారావు
కాటికి పోయి కాలనిముండ—సి. మల్లయ్య
నంద్యాల సైసు—ఏ. వెంకటశేషకవి
పెండ్లి పేరంటాండ్లు—జి. రామకృష్ణ సీతారామహోదరకవులు
మహానంది మజా—ఏ. వెంకటశేషకవి
మిత్రద్రోహము—కె. సుబ్బారావు
వెలయాలివేషాలు—ఏ. వెంకటశేషకవి
సరసులదివాలా—(ప్ర) యస్. యస్. మూర్తి, కాకినాడ
సోదెమ్మసోకు—వి. భాస్కరరావు

## భూగోళశాస్త్రము

క్రొత్త పడమటి గోదావరిజిల్లా భూగోళము—వి. పార్థసారథి

బెజవాడతాలూకా భూగోళము— జి. యల్. నరసింహం

నూతన చెన్నరాజధాని భూగోళశాస్త్రము—యస్. సుబ్రహ్మణ్యసోమయాజులు

నూతన భూగోళశాస్త్రము, పుస్తకములు ౨, ౩ — బి. రామచంద్రరావు

## మతము-హిందు

దేవాలయతత్వము—వావిలికొలను సుబ్బరావు

వైకుంఠఏకాదశీవ్రత ప్రశంస—(సం) వి. సుబ్బారెడ్డి

సనాతనధర్మము—సి. నారాయణరావు

## మతము-ఇతరములు

అద్భుత బర్లాము జోసఫాత్తు అనువారల చరిత్రము— జె. జె. అలన్

క్రీస్తు సిలువశ్రమల ధ్యానము — (అను) రెవరెండ్ ఇ. యల్. అనంతరావు

తెలుగు కీర్తనపుస్తకము (ఏసుక్రీస్తుమీద)—(సం) రె. యం. యల్. డాల్ బీర్

ప్రేమదాసు విజయము—(ప్ర) క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

బుద్ధపురాణము (ప)—డి. బలరామకృష్ణయ్య

## మాహాత్మ్యములు

మహానందిమహాత్మ్యము—ఏ. శేషయసూరి

శ్రీశైల మాహాత్మ్యము—(ప్ర) సుందరరాం అండు కో., బెజవాడ

శ్రీశైల మాహాత్మ్యము— (ప్ర) యస్. వి. రాఘవయ్య, కర్నూలు

సుబ్రహ్మణ్యేశ్వరీయము— జి. ఆర్. సీతారామశాస్త్రి

## యక్షగానములు

శ్రీ కృష్ణ తులాభారము— జి. హనుమంతరాయశాస్త్రి

## రాజకీయములు

ఆంగ్లేయరాజ్య పరిపాలన సౌకర్యములు—జాన్ చౌదరి

,,　　6వ ముద్రణము

గ్రామపంచాయతీలు— యం. రామరావు

జిల్లాబోర్డులు—యం. రామరావు

తరుణ హిందూదేశము—(అను) క. రాజారావు

తాలూకాబోర్డులు—యం. రామరావు

భారత స్వరాజ్యయుద్ధము—జి. సూర్యనారాయణశర్మ

## వేదాంతము

అద్వైతామృతసారము— యస్. కృష్ణస్వామయ్య

అనుభవ వేదాంతసారసంగ్రహము — క. గోపాలకృష్ణయ్య

ఆంధ్ర భగవద్గీతలు, 2-వ అ. — (అను) క. బాబురావునాయుడు

ఆనంద దస్తగిరిస్వామి తత్వములు—ఆనందదస్తగిరిస్వామి

ద్వైతసిద్ధాంత విచారము—(సం) క. కృష్ణాచార్య

మోక్షమార్గము—పి. వేంకటకృష్ణదాసు

రహస్యత్రయము— యం. వి. డి. వెంకటాచార్య

విభూతి విశ్వరూపము— (ప్ర) వై. కృష్ణమూర్తి, గుంటూరు

వైరాగ్య రంగరత్నాకరము—(ప్ర) ఆర్. వి. గోపాల కృష్ణయ్య, బెజవాడ

శివరామదీక్షితీయము, భా. ౧—ఆర్. శివరామదీక్షితులు

శ్రీరాజయోగాంతర ప్రబోధిని—జె. లింగయోగి

శ్రీ సీతారామాంజనేయ సంవాదము—(ప్ర) వి. కుప్పుస్వామి మొదలి, మదరాసు

స్నేహలత మోక్షమార్గము — (సం) యస్. వరదరాజులుశెట్టి

## వైద్యము

ఆకొండివారి వైద్యము—యం. సత్యనారాయణమూర్తి

ఆయుర్వేద వైద్యసారము—టి. మార్కండేయులు

గృహవైద్య చికిత్సాసారము, భా. ౧, ౨—యం. సూర్యనారాయణ

## శతకములు

అంతర్వేది లక్ష్మీనృసింహశతకము — క. వెంకటవరదాచార్య

కామేశ్వరీశతకము—తిరుపతి వేంకటేశ్వరకవులు
కృష్ణశతకము—(ప్ర) మారుతిరాం అండు కో, బెజవాడ
గాంధీ నీతిశతకము—డి. సూర్యనారాయణశర్మ
గోవిందశతకము—యస్. వి. జోగేశ్వరరావు
దాశరథిశతకము—(ప్ర) కింగ్ అండు కో., బెజవా
నీతిశతకము—పి. సుబ్రహ్మణ్యకవి
భక్తవరదార్థ శతకము—డి. పర్వేశ్వర
భాస్కరశతకము—(ప్ర) కింగ్ అండు కో., బెజవాడ
భాస్కరశతకము (పటీ)—(ప్ర) కింగ్ అండు కో., బెజవాడ
రత్నశతకము—వై. కృష్ణరావు
రాధారమణశతకము—యస్. యస్. కేశవరావు
వేంకటేశ్వరశతకము — రామకృష్ణ సీతారామసోదర కవులు
వైకుంఠతారకశతకము—సి. లక్ష్మణదాసు
శ్రీ మహాదేవలింగశతకము—జె. వీరయ్య
సీతాదేవిశతకము—ఆర్. కొండలరావుపంతులు
సుమతిశతకము—(ప్ర) మారుతిరాం అండు కో., బెజవాడ
సుమతిశతకము—(ప్ర) కింగ్ అండు కో., బెజవాడ
సుమతిశతకము — (ప్ర) సి. కుమారస్వామినాయుడు అండు సన్సు, మదరాసు
సుమతిశతకము—(ప్ర) కింగ్ అండు కో., బెజవాడ
హరిశతకము—యస్. చినసుబ్రహ్మణ్యశాస్త్రి

### సంగీతశాస్త్రము

గానవిద్యాకుమారి—(ప్ర)వై. శ్రీరాములుచౌదరి, ఒంగోలు

### సారస్వతము-భాష

భారతప్రయోగములు— యస్. సర్వారాయుడు

### స్తోత్రములు

కాళికాంబా స్తవము—ఎ. కాళీశ్వరప్రసాదరావు
కాశీప్రపన్నము—యం. వి. సుబ్బరావు
కృష్ణస్తోత్రము—సి. సింహాచలము
నందికేశ్వర స్తవము—యం. వెంకటకృష్ణరావు
పరమాత్మస్తోత్రము— పి. సుబ్బన్నకవి
మాతృపితృ మాహాత్మ్యస్తోత్రము—వి. హనుమయ్య
ముకుందమాలా (తెనుగుపద్య-అనువాద-టీకల సహా)— కులశేఖర
ముకుందమాల (తెనుగుపద్య-అనువాదముతో) — (ప్ర) యం. యం. వెంకటాచార్య
విష్ణు సహస్రనామ సంకీర్తనము వెన్నని వెయ్యిపేర్లవి నకరి—ఎ. నారాయణదాసు
శ్రీ రామాయణస్తోత్రము—వ. యోగానందయ్య
సీతారామ స్తవము—బి. వేంకటకృష్ణయ్యనాయుడు
స్తవరత్నావళి—యస్. కుప్పుస్వామయ్య
స్తోత్రరత్నావళి—పి. వెంకటాచార్య

### హరికథలు

గరుడోపాఖ్యానము-హరికథ—యస్. జగన్నాథకవి
జానకీశపథము—నారాయణదాసు
శ్రీమద్విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి హరికథ—కె. వెలగొండదాస్
శ్రీకృష్ణ తులాభారము—యం. వేంకటేశ్వరరాయశర్మ

---

## నడమంత్రపు సిరి

బసవరాజు అప్పారావుగారు

కోయి లొకసారొచ్చి కూసి పోయింది
మాయవానలు లోకమంత ముంచినవి!

*　*　*

పండొకటి చేతిలో బడి జారిపోయె,
మందువేసవికి చెల్లెండు జూపినవి!

*　*　*

మెఱుపొకటి మింటిపై మెఱిసి పోయింది,
ఉఱుములు జగతి నుల్లూత లూపినవి!

# వసుచరిత్ర రచనాకాలము

నేలటూరి వెంకటరమణయ్యగారు, యమ్. ఏ., పి-హెచ్. డీ.

వసుచరిత్రాదిప్రబంధములరచనాకాలమును నిర్ణయించు సందర్భమున గమనించదగిన విషయ మొకటి కలదు. గ్రంథస్థము లగు చరిత్రాంశములను బట్టియే రచనాకాలములను నిర్ణయించ వలసియున్నది. ఈచరిత్రాంశములు ప్రాయికముగ కృతిపతికి సంబంధించినవి. గ్రంథ మంతయు రచించిన వెనుకనే కృతిపతి గుణ శౌర్యాదులను వర్ణించు పీఠిక, ఆశ్వాసాంత ములు వ్రాయుట కవి సంప్రదాయము. ఈ సంప్రదాయోత్పత్తికి కారణ మిది: కవులు గ్రంథ ముల వ్రాసి ముగించి కృతిపతి నన్వేషించుటకు రాజసభలకుఁబోవుచు, దమచే విరచితమగు గ్రంథమునచ్చటచ్చట బఠించుచు, అనుకూలుడగు ప్రభువు దొరకిన నాతని కంకిత మిచ్చెడివారు. కావున కృతిపతి గుణాదులను వర్ణించు పీఠికాది పద్యములు అసలు గ్రంథము వ్రాయబడిన తరువాతనె విరచింపబడెడివి. కావున పీఠికాదులయందలి పద్యములు మనకు గ్రంథ రచనా కాలమును దెలుపజాలవు. గ్రంథరచనాకాల మనగా పుస్తకములోని కథాప్రారంభపు మొదటి పద్యము మొదలు పీఠికాశ్వాసాంత ములను ముగించువఱకును జరిగిన కాలము. ఈ కాలమును నిర్ణయించుటకు పీఠికాశ్వాసాంత ములు దోడ్పడవు. మఱి వానివల్ల దెలియునది యేది యనిన, కృతిపతికి కవి తనగ్రంథము నంకిత మిచ్చిన కాలము, అనగా గ్రంథరచనను ముగించిన కాలము. విమర్శకులు నిర్ధారణచేసి చెప్పగలిగిన దంతయు గ్రంథరచన ఫలాని సంవత్సరమున ముగిసినదని మాత్రమే.

ఈ దృష్టితో వసుచరిత్ర రచనాకాలమును-అనగా ఆగ్రంథరచనను ముగించిన కాలమును-విచారింతము. ఇంతకు పూర్వ మాగ్రంథము క్రీ. శ. ౧౫౭౦లో విరచింపబడెనని శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగారును నేనును వ్రాసియున్నాము. ఇప్పుడు పునః తద్విషయమును దడవుటకు గారణ మేమన, ఆగ్రంథము క్రీ. శ. ౧౫౭౦ లోనే ముగింపబడె ననుటకు ప్రబలమైన నూతన నిదర్శనము లభించుటయే.

వసుచరిత్రపీఠికలోని ఈపద్యమును దిలకింపుడు:

సీ. ఎంతకాలము మహాశాంతసంగతి దివ్య
దంతావళంబులు దరలకుండు
నెంతకాలము వరాహేంద్రు దద్వంద్వాగ్ర
కల్పము ల్వనరాశి గడపుచుండు
నెంతకాలము భుజంగేశు డాదిమ భిక్షు
పదనిషేవణనిష్ఠ బాయకుండు
నెంతకాలము గిరు ల్సంతతాభ్యున్నతి
నలహంసపద్ధతి నంటియుండు

తే. నంతకాలము దనయంద యచలమై య
నంతమై రత్నగర్భమై యవని నరయు
నెలరు గర్ణాటరాజ్య సింహాసనాధి
రాజ్య శుభశాలి తిరుమలరాయమౌళి.

ఈపద్యమున తిరుమలరాయలు నిరంతరము కర్ణాటరాజ్యము నేయుచుండును గాక యనికీవించినాడు రామరాజభూషణుడు. ఇందువల్ల తేలున దేమన,—

౧. వసుచరిత్రరచన తిరుమలరాయడు సజీవుడుగనుండగనే సంపూర్ణము చేయబడినదని.

౨. మఱియును నతడు కర్ణాటరాజ్య సింహాసనాధినాథు డైన పిమ్మట నని.

3. తిరుమలరాయడు క్రీ. శ. ౧౫౭౦ లో సింహాసనము నధిష్ఠించి పదునొకండు మాసములు రాజ్యము నల్పి పరమపదించెను. కావున వసుచరిత్రను తిరుమలరాయని కంకిత మిచ్చిన వర్ష మదియే, అనగా ఆ సంవత్సరముననే వసుచరిత్రరచన సంపూర్తియాయెను.

---

## రహోమధురిమ

విశ్వనాథ సత్యనారాయణగారు

నిన్నుఁ బిలచి నేనెప్పుడే నీవు మిన్నుల
నందకత్తియ వనిచెప్ప నభిలషింతు
జిలుగు క్రొన్నెలినీడల తళుకుసంజ
తనుకు నొక్కరహస్థలమ్మునకుఁ దార్చి.

ఆరహోవేళ నా సృష్టియందు మలచు
ప్రత్యణుస్థితి పులకితభావ మొందు
నాలుకొలిపిన సంయోగ నూత్నసరణిఁ
బ్రత్యణుస్థిరవీథిక పరిమళించు.

సాగరము చేరువేళకు శైవలిని, న
హ్రస్వథాభిన్న వేణికయాచు నూత్న
సంగసంరంభ మధురలజ్జాశకలిత
మైనరీతులు నీయందు నవఘళించు.



శ్రీమహోపాధ్యాయ, శ్రీమత్తిరుమల
గుడిమళ్ల వరదాచార్యులవారు, యం. ఏ.



వీరు నందననామసంవత్సరమున మచిలీపట్టణము నకు దాపునున్న చిట్టిగూడూరునందు జన్మించిరి. వీరు సుల్తానునగరము, గొల్లపాలెము ప్రాథమిక పాఠశాలలలోను,

బందరు హిందూ హైస్కూలులోఁ బ్రవేశ పరీక్షవఱకుఁ జదివి చెన్నపురివచ్చి రాజధాని కళాశాలలో బి.ఏ., (ఆనర్సు) చదివిరి. ఈ పరీక్షాఫలితమునకు ముందె వీరి తండ్రిగారగు శ్రీమాన్ నరసింహాచార్యులవారు చనిపోయిరి. కాని విద్యాభిలాష యధికముగ నుంటచేఁ దమ మాతులునకు పవర్ ఆఫ్ అటర్నీ యిచ్చి తమవిద్యాభ్యాసమును సాఁగించిరి. బి. ఏ., (ఆనర్సు) చదువుచుండఁగా దక్షిణాఫ్రికా దేశీయరక్షణ నిధికి రు. ౨౦౦ లు విరాళ మొసంగి తమకుఁ గల దీనవత్సలతను బ్రకటించిరి. ప్రవేశ పరీక్షనుండి పట్టభద్రుఁడగువఱకును సంస్కృతమును అభిమానవిద్యగాఁ బెట్టుకొని విశ్రాంతిదినములలో శ్రీమాన్ తాండవ కృష్ణమాచార్యులవారియొద్దను, శిష్టా నరసింహశాస్త్రులవారియొద్దను, దర్కమును సాహిత్యమును, వ్యాకరణమును జెంపొందించికొనిరి.

బందరు జాతీయకళాశాలయం దుపాధ్యాయులుగఁ జేరి తాము చెప్పఁగల పాఠము లాకళాశాలయందు లేకుండుటచేఁ దమస్థానమున మఱియొకరి జేర్పఱచి వారికి మాసమునకు నలుబదిరూప్యములనంతునఁ దామే వేతనము నిచ్చుచుఁ గొవ్వూరం గల యాంధ్ర గీర్వాణ విద్యాలయమునకుఁ బ్రధానాచార్యులుగ నియమింపఁబడి వేతనము లేకుండఁ బని చేయుచుండిరి. ఆవిద్యాలయమునకు సంబంధించిన పరిపాలనవిషయములఁ జక్కఁదిద్దవలెనని యత్నింపఁగాఁ దత్ప్రయత్నమునకు వైముఖ్య మేర్పడుటఁ దెలిసికొని విజయనగర సంస్కృతకళాశాలకు వైస ప్రిన్సిపాలుగా వెళ్లి పనిచేసిరి. వీరిబుద్ధి చాతుర్యమునకును,

విద్యాభిలాషకును మెచ్చికొని శ్రీ విజయనగర మహారాజులుంగారును, కిడాంబి రామానుజాచార్యులుగారు మొదలగు ప్రముఖులును కళాశాలకు సంబంధించిన వసతి గృహపరిపాలనమును (Hostel management) వీరి యధీనము నర్పి సంవత్సరమున కిరువదివేల రూప్యముల వంతున వీరి కొసంగిరి. వీ రీద్రవ్యమును విద్యార్థుల విద్యాబుద్ధులు వికసింపనుకును మార్గముల నాలోచించి వసతి గృహమునకు సంబంధించిన పనులకు వినియోగించి శ్రీ శ్రీ మహారాజులుంగారి యొక్కయు, రామానుజాచార్యులు మొదలగు విద్యావయోవృద్ధుల యొక్కయు నాదరాభిమానములఁ జూఱఁగొనిరి. సంస్కృతకళాశాలల పరిశీలనకర్త యగు పి. పి. యస్. శాస్త్రిలవారు (Superintendent of Sanskrit Colleges) లండను నగరమునకుఁ బోవు సందర్భమున శ్రీమహారాజావారి యనుమతిని, విద్యాశాఖాధ్యక్షుని కోర్కెపైని, వారి స్థానమున వీరు నియమింపఁబడి తృప్తికరముగఁ బని చేసిరి. శ్రీ శాస్త్రిలవారు లండను నగరమునుండి వచ్చిన తర్వాత వీరిని ప్రభుత్వమువారు కడప సర్కిలుఇన్‌స్పెక్టరుగా నియమించిరి. ఆయుద్యోగమున నుండుతఱి స్వతంత్రముగఁ బ్రాచ్యకళల బోధించు కళాశాల నొకదాని నేర్పఱచి పనిచేయవలెనని తలంచి విద్యాశాఖాధ్యక్షులు వలదనుచున్నను ఆయుద్యోగమునకుఁ దిలోదక మొసంగిరి. తరువాత కొవ్వూరునకువచ్చి మరలఁ బ్రవేశించి తత్సంస్థకు శాశ్వతనిధిని బ్రోవొనర్చుచుఁ బరిపాలనమునఁ గొన్నిమార్పులను సూచింపఁగాఁ గార్యదర్శులును, బరిపాలకవర్గమును వినకయునఁ దత్సంస్థను విడిచి స్వగ్రామమగు చిట్టిగూడూరునకు దయచేసి తమ తండ్రిగారి పేరిట "శ్రీనరసింహ సంస్కృతకళాశాల" నేర్పఱచి దాదాపు ౨౫ మంది విద్యార్థులకు భోజనాది వసతుల నయాచితముగ నొడఁగూర్చి పనిచేయుచుండిరి. ప్రాచీన గురుకులములవలె నీవిద్యాలయము నడచుచుండెను. ఉపాధ్యాయబృందమును, విద్యార్థిబృందమును దండ్రి కుమారులవలెఁ బరస్పరానురాగమున మెలఁగుచుందురు. వీరు సోదరోపాధ్యాయులయొడ సమభావమునఁ జరించుటవలననే కళాశాలయం దెట్టి యొడుదొడుకులును లేకున్నవి. వీరి సౌజన్యము, నిరాడంబరత్వములకు వీరి సవతి తల్లిగారగు ఆండాళమ్మగారే కారణమని తెలియుచున్నది. ఈకళాశాలకుఁ గొంతభూమిని, గొంతద్రవ్యమును విరాళముగానిచ్చి పరిపాలకవర్గ మొకదాని నేర్పఱచి వారి యధీనమొనర్చిరి. ఆంధ్రదేశమందలి యనేక లీకళాశాలలోఁ జదివి విద్యాతృష్ణను బాపుకొనుచున్నారు.

"మహోపాధ్యాయ" బిరుదము

నరసరావుపేట యందు ౧౯౩౧ సం॥ రము మార్చినెల ౭, ౮, ౯ తేదులందు శ్రీ శ్రీ ఉయ్యూరు రాజావారి యధ్యక్షతను జరిగిన పదునొకండవ యాంధ్ర సారస్వతపరిషద్వార్షికసభయందు శ్రీయాచార్యులవారి పాండిత్య విశేషములఁ, ద్యాగసంసేవనముల నభినందించి సభ్యులు "శ్రీమన్మహోపాధ్యాయ" బిరుదము నొసంగి సత్కరించిరి. వీరాంధ్రవిశ్వవిద్యాలయమునం గల సంస్కృతశాఖ కధ్యక్షులు (President, Sanskrit, Bd. of Studies)గ నెన్నికొనఁబడి తద్వ్యాఖ్యను అద్భుతముగా నిర్వహించుచున్నారు.

శ్రీ వరదాచార్యులవారు ప్రాచ్యకళోజ్జీవనమునకుఁ దగిన దోహదమొసంగుటకును, భాషామహోదధిని ద్రచ్చి రత్నముల వెలికి యాంధ్రసారస్వతలోకమున కొసంగుటకును, దగినశక్తి యుక్తులను, ఆయురారోగ్య భాగ్యములను, బరమేశ్వరుఁ డనుగ్రహించునని నమ్ముచున్నాఁడను.

కో. వేం. శర్మ.




శ్రీమతి డాక్టరు
సి. హెచ్. దాసమ్మగారు
యల్. యం. పి.




ఆహ్వానసంఘాధ్యక్షురాలు,
ఐదవ-ఆంధ్రరాష్ట్రీయ మహిళాసభ, గుంటూరు

శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు




అధ్యక్షురాలు,
ఐదవ-ఆంధ్రరాష్ట్రీయమహిళాసభ, గుంటూరు.

శ్రీమతి సుబ్బలక్ష్మి అమ్మగారు




సైదాపేట మునిసిపలుసంఘమున సభ్యురాలుగ నియమింపబడిరి.

శ్రీమతి ప. వెంకట రమణమ్మగారు




అనకాపల్లి మునిసిపలుసంఘమున సభ్యురాలుగా ఎన్నుకొనబడిరి.

శ్రీమతి గుడిపాటి రంగనాయకమ్మగారు




బెజవాడ మునిసిపలుసంఘమున సభ్యురాలుగా ఎన్నుకొనబడిరి.

### తీరుమానములు

స్వరాజ్యనిర్మాణమునకు భాషాప్రయుక్తరాష్ట్రములావశ్యకములుగాన రాబోవు రాజకీయపుసంప్రతింపులలోను, రాజ్యాంగనిర్మాణమునందును ఆంధ్రదేశమును ప్రత్యేకరాష్ట్రముగ నిర్మించు నేర్పాట్లు గావింపవలెనని యీసభవారుమహాత్మగాంధీగారికివిన్నవించుచున్నారు.

ఆంధ్రమహాసభను ఆంధ్రరాష్ట్రీయసభతోపాటు గాక ప్రత్యేకముగ నికముందు జరుపుట కేర్పాటు చేయవలయు ననియును, ప్రతిమండలమునందును ఆంధ్రమహాసభాస్థాయిసంఘమున కనుబంధసంఘము లేర్పాటు చేయుచు, సభలను చేయుచు, సత్వరముగా ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకుగాను తీవ్రమైనప్రచారము చేయవలయుననియును, ప్రతిమాసమునందును నొకసారియైనను స్థాయిసంఘము గూడవలయుననియును, మొదటిసమావేశము మద్రాసునందు ఆగస్టుమాసమునందు జరుపవలయుననియును ఈసభవారు తీర్మానించుచున్నారు.

ఆంధ్రమహాసభా స్థాయిసంఘము: అధ్యక్షులు: శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావుగారు; కార్యదర్శులు: శ్రీయుతులు పుల్లెల శ్యామసుందరరావుగారు, సుసర్ల నృసింహంగారు; శ్రీయుతులు కొండ వెంకటప్పయ్యపంతులుమున్నగువారు మరిముప్పదిమందిసభ్యులు.

---

# పండ్రెండవ ఆంధ్రరాష్ట్రీయమహాసభ

గుంటూరు 27-6-1931.

శ్రీ టంగుటూరు ప్రకాశము పంతులుగారు తమ యధ్యక్షోపన్యాసమున భావిరాజ్యాంగవిధానమునకు వలసిన దేశాభివృద్ధికరములగు పెక్కువిషయములనుగూర్చి చర్చించి తమ యమూల్యాభిప్రాయములను వెల్లడించిరి. భాషాప్రయుక్తరాష్ట్రవిభజన మత్యావశ్యకమని సిద్ధాంతము చేయుచు నిట్లు పలికిరి.

భాషలనుబట్టి దేశమును వివిధరాష్ట్రములుగ విభజించుటయే ఫెడరలువిధానమునకు మూలాధారము. మొదటి రౌండుటేబిలుసభకు వెళ్లిన ఆంధ్రప్రతినిధులు ...వ్వరును యీవిషయము గూర్చి ప్రస్తావింపకుండుట ...ల విచారకరము. పర్లాకిమిడిరాజాగారు ఉత్కళ ...ష్ట్రమును విడదీయగోరిరి. సింధురాష్ట్రమును, సరి...ద్దురాష్ట్రమును విడదీయవలెనని సర్ జాను సైమనుగారు ...దించిరి. ఈరెండువిషయములపట్లను రౌండుటేబిలు ...భవారు సుముఖతను జూపిరి. అట్టిచో రౌండుటేబిలు ...భయందున్న ఆంధ్రులుగాని ఇతరులుగాని, భాషా ... ...లుదొత్త ఆందోళనము ప్రారంభించినవారు ఆంధ్రులేయను విషయమును ఆసభలో తెలుపకుండుట మిక్కిలి శోచనీయము. ఆంధ్రరాష్ట్రమును విడదీయవలెనను ఆందోళన వీటన్నింటికన్న పూర్వమే ప్రారంభింపబడినదని వారు దెలుపలేదు. ఈసిద్ధాంతమును వెనుక రాష్ట్రీయశాసనసభవారును, భారతశాసనసభవారునుగూడ ఆమోదించియుండిరి. ఇందులకు ప్రతికూలురు కొంద రపుడును, ఇపుడును కలరు. ఇకముందుగూడ నుండగలరు. కాని దేశముమీద అధికసంఖ్యాకులు ఆమోదించియేయున్నారని చెప్పక తప్పదు. కాంగ్రెసువారు పదేండ్లకుపూర్వమే యీ సిద్ధాంతము నంగీకరించి రాష్ట్రవిభజనము గావించియున్నారు. భాషాప్రయుక్తరాష్ట్రవిభజన మత్యావశ్యక మనుటకు కాంగ్రెసువారు ఈపద్ధతి నవలంబించుటయే ముఖ్యనిదర్శనముగ నున్నది. భాషాప్రయుక్త రాష్ట్రవిభజనము కోరినచో నూతనరాష్ట్రనిర్మాణము చాల ఆలస్యమగుననియును,అందువలన ఫెడరలువిధానము నమలులోనుంచుట ఆలస్యమగుననియు గా॥ వి. ఎస్. శాస్త్రిగారు మున్నగువారు భయపడినట్లు తోచుచున్నది. అది నిజమే అనుకొనినను నూతనరాజ్యాం... విధాన మేర్పడిన కొంతకాలములోగా భాషాప్ర...

# ఆంధ్ర మహాసభలు, 1931 - గుంటూరు

## పదునెనిమిదవ ఆంధ్రమహాసభ

28-6-1931.

శ్రీయుతులు వరాహగిరి వెంకటజోగయ్య పంతులుగారు, అధ్యక్షోపన్యాసమున ఆంధ్రుల పూర్వపుటున్నతస్థితిని చాటిచెప్పిరి. ఇప్పటి హీనస్థితికి కారణము నిట్లు నుడివిరి:

ఇట్టిగొప్పస్థితి గల మనదేశమునకు ప్రస్తుత హీనస్థితి ఈస్టు ఇండియా కంపెనీవారు మనదేశ ప్రభుత్వము వహించి నప్పటినుంచి ఆరంభమాయెను.

వారు మన శాస్త్రపరిశ్రమమును, నౌకాపరిశ్రమమును అనేకపన్నులు వగైరాలు విధించియు, నితర ఉపాయములు బన్నియు, నిర్మూలముజేసిరి. ఇదిగాక లేనికారణములు గల్పించి, మనలను సైన్యమునుండి తొలగించి మన సాహసశౌర్యములను, యుద్ధచాతుర్యమును క్రమేణ శిస్తుమార్గముల నవలంబించి మనలను పిరికిపందలుగ జేసిరి. సైన్యములనుండి తప్పించుటయేగాక మనలను రాజ్యాంగవిధానములలో (సివిల్ అడ్మినిస్ట్రేషనులో) గూడ పూచీగల అన్ని ఉన్నతపదవుల నుండి తప్పించిరి. యీవిధముగ మన స్వతంత్రయోచనాశక్తులను నాశనముజేసిరి. మన హైందవదాస్యము పూర్తిజేయుటకు మనకు పాఠశాలలు వగైరాలలో జెప్పువిద్యయే కారణము. పాఠశాలలోని చిన్నతరగతుల నుండియు బ్రిటిషువారు హైందవులకంటె గొప్పవారనియు, శూరులనియు, విద్యావంతులనియు దెలుపు పుస్తకములను చదివించి మనయొక్క న్యూనతను బ్రిటిషువారి ఔన్నత్యమును, ఉగ్గుపాలతో బోధించిరి. బ్రిటిషు శూరుల చరిత్రలను జదివించిరి. మనశూరుల గుణసంపత్తులను తెలుపు [illegible]లను వెనుకబెట్టిరి. ఈచర్యవలన హైందవ స్థైర్యస్థయిర్యములు చెడి దాస్యభావము వృద్ధిఅయి విదేశీయుల రాజ్యపరిపాలనవలన గలుగు హీనస్థితినిగూడ మనకు స్వాభావికమని భ్రాంతిపడుచుంటిమి.

మరల పూర్వపుటున్నతస్థితికి వచ్చుటకు గ్రామపునర్నిర్మాణపద్ధతి యావశ్యక మనిరి. అందుకు ముఖ్యములయిన సాధనములివి యనిరి:

1. గ్రామపంచాయితీలు, 2. వడుకుట నేత మొదలగు పారిశ్రామికములు, 3. వ్యవసాయము, 4. విద్య, 5. పారిశుద్ధ్యము, 6. సహకారోద్యమము మొదలగునవి.

తరువాత నా సాధనముల తత్త్వమును చక్కగా వివరించిరి.

తదుపరి ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను నొక్కిచెప్పిరి. ఆంధ్రోత్కళ సమస్యను గురించి విరివిగ చర్చించుచు గంజాము మండలమునందలి ఆంధ్రులను, ఆంధ్రరాష్ట్రముననే చేర్చుటావశ్యకమని గట్టిగా చెప్పిరి.

కడచిన సంవత్సరకాలమున సంప్రాప్తి[ం]చిన దేశనాయకుల మరణములను గూర్చిన విచారపు తీరుమానములు, ఒకటిరెండు అభినం[]దనపు తీరుమానములు నయినతరువాత కొన్ని ముఖ్యము లగు తీరుమానములను గావించిరి.

శ్రీమతి పెనుబోతు వెంకటసుబ్బమ్మగారు




బెజవాడ పురపాలక సంఘమునకు సభ్యురాలుగా నెన్నుకొనబడిరి.

శ్రీమతి కుమారి దిల్నవాజ్ బైరాంజి



నాగపూరి నివాసులు. కీ. శే. ఖాన్ బహదూర్ బైరాంజిగారి కుమారిత. లండను నగరమున 'బారిష్టరు' పరీక్షయందు ఉత్తీర్ణయయ్యెను.

P. P. A.



బుచ్చి కృష్ణమ్మగారు

రాజమహేంద్రవర దేశీయవిద్యాలయ గౌరవ ప్రధానోపాధ్యాయురాలు. ఈమె శ్రీ॥ శే॥ బిరుమూర్తి హనుమంతరావుగారి సతీమణి, సుప్రసిద్ధ చిత్రకారిణి, స్థానిక దేశసేవికాసంఘ నాయకురాలుగనుండి, విదేశ వస్త్రబహిష్కరణమందు చాలపాటుబడిన యువతీమణి.



మ. శాంతాబాయిగారు

రాజమహేంద్రవర దేశీయ విద్యాలయమున గౌరవోపాధ్యాయురాలు, హిందీభాష నేర్పుచుందురు. మద్దూరు శ్రీరామశాస్త్రిగారి భార్య. దక్షిణ భారత హిందీ ప్రచారకమంత్రి హృషీకేశ శర్మగారి సోదరీమణి. విదేశవస్త్ర బహిష్కరణమునందు పాల్గొనిన దేశసేవికాసంఘ సభ్యురాలు.



గా. అలమేలుమంగమ్మగారు

రాజమహేంద్రవర దేశీయవిద్యాలయమున గౌరవోపాధ్యాయురాలు. ఆరోగ్యశాస్త్రము, గృహనిర్వహణకృత్యములు నేర్పుదురు. చాలాకాలమునుండి దేశీయ విద్యాలయోపాధ్యాయులుగ నుండి పనిచేయుచున్న గాడిచర్ల రామమూర్తిగారి భార్య. విదేశవస్త్ర బహిష్కరణమందు పాల్గొని పనిచేసిరి.



బొ. వెంకటచలమమ్మగారు

ఈమె రాజమహేంద్రవర దేశీయవిద్యాలయమున గౌరవోపాధ్యాయురాలు. సంగీతము, కుట్టుపని నేర్పుచుందురు. బొల్లాప్రగడ సుందరగోపాలరావుగారి భార్య. స్థానిక దేశసేవికాసంఘమున సభ్యురాలుగనుండి విదేశవస్త్ర బహిష్కారమున పనిచేసిన స్త్రీ రత్నము.



౫. సముద్రమునుండి రేవులోనికి ఓడలు పోవుమార్గము



౬. సముద్రమునుండి త్రవ్వినమట్టిని గొట్టముగుండ తీరమున వైచుట

# కీ. శే. వేదము వేంకటాచలమయ్యరుగారు *

గుఱ్ఱము వేంకట సుబ్బరామయ్యగారు, యం. ఏ.,



వీరు ౧౮౬౪ వ సం.౧౦ ఆగస్టు నెలలో గోదావరిజిల్లా పోడూరుగ్రామమున జన్మించిరి. తండ్రి వేంకటరమణశాస్త్రిలు, తల్లి లక్ష్మమ్మ. వేంకటరమణ శాస్త్రిలు విద్వద్వరేణ్యులు, శాంతమూర్తులు, ఋషికల్పులు. ఆకాలమున పోడూరులో నుపాధ్యాయులుగ నుండిరి. వేంకటాచలమయ్యరుగారికి ఇరువురు అన్నలు. జ్యేష్ఠులు జగద్విదిత విద్వత్కవిపుంగవులు, అపరమల్లినాథులు, కీ. శే. కళాప్రపూర్ణ వేంకటరాయ శాస్త్రిలు. ద్వితీయులు వేంకట సుబ్బయ్య అనువారు ఉన్నతవిద్యనభ్యసించి రాజమహేంద్రవరము టౌనుస్కూలు ప్రధానోపాధ్యాయులుగనుండి లేతవయస్సుననే చనిపోయిరి. వేంకటరమణశాస్త్రిలుగారు విశాఖపట్టణమున నార్మల్ స్కూలులో ఆంధ్రపండితులుగా ఏడెనిమిది సంవత్సరములు పనిచేసిరి, కావున అచ్చటనే వేంకటాచలమయ్యరుగారు తమబాల్యమును గడపిరి. మూడునాలుగు తరగతులు నార్మల్ స్కూలులో చదివి పిదప అచటిహిందూ హైస్కూలు (ఇప్పుడు ఎ. వి. యన్. కాలేజి) లోఁ జేరిరి. కొంతకాలము "కళాప్రపూర్ణ"ల యొద్దఁ గూడ విద్యాభ్యాస మొనర్చిరి. తరువాత ౧౮౭౮ వ సం. లో తండ్రిగారు రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజీలో ప్రధాన పండితోద్యోగమును స్వీకరించినందున వేంకటాచలమయ్యరుగారును ఆకాలేజీలోనే చదువుకొని ౧౮౮౩లో బి. యె. పరీక్షులైరి. ఏతరగతిలోను ఏవిషయమందును వీరు ప్రథమస్థానమునే గైకొనుచుండిరి. బి. యె. పరీక్షలో సంస్కృతమున రాజధానికి మొదటివారై విజయనగరము మహారాజాగారును, గోడేవారును ఇచ్చుచుండిన ౨౫౦ రూప్యముల బహుమతిని గడించిరి. ౧౮౮౪ లో టౌను ఇన్నిస్ పేట హైస్కూలు ప్రధానోపాధ్యాయులైరి. మఱుసంవత్సరమున వివాహము చేసికొనిరి. ఆమఱుసంవత్సరమున రెండవగ్రేడుప్లీడరు పరీక్షులైరి. ౧౮౮౭ లో అచటనే మహారాజా హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగఁ జేరి రెండేండ్లు పనిచేసిరి. అంతట తత్పూర్వము కావలికి ఎనిమిదిమైళ్ల దూరముననున్న స్వగ్రామము మల్లయపాలెము శ్రోత్రియములో తండ్రిగారు చేరియుండినందున వారికి సమీపముననుండవలయు నను కోరికతో వేంకటాచలమయ్యరుగారు కావలికి కాపురమువచ్చి మున్సిఫ్ కోర్టులో మూఁడుసంవత్సరములు న్యాయవాదులుగఁ బనిచేసిరి. తరువాత ౧౮౯౨ లో వీరు ఫస్టుగ్రేడు, బి. యల్. రెండును పరీక్షులై నెల్లూరులో న్యాయవాదవృత్తి నారంభించి జీవితాంతమువఱకు నచ్చటనే గడపిరి. మొత్తముమీఁద వీరు నలువదిసంవత్సరములకు పైఁగా న్యాయవాదవృత్తియందుండిరి. ఈ ౧౯౩౧ సం. నవంబరు ౧౨ వ తేదిని పరమపదించిరి. ఇప్పుడు వీరికి

* ఇందలి జీవితచరిత్రపు వివరములు కీర్తిశేషుల తమ్ములు బ్రహ్మశ్రీ వేదము సూర్యనారాయణశాస్త్రిలవారి వలన సంగ్రహింపఁబడినవి. వారి కీవ్యాసకర్త యెంతయు కృతజ్ఞుఁడు.

ఒకతమ్ముఁడును, ఇద్దఱు కొమాళ్లు, ఒక కొమార్తెయుఁ గలరు.

వీరు స్వయంకృషిచే పెక్కు భాషలను—ప్రాచీనములను, ఆధునికములను—నేర్చి వానియం దసమానపాండితి గడించిరి. అస్స్యూరి, హీబ్రూ, గ్రీకు, ల్యాటిను, ఉరుదు, పారసీకము, అవెస్త, జర్మను, ఫ్రెంచి, అఱవము, మళయాళము, కన్నడము మున్నగునవి. వీరు ముఖ్యముగఁ బ్రాచీనభూగోళము, ప్రాచీనచరిత్రము వీనియం దగాధపాండిత్యము నార్జించిరి.

నిక్కముగ వీరిజీవితము ధన్యము—న్యాయవాదివృత్తిలో నీతికి, విజ్ఞానమునకు, సత్యవాదిత్వమునకు, గౌరవప్రవర్తనకు వీరికి సమానులు వీరే. వెఱ్ఱిమాట యిసుమంతయును లేక తాము సత్యమని నమ్మిన దానిని ఎవరి ప్రోలనేని నిర్భీతిగా వ్రాసెడు ధీరోదాత్తులు వీరు.

తమ విశ్రాంతకాలము నంతయు గ్రంథపఠనమునందే, జ్ఞానార్జనమందే, సత్యపరిశోధనమందే వీరు గడపిరి. వీరి యమూల్యరచనలు ముద్రితములును, అముద్రితములును పెక్కులు గలవు. ముద్రితములు:

'భారతవిమర్శ', 'సప్తద్వీపములు', 'అగ్నిపూజ', 'భీష్మపంచకము', 'కతిపయశబ్దార్థశబ్దస్వరూపవిచారము' మొదలగునవి.

అముద్రితములలో: 'రామాయణవిమర్శ', 'లలితా సహస్రనామభాష్యము', 'అమరకోశ వ్యాఖ్య'. మొదలగువానిని పేర్కొనవచ్చును. తను వ్రాయసకాఁడు దొరకినయెడల, అది పనిగాఁ గూర్చుండి చెప్పుచుఁ బోయినయెడల కొన్ని సంవత్సరములవఱకుఁ జెప్పఁదగినంత విషయము తమయొద్దఁ గలదని వేంకటాచలమయ్యరుగారి తీవల నుడివిరి. ఇట్టిమహనీయులు, ప్రతిభాశాలులు పుట్టుట యరుదు. అట్టివారు మనయెదుట నున్నంత కాలము మనము వారికి తగువసతులు కలిగించి వారివలనఁ బడయవలసినంత జ్ఞానలాభము నొందకుండుట మన దురదృష్ట మనక తప్పదు.

పరమేశ్వరుఁడు శ్రీ వేంకటాచలమయ్యరు గారి యాత్మకు శాంతిని బ్రసాదించుఁగాక!

---

వీరు ఆంధ్రలోకమునకు చిరపరిచితులును, విఖ్యాతపండితులునగు శ్రీ॥ శే॥ వేదము వేంకటరాయశాస్త్రిగారికి కనిష్ఠసోదరులు. బహుభాషావేత్తలు: స్వదేశీయములు, పరదేశీయములునగు అనేకభాషలయందు వీరి కసమాన పాండిత్యము కలదు. ప్రథమమున కొంతకాలము రాజమహేంద్రవరమున ప్రధానోపాధ్యాయ పదవి నుండి యావృత్తిని వదలుకొని న్యాయవాదవృత్తి నవలంబించిరి. దాదాపు ముప్పదియైదు వత్సరములుగ నెల్లూరులో వీరు విఖ్యాత న్యాయవాదులుగ నున్నారు. తమవృత్తిని న్యాయ్యపథమున సాగించుచు వాసిగాంచిరి. బహుభాషల పరిశీలన ఫలితముగ పెక్కు అమూల్య వ్యాసములను ప్రకటించిరి. ఇంకను ప్రకటింపదగిన వెన్నియో కలవు. భారతియందు ప్రకటితములయిన వీరి నాలుగువ్యాసముల విలువను ఆంధ్రలోక మెరిగియేయున్నది. ఇంకను వీరి యీ యమూల్య వ్యాససంచయము నలంకరించుకొనవచ్చునుగదా యని భారతి మురియుచుండినది గాని విధివైపరీత్యము! శ్రీ వేంకటాచలయ్యగారు స్వర్గతులయిరి, భారతికోరికలు వమ్ములయినవి.

వీరి సుసంస్కృతమగు నాత్మకు పరమేశ్వరుడు శాంతి ననుగ్రహించుగాత!—భా. సం.

---




జాక్ చాప్ మెక్ (వైమానికుడు)

పదకొండేండ్ల వయసుగల యీబాలుడు న్యూయార్కున ఒంటరిగా విమానమును నడపెను.

## నూతన బ్రిటిషు ప్రభుత్వ మంత్రివర్గమున కొందరు



(1) రామ్సే మాక్డనాల్డుగారు, (2) స్నోడను ప్రభువు, (3) సర్ హెర్బర్టు శామ్యూలుగారు,
(4) బాల్డ్విను గారు, (5) సర్ ఫిలిఫ్ కన్లిఫ లిస్టరుగారు,



(6) శాంకీ ప్రభువు, (7) శామ్యూలుహోరు, (8) నెవిలుఛాంబర్లేనుగారు, (9, జె. హెచ్. థామసుగారు.

1. ప్రధానమంత్రి:—రామ్సే మెక్డానల్డుగారు, 2. ఇండియామంత్రి:—సర్ సామ్యూలు హోరుగారు, 3. కోశాగార మంత్రి (ఛాన్సలరు ఆఫ్ ఎక్సుచెకరు సెవిలీ) — ఛేంబర్లేనుగారు, 4. విదేశమంత్రి:—సర్ జాను సైమనుగారు, 5. వాణిజ్య సంఘాధ్యక్షుడు:—వాల్టరు రన్సిమనుగారు, 6. అధినివేశవసులమంత్రి(డొమినియన్సు):— జె. హెచ్. థామస్‌గారు, 7. కాలనీల మంత్రి:—సర్ ఫిలిపు కనులిఫ్-లిస్టరుగారు, 8. నౌకాబళ మంత్రి (ఫస్టు లార్డు ఆఫ్ అడ్మిరాల్టీ):— సర్ అయిర్సు మాన్సెలుగారు, 9. యుద్ధమంత్రి:— హెయిల్షాము ప్రభువుగారు, 10. విమానమంత్రి:— లండను డరీ ప్రభువుగారు, 11. స్వదేశమంత్రి:— సర్ హెర్బర్టు సామ్యూలుగారు, 12. కౌన్సిలు అధ్యక్షుడు (లార్డుప్రెసిడెంటు ఆఫ్ కౌన్సిలు):— స్టాన్లీబాల్డువినుగారు, 13. ముద్రాధికారి (లార్డు ప్రీవీ సీలు):— ఫిలిపు స్నోడనుగారు, 14. విద్యాశాఖాధ్యక్షుడు:— సర్ డోనాల్డు మెక్లీనుగారు, 15. వ్యవసాయ మంత్రి:— సర్ జాను గిల్మోరుగారు, 16. కార్మికమంత్రి:—సర్ హెన్రి బెటరుటనుగారు, 17. పనుల మంత్రి (ఫస్టు కమిషనరు ఆఫ్ వర్క్సు):— ఆరమ్సు బిగోరుగారు, 18. స్కాట్లెండు మంత్రి:— సర్ ఆర్చిబాల్డు సింక్లెరుగారు, 19. ఆరోగ్యమంత్రి:-సర్ హిల్టను ఎంజగారు, 29. లార్డు ఛాన్సలరు:—శాంకీ ప్రభువుగారు.

వీరిలో కన్సర్వేటివులు 11 మంది, లిబరల్సు 5 మంది, నేషనలు లేబరువారు 4 మంది, మొత్తము 20 మంది.



దీపహారతి  చిత్రకారుడు: టి. ఆర్. మహాలింగంగారు.




పాండురంగ దేవాలయ దృశ్యము. తుని.

చిత్రకారుడు: ఏ. సోమేశ్వరరావుగారు, బెజవాడ.

# టైపుయంత్ర చిత్రములు



౧. శ్రీ రామకృష్ణ పరమహంస



౨. కుక్క.



౩. బండిదొడ్డి.

చిత్రకారుడు: శ్రీ వి. సత్యనారాయణమూర్తిగారు.

## పరేలు(బొంబాయి) కడ బయలుపడిన ప్రాచీన శిల్పము

బొంబాయి రాజధానిలోని పరేలు గ్రామమున నొకబాట తయారుచేయుటకై మట్టిని త్రవ్వుచుండ ఆరడుగుల లోతులో నొకశిల బయలుపడినది. నసంపూర్ణములుగ కనుపించుచున్నవి. మధ్యవిగ్రహము భుజముపై మరిరెండు విగ్రహము లున్నవి. వాటికిని ఒక చేత జలపాత్రమును మరియొకచేత జపమాలయు నున్నవి.



దీని యెత్తు సుమారు ౧౧ అ, ౩.౫ అం; వెడలుపు ౬ అ. ౫ అం; మందము అడుగున రెండడుగులు, అగ్రభాగమున నొక యడుగును. ఈశిలయందు మొత్తము పదమూడు మూర్తులు కలవు. పీఠముచట్టముపై నొక పెద్ద విగ్రహము కలదు. దాని యెడమచేత నొకజల పాత్రమును, కుడిచేత నొక జపమాలయు కలవు. ఈ విగ్రహమున కిడమవైపున రెండు చిన్న విగ్రహము లున్నవి. అందు క్రిందిది వీణవాయించుచున్నది; పైది డమరుగమును,తాళములను వాయించుచున్నది. మహావిగ్రహమునకు కుడివైపు మరిమూడు విగ్రహము లున్నవి. అందు క్రింది రెండును ఫిడేలును, వేణువును వాయించుచున్నవి. మూడవవిగ్రహము కుడిచేత నేకతారయు, ఎడమచేతి కరతాళములును కలవు. పయినున్న రెండు

అదే మధ్యవిగ్రహము మెడపై మరియొక విగ్రహము అర్ధాకృతిది కలదు. దాని చేతులలోను జలపాత్రి జపమాలలు కలవు. మధ్యవిగ్రహము రెండుభుజములపై మరి రెండు విగ్రహములు చిత్రింపబడినవి. ఈరెండవ విగ్రహము మెడపై నీయర్ధాకృతి ప్రతిమ కలదు. దాని కటు అయిదు- ఇటు అయిదు- మొత్తము పదిచేతులు. ఎడమ అయిదింటిలోను అయిదువస్తువులు-పాశము, ఖేటకము, ధనుస్సు, డమరుగము, కమండులువు కలవు. కుడి అయిదింటిలో నీవిధముగనే శంఖము, ఖడ్గము, పరశువు, డమరుగము, అక్షమాల అను నయిదును కలవు. మధ్య విగ్రహములు మూటికిని నుదుట తృతీయనేత్రమును, జటామకుటమున చంద్రకలయు, చేతులలో వలయములును కలవు. మధ్యగల యీమూడవవిగ్రహము ఇందు ప్రధాన



మయినదని సన్నివేశమునుబట్టి చెప్పనగును. మకుట తృతీయనేత్రము, జటామకుటమున చంద్రకళ, వివిధములగు ఆయుధములు ఈశిల్పము శైవమని నిరూపింపజాలియున్నవి. బౌద్ధదేవాలయముల హరి హరి హరి వాహనయను విగ్రహమున మూడుమూర్తుల నొకదానిపై నొకదానిని మనము చూచుచున్నాము. ఈశిలలోని పైమూడు విగ్రహములయొక్క భావమే హైందవదేవాలయములలోని ఏకపాద త్రిమూర్తి యను విగ్రహమున కానవగును. ఈ రెండుభావముల నొకేచోట ఇముడ్పవలయుననియే శిల్పి ప్రయత్నించియుండవోపు.

మరియు, శాక్తారాధనమున త్రిమూర్తులలో నేదే నొకదానినుండి పెక్కు దేవాంగన లావిర్భవించుచుండుటను గాంచుచున్నాము; కాని ప్రకృతశిల్పమందలి పై మూడవ విగ్రహము పురుషవిగ్రహముగుట ఈవిషయమున శాక్తగ్రంథములను మనకు తోడ్పడజాలకున్నవి. టి. గోపీనాథరావుగారు 'Elements of Hindu Iconography' అను తమగ్రంథములో వివరించినమహేశుని వివిధరూపములలో నిదియొకటని యూహింపనగును.

పనితనమున చాలుక్యయుగపు శిల్పములకంటె ఎలిఫెంటా శిల్పములతో దీని కెక్కువ పోలిక కలదు. కాని ఎలిఫెంటా శిల్పములలోని అందము, అవయవసన్నివేశము దీనియందు కానరావు. ఎటులున్నను ఇది క్రీస్తుశకము పదియవ శతాబ్ది కిటీవలిది కాదని దృఢముగ చెప్పవచ్చును.

—Bombay Chronicle.

'ఆచార్య'

## తామస్ ఆల్వా ఎడిసనుగారు



తామసు ఆల్వా ఎడిసనుగారు కీ. శే. విద్యుచ్ఛక్తిని, గ్రామఫోను మున్నగు అనేకవస్తువులను కనిపెట్టిన మహావీరుండు అక్టోబరు ౧౮ వ తేదీన మృతినొందెను. మనము నిత్యము మనజీవితమునం దుపయోగించు వస్తువులలో చాలభాగము వీరి మేధాశక్తివలన కనిపెట్టబడినవే.

వీరు అమెరికాలో ఓహియోరాష్ట్రమున మిలాను నగరమున ౧౮౪౭ సం. ఫిబ్రవరి ౧౧ వ తేదీన జన్మించిరి. వీరితండ్రి శామ్యూలు ఇ. ఎడిసనుగారు డచ్చి జాతికి చెందినవారు. తల్లి నాన్సీ ఎడిసను స్కాట్లాండు దేశమునకు చెందినవారిబిడ్డ. తామసు తెలివితేటలందు తల్లినిపోలెను. ఈతనియత్నము లన్నింటికి కామె ప్రోత్సాహ మొసంగుచుండెడిది. దేహదార్ఢ్యమునందు తండ్రిని పోలెను. ఈతడు పాఠశాలయందు మూడు నెలలుమాత్రమే చదివెను. ఆమూడునెలలలో ఉపాధ్యాయు డీతని 'మొద్దబ్బాయి' అని విడచిపెట్టెను.

౧౨ ఏండ్లప్రాయమునందు డబ్బులేక యీతడు కనాడి యను గ్రాండ్ట్రంకు రైల్వేయందు 'డిట్రియటు' స్టేషనునుండి వచ్చిపోవురైళ్లలో వార్తాపత్రికల నమ్ముచు డబ్బు సంపాదించుకొనెడివాడు. అం దేమాత్రము మిగిలినను రసాయనశాస్త్రపరిశోధనకు వినియోగించెడివాడు. పత్రికలతోపాటు గ్రామముల ఫలసాయములుగూడ రైళ్లవద్ద విక్రయించుచు దాని రాబడివలన గ్రంథములు, పనిముట్లు కొనెడివాడు. ఇతడు రైలులో నొకపెట్టెయందే రసాయనపరిశోధనలు గావించుచుండును. ఈపరిశోధనల సమయమున సల్ఫ్యూరికు ఆసిడ్ బుడ్డీ ఒకటిపగిలి రైలుతినులబడునట్టి మంటలువచ్చినందున రైల్వే అధికారులు యీతని సామాను బయట పారవేసిరి. రైలుకండక్టరు ఒక్కలెంపకాయ కొట్టినందున ఒకచెవి శాశ్వతముగ చెవుడయిపోయినది. అటుపిమ్మట ఈతడు ఇంటివద్దనే రసాయన పరిశోధనలు గావించుచుండెను. రైలులో పత్రికలు విక్రయించు రోజులలోనే అమెరికాయందు అంతఃకలహములు పుట్టెను. అపుడు ఈతడు ముఖ్యమయిన వార్తలు స్వయముగా తంతివార్తద్వారా తెలియజేయుచుండినందున, ఈతడు విక్రయించు "డిట్రియటు ఫ్రీప్రెసు" పత్రిక విరివిగ చెల్లిపోయెడిది. పిదప తాను స్వంతముగ "గ్రాండుట్రంకు హెరాల్డు" అను వారపత్రికను రైలులోనుండియే ప్రకటించెను. నడచుచున్న రైలులో పత్రిక ముద్రించుటకు ఈతనిదే ప్రథమ యత్నము.

ఒకస్టేషనుమాస్టరుకుమారుని రైలుక్రిందపడిపోకుండ ఎడిసనుగారు తప్పించినందుకు ఆస్టేషనుమాస్టరు ఈతనికి ఉచితముగ టెలిగ్రాఫు నేర్పెను. అంతనతడు రైల్వే టెలిగ్రాఫిస్టు ఉద్యోగమును బడసెను. ౧౬ వ యేటనే టెలిగ్రాఫుచేయుటయందు గొప్ప నిపుణుడయ్యెను. తాను ఉద్యోగమునం దున్నపుడు రాత్రివేళ పనిచేయుచున్నపుడు, తానొకమూల గదిలో నిద్ర

పోవుచున్నను, మేలుకొనియున్నట్లే అవతల వానికి తెలియజేయునట్టి ఉపాయము యంత్రసాధనమువలన కనిపెట్టెను. తనతీరికవేళలందు తన అభిమానవిద్యయగు రసాయనశాస్త్ర పరిశోధన జేయుటకే యీపనిచేసినను, యజమానులు యీయుక్తిని కనిపెట్టి ఉద్యోగమునుండి తొలగించిరి. పిదప ననేకచోట్ల టెలిగ్రాఫిస్టు ఉద్యోగము చేసి తీరికసమయమంతయు పరిశోధన కార్యము సాగించుచునే యుండెను.

వీరు మొట్టమొదట కనిపెట్టిన పేర్వడినయంత్రమువలన ఎన్నికలసమయమునందు కాలము వ్యర్థకాకుండ ఓట్లు గైకొనవచ్చును. సభ్యులువచ్చి ఒకమీటనొక్కినచో ఆతనీయవలచిన వోటు కాగితముమీద అచ్చుపడును. ఈ యంత్రము పలువురకు నచ్చలేదు. కాని దీనివలన ఎడిసనుగారొక గుణపాఠము నేర్చుకొనిరి. ఇకమీదట క్రొత్త యంత్రమును కనిపెట్టి తాను శ్రమపడుటకు పూర్వమే అది నిజముగ పలువురకు ఉపయోగపడునదని రూఢిపరచుకొనుచుండెను. పైదానికి ౧౮౬౯ సం॥ పేటెంటుపొందెను. ఆతడు మిగుల్చుకొన్నదంతయు పరిశోధనలక్రింద వ్యయమగుటచే న్యూయార్కునగరమునకువచ్చి ఉద్యోగమునకై దేవులాడుచుండగా, ఒకపెద్దకంపెనీలో తంతివార్తలయంత్రము చెడిపోవుటచే తలుపులు మూయుచుండ మాచుటకు జనులు గుంపుగ చేరియుండిరి. ఆర్థికక్లిష్టపరిస్థితులేర్పడిన ఆసమయమున యీ కంపెనీ మూసివేసినచో చాలనష్టము సంభవించెడిది. కావున జనులగుంపులో చేరిన ఎడిసనుగారు చెడినయంత్రము బాగుచేయుదుననగా కంపెనీవారు ఆతని కవకాశమిచ్చిరి. ఆతడది త్వరలో బాగుచేసినందున వెంటనే ఉద్యోగమొసంగిరి. అచట పనిచేయుచున్నపుడే యీతడు "ఎడిసను యూనివర్సలు ప్రింటరు" అను యంత్రమును కనిపెట్టెను. ౫,౦౦౦ డాలరులకు యజమానులకు అమ్మజూపెను. వారు ౪౦,౦౦౦ డాలరు (౮౦౦౦ పౌనులు) లొసంగిరి. నాటినుండి యీతడు 'టెలిగ్రాఫు' నందు సర్వజ్ఞుడని యెంచబడెను. ఈ ద్రవ్యముతో నతడు న్యూజర్సీలో నొక కర్మాగారమును స్థాపించెను. క్రమేణ యీతడు టెలిగ్రాఫ్ శాస్త్రమునం దనేకము ఉపయుక్తమైన మార్పులు జేసెను. ఈ మార్పులవలన టెలిగ్రాఫ్ కంపెనీలకు ఎన్నియోకోట్లు లాభము కలిగెను.

పిమ్మట యీమేధావి టెలిఫోనుయంత్రమును వృద్ధిపరచెను. ఆదివరకు గ్రహంబెలుగారు కనిపెట్టిన పద్ధతిలో రిసీవరులో కొన్నిలోపము లుండెను. వాని నతడు వృద్ధిపరచి కార్బనుద్వారా శబ్దమును రవాణా చేయుపద్ధతి కనిపెట్టుటచే టెలిఫోను నేటిస్థితికివచ్చెను. వీరు కనిపెట్టినవాటన్నింటిలోను గ్రామఫోనుయంత్రము చాలముఖ్యమయినది. బహుళప్రచారముగలది. దీనిని ౧౮౭౭ సం॥న పేటెంటుపొందెను. అంతకన్న ముఖ్యమయినది విద్యుద్దీపము; విద్యుచ్ఛక్తిని నిలవాయుంచు బాటరీ, బయస్కోపు బొమ్మలు మున్నగునవన్నియు వీరు కనిపెట్టినవే. పేదవారలకు చవుకరకముగ గట్టిగ నుండునట్లు "పోర్టసిమెంటు" భవననిర్మాణపద్ధతిని కనిపెట్టిరి. ఈరీతిని వీరు కనిపెట్టినవాటన్నింటిగూర్చి యిచట పేర్కొనుటకు సాధ్యముకాదు.

౧౯౨౦ సం॥ సరికి వీరు అమెరికా ప్రభుత్వము వారివద్ద మొత్తము ౧౪౦౦ వస్తువులకు పేటెంటు పొందియుండిరి.

ఐరోపా యుద్ధ సంగ్రామమున వీరి అమోఘ మేధాశక్తి దేశమునకు రొక్కుడుగ వినియోగపడెను. అమెరికాకు జర్మనీనుండి వచ్చెడి రసాయనములు రానందున పదునెనిమిది దినములు కృషిచేసి వీరు కార్బాలికు ఆసిడు, తయారుచేయగల్గిరి. తనకర్మాగారమునందు ఈ రసాయనమును దినమునకు ఒకటన్ను తయారుజేయుచుండిరి. ౧౯౧౫ సం॥ అమెరికా విమానదళ-సలహా-సంఘము నియమింపబడినపుడు ఎడిసనుగారు అధ్యక్షులుగా నియమింపబడిరి.

## వీరి ఓపిక

వీరి జీవితకాలమునం దెక్కువభాగము క్రొత్త వస్తువులను కనిపెట్టుటకన్న వాటిని తనకర్మాగారములో తయారుజేసి విక్రయించుటయందే గడిపిరి. వీరికి ధన లాభముగూడ వీరికి వ్యాపారరీతిగనే లభించెను. అరువ

దవ జన్మదినమునాడు వీరు తమ కృషి నికముందు శాస్త్రజ్ఞానాభివృద్ధికి రెుక్కువ వినియోగింతునని సంకల్పించిరి. అంతవరకు కర్మాగారము వ్యాపారమునందే నిమగ్నులై యుండిరి. వీరికి ఓపికయు, పట్టుదలయు మెండు. పదునైదేండ్లపాటు దినమునకు ౨౦ గంటలు చొప్పున పనిచేసియుంటిననివీరే ఒకసారి నుడివి యుండిరి. వీరు కనిపెట్టినవానన్నింటిలో గ్రామఫోను మాత్రము ఆకస్మికముగ కనిపెట్టిరి. కాని తక్కినవన్నియు కృషిచేసియే కనుగొనిరి. టెలిఫోనులో పాడుచుండగ ఒకసూదివచ్చి వీరి వ్రేలునకు తగులుటచే దీనివలన శబ్దమును నిలవచేసి యుంచవచ్చునని కనుగొనిరి. వాయువార్తావిధానమునకు మూలసూత్రమునుగూడ వీరే కనిపెట్టి యుండిరి. వీరి పరిశోధనలపైని, వీరి యంత్రములపై ఇతరశాస్త్రజ్ఞులు కొంత అభివృద్ధిచేసి ప్రస్తుతావస్థకు తెచ్చిరి. నేడు పాశ్చాత్యదేశములలో నిత్యకృత్యములందు ప్రొద్దుపొడిచి క్రుంకులోపున ఎడిసనుగారు కనిపెట్టిన సామగ్రిలేనిది గడువకుండెను. మానవకోటి కింత మేలొనరించిన యీమహనీయుడు మరణించినపుడు అమెరికావాసులు గొప్పగౌరవముజూపిరి.

(ఇది వివిధాంగ్లపత్రికలలో ప్రకటితవ్యాసముల సారాంశము.)

జయంతి వెంకట కిరీటిరావు

---

## దేశములకు దివ్యసందేశము

### ౧

ఈశ్వరసందేశము మానవులకే కాదు; దేశములకుఁ గూడను. దేశములకును ఆత్మ కలదు.

*     *     *     *     *

ప్రజలకీ సందేశమును బోధించు వృత్తి గలవారె తమదేశ విబోధనల నతిక్రమించినపుడు శ్లాఘించుటకు ప్రథములు. ఈవిషయమున శ్రద్ధవహింపని మతప్రచారకులు ఈశ్వర సందేశము ప్రజలకుఁ దెలియనీకుండుటకు లంచ ము పుచ్చుకొనుచున్నారన్నమాట.

మహాత్మా! లెమ్ము. సత్యము నుద్ఘాటించినందులకు ఈయాచార్యులు నిన్ను నిందించిన నిందింపనీ. రాజులు నిన్ను కష్టముల పాల్చేసిన చేయనీ. ఎల్లరును ద్వేషించిన ద్వేషింపనీ.

*     *     *     *     *

దేశముకూడ తన యీపాఠము నేరువవలయును :— "నీ వితరుల భూముల నాక్రమింపరాదు. ఆత్మసంరక్షణో పాయ మెఱుఁగని జాతులఁ దుద ముట్టింపరాదు. పాలితదేశములపట్ల—నలసరాజ్యములయెడ-నత్యాచారము లొనర్పరాదు. శత్రుప్రభుత్వములకు విరుద్ధముగనైన నబద్ధ సాక్ష్యము పలుకరాదు. నీపొరుగువానిని ప్రేమింపవలయును. తెలుపు-నలుపు, ఆసియా-ఆఫ్రికా, బలశాలులు-దుర్బలులు, పెద్ద-చిన్న భేదము లేక యెల్లరను నీవలెనే ప్రేమింపుము."

ఇయ్యది దేశముల నుద్దేశించియే వ్రాయఁబడినది:— "మీ రన్యోన్యము ప్రేమింపవలయునని నాయాజ్ఞ. నీకితరులేది చేయరాదని తలఁతువో, దానిని నీ వితరులకొనర్పకుము. మీఋణముల నెగవేసికొనకుఁడు. మీవిరోధులను క్షమింపుఁడు."

'నీవు నిర్దోషివి గా నెంచితివేని నీకు లోఁబడిన రాజ్యములకు స్వాతంత్ర్యము నొసఁగుమని భాగ్యము, అధికారము గల దేశమునకు ఏసు చెప్పెను.

### ౨

ఈశ్వరపాలితము గాక, సీజరు సిద్ధాంతముల ననుకరించెడు ప్రజగల దేశము వ్యభిచార దేశమని ఏసు తలంపు.

*     *     *     *     *

కాలనీలు గల ప్రభుత్వమునకును, తొత్తుల నుంచుకొను మనుజునకును భేద మేమున్నది?

"కాలనీ"లనఁగా తెల్లని దుస్తులును, నల్లని హృదయములును గల యైరోపావా రుండెడి దూర దేశములు.

కాలనీ-సా జ్యము పాపపంకిలము.

*     *     *     *

వ్యభిచరింపఁగూడదను నీతి నెల్లరును వినుచునే యుందురు. అన్యదేశముల నాక్రమింప నూహించువాఁడు మానసికముగ వ్యభిచార మొనర్చినవాఁడే.

నీ సామ్రాజ్యమునందలి యొకభాగము నిన్నుఁ బడఁద్రోసినచో దానిని విడిచి నీవు వేఱుగ నుండుము. ఈమహాన్నాళ్లమురిపెమువలన సర్వసభ్యసమేతముగ నరకకూపమునఁ బడిపోవుటకంటె రాజ్యములు లేకుండుట మేలెన్నఁగదా!

దేశములు నరకమునకు వెళ్ళవు; అవి పాపమొనర్చినపుడు నరకమే వానియందుఁ బ్రవేశించును.

* * * * *

౩

"ప్రాపంచిక రాజ్యము లన్నియు నావే" యని యేసుతో సైతాను చెప్పినమాట సత్యశోభితము.

* * * * *

ఈశ్వర సామ్రాజ్యము సమీపించుచున్నది. ఇఁక ప్రాపంచిక సామ్రాజ్యములు పశ్చాత్తాపపడవలయును.

ఈశ్వర సామ్రాజ్యముదక్క మఱియేరాజ్యమును నిలువనికాలము వచ్చినది.

ఈశ్వర సామ్రాజ్యసందేశమును ప్రతిప్రాపంచిక రాజ్యమును నేర్చుకొనవలయును.

* * * * *

వ్యక్తులవలెనే దేశములును పరివర్తనము నభ్యసింపవలయును.

ఒకదేశము ప్రపంచము నంతటిని జయించినను, దనయాత్మను బోఁగొట్టుకొన్నచో లాభ మేమి?

ఉత్తరజన్మలోనే కాని యొకదేశ మీశ్వర సామ్రాజ్యమునఁ జేరలేదు.

* * * * *

క్రీస్తు సిద్ధాంతములను బుద్ధిపూర్వకముగఁ ద్రోసిపుచ్చు దేశములు క్రైస్తవదేశము లనఁబడుచున్నవి. తాను క్రైస్తవదేశము నని దేశ మనుకొన్నప్పు డందలి మనుజుఁడు క్రైస్తవుఁడు గాఁజాలఁడు.

* * * * *

లోన, పైన వెల్లవేసిన శవాగారములవలె ప్రపంచమంతటఁ దమ దురంతమును బ్రసరింపఁజేయుచున్న కపటపాలనముగల క్రూరప్రభుత్వము లంతమొందుఁగాక!

మరణము వీనియందే యిమిడియుండుటచే నివి నిర్నామవ్యములగును. శాపమును దప్పించుకొనుటకు పాఱిపోవ మీ కెవ్వరు నేర్పిరి? దేశముల క్రిందను వేళ్ళను దెగఁగొట్ట గొడ్డలి యెత్తఁబడి యున్నది. సత్ఫలములఁ గాంచఁజాలని దేశవృక్షము నఱుకఁబడును, దహింపఁబడును.

* * * * *

౪

న్యాయము లేని నాగరకమానవుఁడు గాని, దేశము గాని లేదు. నీతి మనుజులకును దేశములకు నొకటియే.

వైయక్తికమగు నేరము దేశముపట్లను నేరమే యగును.

* * * * *

దొంగతనము, ఆడితప్పుట, హత్య, బలహీనులపై దౌర్జన్యము, అశక్తునిపై పెత్తనము వ్యక్తియెడ నపరాధము లయినచో దేశములయెడను నపరాధములె. కాన దేశములును ఆకార్యము లొనర్పరాదు.

దేశము వ్యక్తికి ఆదర్శముగ నుండవలయును.

తనచర్యలు తనప్రజలకు మార్గదర్శకముగ నుండునట్లు దేశము మెలంగఁదగును.

* * * * *

ఒక పౌరుఁడు తనప్రభుత్వమునకంటె నేల ధర్మముగ సంచరింపవలయును?

తానొక పని చేసినందులకు దేశము గర్వించుచుం, నాపనినే యొకవ్యక్తి చేసినప్పుడు గర్హించి యతని నేల శిక్షింపవలయును?

* * * * *

"దేశభక్తుఁ"డనఁగా తనదేశము నితరులను హింసించినపుడును, వారిని కొల్లగొట్టినపుడును గర్వించి సంతసించువాఁడు.

తనకుమారుఁ డేపని యొనర్చినచో ననమానానలముచే సంతప్తుఁడగునో యాకార్యమునే తన మాతృదేశ మాచరించినచో గర్వోన్మత్తుఁ డగుచున్నాఁడు — దేశభక్తుఁడు.

బానిసదేశములలో మాత్రమే దేశభక్తి శౌర్య చిహ్నము.

* * * * *

యథార్థదేశభక్తులు అన్యుల యహంకారమును గాంచి సిగ్గిలువారు. యథార్థదేశభక్తులు పెరలచేఁ గారల యందుంపఁబడి బాధల ననుభవించువారు.

నీదేశమునకు హింస కలుగుచున్నచోఁ దిరుగఁబడుము. నీదేశ మితరులను హింసించుచున్నచో మరింత తీవ్రముగఁ దిరుగఁబడుము.

* * * * *

౨

"అనాగరకుఁడు" — ఇది యొకదేశ మన్యదేశముల పట్ల నుపయోగించు పదము. నిజముగ నెల్లరును నీపదమున కర్హులె.

బలహీనదేశములను మనము జయింపఁదలఁచినపుడు వాని ననాగరక మందుము. మనకంటె బలవంతులు మనపై దాడివెడలునపుడు, వారినిఁగూడ మన మట్లె యందుము.

ఆసియా యైరోపా యనాగరకత నవలంబింప యత్నించినచో, యూరపు అనునుగదా — "ఆసియా యిప్పుడిప్పుడు నాగరకతను నేర్చుకొనుచున్నది!....."

* * * * *

"నాగరకత" — మెఱుఁగుపెట్టిన యనాగరకత:

దేశములు తమ నాగరకతను తాము పరుల కొనర్పఁగల హానితోఁ గొలుచుకొనుచుండును.

రోగక్రిములు శరీరమునఁ బ్రవేశించినపుడు 'మా లాభముకొఱకుఁ గాదు; ఆత్మోన్నతి కొఱకే' యని నటించును.

* * * * *

"సంధి" — కొద్దివారిని లోఁబఱచుకొనుటకై గొప్పవారు తమలోఁ దా మేర్పఱచుకొన్న రాజీ.

రంగుజాతులు మన తరఫునఁ బోరాడినచో వీర శిఖామణులు; మనవిరోధులఁ గలసినచో మూఢశిఖామణులు.

"వర్ణద్వేషము" — ముఖ్యముగఁ దెల్లవారినిఁ బీడించుచున్న యొకదినుసు చర్మవ్యాధి.

* * * * *

ఎవరిని జయించుటకు యుద్ధ మనవసరమో వా రనాగరకులు.

అందరు నొకేవిధమగు వేషములు ధరించుటచే, నాగరకతానాగరకతలఁ గనుఁగొనుట కష్టతరము.

ఓ నాగరకమన్మన్యుఁడా! ఏల నీ దురుసుతనము? భవిష్యత్సామ్రాజ్యమున ననాగరకుఁడే నీకంటె ముందు నడచును.

* * * * *

"బలహీనదేశమును, ప్రాచీన జాతిని గౌరవింపు" మన్న నీతి సామ్రాజ్యములకే.

"ఓ బానిసదేశవాసులారా! మీరు నాదగ్గఱకుఁ జేరుఁడు. నేను మీకు వేయు సంకెల లంత దృఢములు గావు" అని సామ్రాజ్యములు మెల్లఁగ ననుచుండును.

చిన్నదేశములను వెన్నుచఱచి పెద్దదేశములు తమ క్రిందకు లాగుకొనును.

* * * * *

తమ దేహములను జంపఁ గలిగినను, తమజాతి యాత్మను జంపలేని వారిని జూచి పరాధీనదేశములు భయపడ నక్కఱలేదు.

*  *  *  *  *

పరాజితులు — పరాజితభావము విజేతలలోఁ బ్రవేశించినపుడు జయ మపజయ మగును.

పరాజితులను నూతన సామ్రాజ్యమునకుఁ జేర్చుటకు సన్ననిమార్గమును, చిన్న ద్వారమును గలవు; జయించినవారి నధోగతికి లాగుకొనిపోవుటకో — విశాల మార్గమును సింహద్వారమును గలవు.

*  *  *  *  *

చివర నున్నది మొదటికి రావలెనని చరిత్ర బోధించును. ఉన్నతి నొందినవాఁ డధోగతి నొందును. కనుక నున్నత సామ్రాజ్యము అన్నిరాజ్యములకును బానిస కావలసియున్నది.

*  *  *  *  *

జయించినవారికి భవిష్యత్తిట్లు చెప్పును — "నీ వితరులపట్ల వర్తించినట్లే యితరులు నీపట్ల వర్తింతురు." 'బలవంతులతో యుద్ధము తలపెట్టినందులకు తగినశాస్తి జరిగినాదని నీశత్రులతో నందువు. కాని బలహీనులపై కత్తికట్టినందులకు నూఱుమడుఁగు లధికముగ నీకు శాపము తప్పదు.

'నీవు తీసికొన్నది తిరిగి యిమ్మని నీశత్రువులతో నంటివి.

'నీవు మ్రింగినదానిని క్రక్కుము' అని యితరులు నిన్నందురు.

*  *  *  *  *

విజేతలు — భవిష్యత్తు ఆక్రమదేశములతో నిట్లనును: "శాంతిస్థాపనకై నే నీలోకమునకు రాలేదుసుమా! వాఁడిఖడ్గము నొక్కదానిం దెచ్చితిని. ప్రపంచమున నగ్గి ముట్టింతును."

మీరు దండించినశిశురక్తము మీకెదురు తిరిగెనది.

ఈశ్వర సమక్షమున నన్ని దేశములును సమానదేశము కావలెను. ఆతఁడు వానిని — గొఱ్ఱెలను, మేకలను విడఁదీయు గొల్లనివలె విడఁదీయును. గొఱ్ఱెలను కుడిప్రక్కను, మేకల నెడమప్రక్కను నుంచికొనును. అప్పుడు ఎడమనున్న వారితో "మీ రధోగతికిఁ బొండు. నా కాఁకలిగొన్నపుడొక్కకబళమైనఁ బెట్టలేదు. నేను రోగపీడితుఁడనై త్రాణ లేక యున్నప్పుడు మీరు న న్నాదరింపలేదు. శృంఖలాబద్ధుఁడనై యున్నప్పుడు నన్ను విడిపింపలేదు" అనును.

అప్పుడు వా రిట్లు మనవి సేయుదురు — 'దేవా! మేము ని న్నెప్పుడు నిర్లక్ష్యముగఁ జూచితిమి?'

ఈశ్వరుఁడు — 'నాసృష్టిలోని యేయొక్క చిన్న దేశము నాదరింపక పోయినను, సృష్టికర్తనగు నన్నాదరింపనట్లే'.

ఆదేశముల కిఁక దిక్కు లేదు.

*  *  *  *  *

సదుద్దేశము గల దేశములకుఁ గలుగునది శాంతి. మిగిలినవానికి నశాంతిపూర్వకమగు ఘోరమరణము.

"పాల్ రిచర్డ్".

— వడ్లమూడి గోపాలకృష్ణమూర్తి.

---

## స్వరాజ్యమా? సురాజ్యమా?

స్వశబ్ద మొక్క ధర్మపదమునకుఁ బూర్వమందున్నప్పుడే సరియగు నర్థమునిచ్చునుగాని యితరపదములకుఁ బూర్వమునమండి న్యాయ్యమైన యర్థము నొసఁగుట లేదు. ధర్మము దీనియర్థానుబట్టి యుండునుగాన తన కర్హముకాని పరధర్మము భయావహము కాకపోదు.

### స్వమతము

చూడుఁడు: స్వమత మనునది మతావేశములను బూర్వులందుఁ బెంచి పెద్దపెద్ద రాజాధిరాజుల కలహములకుఁ గూడఁ గారణమై, దుర్బలు లగువారి యాపదలకు నిదానమై, దేశములందలి యైకమత్యము నిశ్శేషముగ

వలసపోవుటకు హేతువై, పరదేశములవారు నిశ్శంకముగ లోపలకు జొచ్చుటకు వీలొసంగినదియై భరతఖండము నొకకాలమున నెంత కలవరపెట్టినదో. మహమ్మదీయుల దాడిచే ఒరంగల్లు, హనుమకొండ మున్నగుతావుల దేవాలయములలోని హిందువుల దేవతల శిలావిగ్రహములు మొదలంట నూడఁబెఱుకఁ బడుటయు, హిందుదేవాలయములు భిన్నభిన్నములయి రూపఱిపోవుటయు, హిందువుల మానప్రాణత్రాణముల సాధ్యములగుటయు నీస్వమతావేశపిశాచచేష్టితములే. ఈభరతఖండమునఁగాని, యితరదేశములఁగాని యొక్కొక్కదేశమున నొక్కొక్క మతము విజృంభించి చెలరేగినప్పుడు, దానికిఁ బ్రభువుల చేయూఁతలు బలమొసఁగుచున్నప్పుడు పరమతములవారు దుర్బలులై పడినబాధలు వర్ణింప శక్యములు కావుకదా. ఇట్లు కాక సుమతము కావలసినదని నావేశము ప్రవేశించియుండిన సుమతము నాదరించువారిలో మతముల లోని శ్రేష్ఠతలను నిర్ధారణసేయు సత్యాన్వేషణము లే ప్రబలమగాని సంఘమునకు శివకళయను నైకమత్యము నకు వేలుపురువనఁబడు పరస్పరకలహావేశము పెరిగియుండదుకదా.

స్వదేశము

స్వదేశమన్ని దేశములకన్న మిన్న కావలయునన్న నితరదేశముల తగ్గుదలనుగూర్చిన యాలోచనలు గూడ నాకార్యాలోచనలలోఁ గలసియుండక తప్పదు.

పరదేశములవారికిఁ గూడ స్వదేశాభిమాన మిట్లే పెరిగిన వారు కూడ వీరిదేశముతగ్గుదలకై పాటుపడక పోవుటకు వీలుండదు. అప్పుడు ఒకరిదేశము తగ్గిపోవుటకు మఱొకదేశమువారు కృషిచేసికొనుచుఁ బరస్పరకలహపరాయణులగుట తప్పనిపని. దీనిచేతనే ఐకమత్యమునకు స్వరూపనాశనము తప్పదు. అట్లుగాక, సర్వసమభావమను ప్రాచీనధర్మమునే శిరసావహించి యెల్లరు గడంగిరేని యొకరి హాని కొకరు పాటుపడువారుకాక అందఱునేమము కొఱకు నందఱును పాటుపడువారగుదురు. దాని నన్యాయము రూపుమాయును. స్వరాజ్యము స్వరాజ్యమందురు, న్యాయము పాలనమున లేనిచో స్వరాజ్యమైననేమి లాభము? న్యాయ్యపరిపాలనమైనఁ బరరాజ్యమువలని యాపదయేమి? అదిగాక స్వరాజ్యపదమున కర్థము లేదు. తనరాజ్యము ప్రతివాని కెట్లు కలుగును? తనకన్న భిన్నులగు కొందఱ నేలుట రాజ్యమనఁబడు. అట్టియెడ నొకఁడు రాజైన వానిచేఁ బాలింపఁబడువాఁడు ప్రజగా నుండి తీరవలెను. తనకే తాను రాజగుట సంభవింపనిపని. ఇక స్వరాజ్యమన్నఁ దనవారి రాజ్యమనవలెను. తనవారననే తనవలె మానవులని యర్థము తీసికొనిన నేమానవులైనఁ బ్రభువులు కావచ్చును. కావన సురాజ్యమునకు బోరాట యుచితము. సురాజ్యకాంక్ష సర్వసమ్మతము. సురాజ్యప్రయత్నములచే దుష్టులకుఁ దప్ప సుజనుల కెరికిని ఆపదలు కలుగవు. సురాజ్యమన న్యాయపరిపాలనము. న్యాయమును ప్రేమింపని జాతిగాని, న్యాయము వలదను లోకముగాని యుండదు. సర్వభువనములలో న్యాయము పరమేశ్వరరూపముగ నాదరింపఁబడు. అది సర్వశ్రేయములకు నిదానము. అట్టి న్యాయము సురాజ్యమున నంతర్భూతమై యుండు. దానికాంక్ష ధర్మకామమే. అది యిహపరసాధనమై జగముల యోగక్షేమములకై సర్వకాల సర్వావస్థలలో విరాజిల్లు.

---

## ఓట్ల సంప్రదాయము

ఈభరతఖండమున నింతవఱకుఁ గులాభిమానములు మానవమానససీమలనుండి సెలవుపుచ్చుకొని యుండలేదు. కులము లేధర్మముల నిర్వహణమున కేర్పడినవో, అట్టిధర్మములను నిర్వహించుట యనెడి కులముల సలక్షణత తప్పి దానివలని చెరుపుమాత్ర మప్రతిహతముగ నడచుచున్నది. అదియే కులములనాశన మని యోజించి కులముల యభిమానములు లేని సంఘములందువలె సంఘప్రాతినిధ్యము లేర్పడి యట్టిప్రతినిధులచే నిండిన శాసననిర్మాణసభలలో శాసనములు తీర్మానింపఁబడుట సభాప్రవేశము లేని జాతుల నిరంతరక్షీణతకును, గొప్పహానికిని ప్రబలకారణ మగుచున్నది. భూస్వాములే ప్రతినిధులగు



2. విశాఖపట్టణము (ఆకాశమునుండి)



విల్సన్ ఆనకట్ట తూములు (అలబామా)

చుండు నాచారమున, వీరిహృదయములు కులాభిమానవశము లగుచుండు సందర్భమున భూస్వాములుకాని జాతుల యభ్యుదయముల కట్టి సభ లెట్లు పాటుపడఁగలవు? ఏనాదులు, ఎఱుకలవాండ్రు మొదలగు నిమ్నజాతు లేమి, యుత్తమజాతులలోని కొన్ని తెగ లేమి, మొన్ని సర్కారు శిస్తులు కట్టక జీవించెడి జాతు లీదేశమున లేవు? అట్టి జాతుల సేమముకూడ దేశక్షేమముగ భావింపఁబడు లేని సంప్రదాయసిద్ధముగఁ జిరకాలమునుండి యీ దేశమున వచ్చుచుండెడి కులముల ననుసరించి యాయా కులముల వారికిఁ గులమున కిన్ని స్థానము లను లెక్కచొప్పునఁ బ్రతినిధిస్థానములు నిరూపింపఁబడిన దేశములలోని ప్రజయొక్క సర్వావయవములను సంబంధించినదై యాసభ తన తీర్మానములచే దేశము యోగక్షేమముల సంతరింపఁగలదగును. ఇట్టి సమావేశములే సర్వజనయోగక్షేమసాధకములని తోఁచినప్పు డైకమత్యమునుఁ జెడఁగొట్టునవి యని నిర్ణయింపఁబడినపుడు, తమ కందఱకును సంబంధించిన కులనిర్బంధములను సుళువుగ విడనాడుటకేని సమర్థము లగును. ఇట్లు కానినాఁడు వీకొందఱచేతనో నిర్ణీతములైన సంఘసంస్కరణశాసనములు చిరకాలమునుండి యలవాటులో జీర్ణించి యుండిన సర్వజనసంక్రాంత కులాచారనిర్బంధము వీడిపోకపోవుట కల్గుచుండును.

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

## పార్లమెంటు సభ్యురాండ్రు



'Commercial

---

# ఆగడము

బందా కనకలింగేశ్వరరావు గారు

ఆటమటం జెందేటి ఆకుపొత్తిళుల
మైమఱచి నిదురించు పూవుబిడ్డల్ల
గిలిగింత పెట్టేవు కలచివేశేవు
పిల్లవాడవ? నీకు బుద్ధిచెప్పాలా?
మాను మీయాగడము మాను మిక చంద్ర!

జలజలా ప్రవహించు సెలయేళ్ళలోన
గలగలాదొల్లేటి సంద్రంపుటలల
మాటికిమాటికి నీవు ఈతలాడేవు;
శీతలము గ్రమ్మింది చూచుకొనవేమి ?
మాను మీయాట లిక మానుమీ చంద్ర!

దట్టమై పెనుతీగ లల్లుకొనుచోట
పూబొదలలో వారు చేరుకుంటారు
తీగసందులనుంచి నిక్కిచూచేవు
కొంటెవాడవు; నీవు కుఱ్ఱడవ? చంద్ర
మానుమీయాగడము, మానుమికమీద;

తెల్లన్ని నీటిపై తేలియాడేకలువ
కౌగిటిలో మెలగేవు కేలిసలిపేవు;
నీ పున్నమేపండింది—పోని మాకేమి
తలవంచి తలపోయు నాదెసం జూచి
పకపకానవ్వేవు ఇంతయాగడమా ?

ఒంటరిగ తల్పమున యొరగియున్నట్టి
భామినీమణి నేల బాధపెట్టెదవు
మగవారులేనిచో మగువలకు నింత
మోసమును తెచ్చెదే, మర్యాదలేదా ?

పాలవంటీకులము చెఱుప బుట్టావా
ఆగడము చాలించు చాలించు చంద్ర!

‘చెమ్మచెక్క’డేటి చెలుల జటలే చూచి
నల్లమబ్బాలంటు, నసుగుచున్నావా
కృష్ణసర్పములంచు, కుందుచున్నావా—
పోరుసల్పంగాను పవమాను దెచ్చేవు
తగవులాడేబుద్ధి తగదయ్య నీకు
ఆగడము మానుమీ యికమీదనైన.

చుక్కలను మబ్బులను చూడవచ్చాను
గాలిలో విహరింప కోరివచ్చాను—
పాటలంటే ఏమొ ఎఱుగన్ని నన్ను
పాటపాడేటట్టు చేశావు చంద్ర!
ఇదియేమి యాగడము వింతయాగడము?

నీ యాగడము లెంచి యోర్వగాలేక
పద్మినీకాంత లదె పెడమోముపెట్టె
శశికాంతశిల లవే నిలువునీరయ్యె
చక్రవాకపుజంట మంటగలిసింది
జాలియైనాలేద, చిన్నిజాబిల్లి
ఇకనైనమానవా ఈ యాగడమ్ము?

ఎంతసే పీలాగు సంచరించేవు
నీవైరి ఎవడైన చోరవనేతెంచి
నీయాగడములన్ని యడగించలేడ ?

తెలతెల్లబోయెదవు చిన్నిజాబిల్లి
తెలతెల్లపోవు నీకలువపూవపుడె
తేలిపోవును నాదు భావాలుగూడ
తేలిపోవును నాదు పాట యావేళ.

---




### భాగవత కథాలహరి

పండిత ద్రోణంరాజు సీతారామారాయ ప్రణీతము. ప్రకాశకులు: ఆర్యపుస్తకాలయము, రాజమహేంద్రవరము. ౧౮౫ పుటలు. క్రౌను సైజు. వెల రు. ౧.

ఇందలి కథ లన్నియు సులభశైలిని వచనరూపముగ జనసామాన్యమునకు సుబోధమగునట్లు రచింపబడినవి. కథలయందు రసవంతములగు పట్టుల భాగవతమునందలి పద్యములును కూర్పబడినవి. ఇట్టిగ్రంథము లెంతయు ఈకాలమున ఉపయోగముగ నుండగలవని ప్రత్యేకముగ వ్రాయ నక్కరలేదు. ఇట్టి గ్రంథములను పాఠశాలలందు బాలబాలికలచే పఠింపజేసిన వారి హృదయసీమలయందు భక్తి జ్ఞాన వైరాగ్యబీజములు నాటుకొనగలవనుట నిర్వివాదాంశము. ఒక విద్యార్థులకే అనలేల, జనసామాన్యమునకుకూడ ఇవి భక్తి జ్ఞాన వైరాగ్యములను కలుగజేయగలవు. సాధారణముగ సామాన్యులకు భాగవతము అర్థముకాదు. అట్టితరి ఇట్టి గ్రంథములు వచనరూపముగ సులభశైలిని వ్రాసి ప్రకటించినందులకు ప్రకాశకులు, గ్రంథకర్తయు ఎంతయు ప్రశంసనీయులు. కాని గ్రంథము వెల చాల హెచ్చుగ నున్నది. జనసామాన్యము కొనుటకు కష్టముగ నుండును. ౮ అణా లనుచో కొంత వరకు జనసామాన్యమునకు అందుబాటుగ నుండగలదు.

జ. సాం.

---

### రాజయోగము

గ్రంథకర్త: స్వామి వివేకానంద. అనువాదకుడు: జి. ఎల్. నరసింహారావుగారు. ప్రకాశకులు: శ్రీరామకృష్ణమఠమువారు, మైలాపూరు, చెన్నపురి. క్రౌను సైజు: ౩౫౨ పుటలు. (వెల తెలియదు.)

---

### ఉపదేశామృతము

(ప్రథమభాగము.) శ్రీహరనాథ ఠాకూరుగారిది. తర్జుమాచేసినది చింతా దీక్షితులుగారు. ప్రకాశకులు: పి. ఆర్. దాస్‌గారు, శ్రీహరనాథతత్త్వప్రచారిణీసభ, ఆంధ్రబ్రాంచి, సూర్యారావుపేట, కాకినాడ. క్రౌను సైజు: (జీవిత సంగ్రహముతో) ౨౨ + ౧౦౧ పుటలు. వెల ౮ అ.

---

### శ్రీనాథకవి

(జీవితము.) గ్రంథకర్త: ఆంధ్రచరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావుగారు. ప్రకాశకులు: ఆర్యపుస్తకాలయము, రాజమండ్రి. డెమ్మీ సైజు: ౨౮౨ పుటలు. (వెల తెలియదు.)

---

### ప్రభుత్వధనము - మన బీదతనము
### (Public Finance and Our Poverty)

ప్రొ. జె. సి. కుమారప్పప్రణీతము. గాంధిమహాత్ముని ప్రస్తావనతో. జాతీయగ్రంథమాల-౧; సంపాదకులు: కనిపారపు సుబ్బారావు, బాలాంత్రపు సత్యనారాయణరావుగార్లు, పిఠాపురము. క్రౌను సైజు: ౨౦౦ పుటలు. వెల ౧౦ అ.

---

## దండియాత్ర ప్రవచనములు

గాంధిమహాత్మునివి. అనువాదకుడు: బౌద్ధవాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా. క్రౌను ౧౬ సైజు: ౧౨౦ పుటలు. వెల 3 అ.

---

## శ్రీసూక్తిరత్నావళి

(శతకము) కర్త: శనగల హనుమయ్యగారు, పాలపర్రు, బాపట్లతాలూకా, గుంటూరుజిల్లా. వెల ౪ అ.

---

## ఉత్తరరామచరితము

భవభూతి మహాకవికృత సంస్కృతనాటకమునకు ఆంధ్రానువాదము. అనువాదకర్త: జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. యల్., ముక్తీశ్వరము, తొత్తరమూడిపోస్టు, తూర్పుగోదావరిజిల్లా. డెమ్మీ సైజు: ౧౪౯ పుటలు. వెల రు. ౧.

---

## ఖిల్జీ రాజ్యపతనము

(చరిత్రాత్మక నాటకము.) గ్రంథకర్త: కుండిమెడ వెంకటసుబ్బారావుగారు, కళాభవనము, ఛత్రపురము, గంజాంజిల్లా. డెమ్మీ సైజు ౧౧౯ పుటలు. వెల రు. ౧.

---

## (i) అంతర్జాతీయ ధర్మశాస్త్రము

(International Law.) క్రౌనుసైజు: ౧౪౫ పుటలు. వెల ౧౦ అ.

## (ii) స్వీయ చరిత్ర

క్రౌనుసైజు: ౧౬౨ పుటలు. (వెల తెలియదు.)

పై రెండిటికి కర్త: వల్లూరి సూర్యనారాయణరావుగారు, బి. ఏ., బి. యల్., యల్. టి., కొవ్వూరు, పశ్చిమ గోదావరిజిల్లా.

---

## మేఘదూత

కృతికర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. నెల్లూరు. (ఆంధ్రగ్రంథమాల—౧౬.) క్రౌను సైజు: ౬౨ పుటలు. వెల ౧౨ అ.

---

## శతశిల్పి చిత్రలేఖనము

మొదటి తరగతి. ౧౬ పుటల చిన్న డ్రాయింగు పుస్తకము. గ్రంథకర్త: మా. నరసింహగారు, శతశిల్పి; శిల్పాశ్రమము, గుంటూరు.

---

A Report of the XX1 All India Ayurvedic Conference and Exhibition held at Mysore during Dec. 1930.

(౨౧ వ నిఖిలభారతాయుర్వేద మహాసమ్మేళన కార్యనివేదిక — ఆంగ్లము.) ప్రకాశకులు: ఆహ్వాన సంఘమువారు, మైసూరు, డెమ్మీసైజు: ౭౪ పుటలు.

---

## యువతీవివాహభాగ్యోదయము

సాంఘికనాటకము. గ్రంథకర్త: కలుగోడు అశ్వత్థరావుగారు. రాయలసీమ ముద్రాక్షరశాల, బళ్లారి. డెమ్మీసైజు: ౭౭ పుటలు. వెల రు ౧-౦-౦.

---

## జ్ఞానాంజలి

పూర్వార్ధము. గ్రంథకర్త: పెనుమెచ్చ సత్యనారాయణ రాజుగారు, ప్రధానాంధ్రోపాధ్యాయులు. బోర్డుహైస్కూలు, తణుకు. పశ్చిమగోదావరిజిల్లా, ఐదు గీతపద్య శతకములు. (వెల తెలియదు.)

---

అయయో! నాథునిపై బదం బిడుచు నృత్యం బాడు,తత్ బోలి ని
న్నయినన్, నన్ దిగనాడి, సూక్ష్మమున నాట్యం బాడ నేమించెనా
ర్య! యెట్లైనన్ 'కూతురివృత్తి మాత'దనుసామ్యం బొప్పెనే చిట్టి! నీ
పయనంబప్పుడు నీవు పల్కినటు 'లోపం బంబ రానిచ్చునే' !!!

నీవు మహాపతివ్రతవు! నిక్కము! వెంకటరత్నమా! ఉమా
దేవికి స్వాంశ వాటఁ, జనుదెమ్మనె నామె! ప్రయాణ మైతి, వా!
పోవుట నోర్చెదన్! మఱచిపోయి, చటుక్కున నైక్యముక్తినం
దేవుసుమా! నగం బయిన దీనునిరాక నిరీక్ష సేయుమా!!!

కవులై, భక్తకణంబులై, పరమనిష్కామ్యాత్తదాంపత్యవై
భవలీలాస్పద మైనయుగ్మ మవినాభావప్రమాణంబె యౌ
నవు! నం, చీవు నిజేజునం(?) దిటికి! గాయత్రీ! మమున్ వేఱువే
ఱవు,నన్ పాప మి దేల? కూర్చవలె నెష్టై నన్ కృపాపూర్ణవై!!!

గాయత్త్రీ! సతిచిట్టి నాయెదుట స్వర్గప్రాభవం బంద నే
హేయప్రాకృతశక్తి నుంట పరువా! యీదృష్టినిన్ మార్చుకో
వోయీ, యం చపహాస్య మాడఁ జనదే! యుగ్మోక్తి యేకాత్మకం
బాయెన్! వృత్తినివృత్తి యౌటె భవదీయా దేశవైచిత్ర్యమా!

అమ్మయు బిడ్డయున్ గలసి, యాలన పాలన లేక, నన్నని
ష్టమ్మున వీడ! నూరుకొనఁ జాల? శపించెదనేమొ! అంబరో!
ఇమ్మిఁక, స్థూలసూక్ష్మముల నేకముగాఁ గనఁజాలుజ్ఞాననే
త్రమ్మును! భేదమున్ దొలఁచి తథ్యపుకూడికఁ గాంచుచుండెదన్

అంబా! నే నిఁక శాంతి రస్తనెద! పుణ్యస్త్రీవి చిట్టీ! విడో
గంబున్, కానఁగరానికూడికగ, సూక్ష్మప్రజ్ఞ నంకించి థై
ర్యంబున్ బూనెద! చేయఁగావలయుకర్మన్ నెట్టి, ఖేదాంతనా
ట్యంబున్ కాలమునన్ ముగించెద! శివధ్యానాధ్వనీనుండనై!!!

# సాభిప్రాయ విశేషములు

రెండుశిబిలు సమ్మావేశ నాటకమునందు రెండవ అంకము ముగిసినది. మొదటిఅంకమును సంజయ రాయబారము వలెను రెండుపక్షములవారును మంచిమాటలతో ముగించిరి. రెండవ అంకము గాంధిమహాత్ముని రాయబారముతో నారంభమైనది. మహాభారతమునందలి శ్రీకృష్ణ రాయబారము వలెను గాంధి రాయబారమును ప్రపంచేతిహాసములందు శాంతియుగ స్థాపనమునందు గంభీర మనోహరఘట్టముగ నుండగలదు. ప్రపంచమునం దన్నియుగములందును ధర్మజులు దుర్యోధనులు, శ్రీకృష్ణులు, ధృతరాష్ట్రులు, భీష్ములు భీములు, అర్జునులు కర్ణులు, గాంధారులు ద్రౌపదులు మొదలగు దైవాసురశక్తిసంపన్నులు సంభవించుచు ప్రపంచాభ్యుదయమునకు దోడ్పడుచుందురు. సందిగ్ధసమయములందు దయా సత్య శాంతి ధర్మపరము లైన మానవప్రయత్నములు విఫలము లగుటయును, తద్వ్యతిరిక్తమైన ప్రయత్నములు సఫలము లగుటయును ప్రపంచేతిహాసములందు ప్రసిద్ధ విషయము.

అల్పజ్ఞు లైన మానవులకు విశ్వప్రవృత్తియందలి ఘటనాఘటనలు దుర్గ్రాహ్యములు. అహంకార మమకారపరాయణులైన మానవులకు జగన్నాటకసూత్రధారుల ఘటనాఘటనలు దురవగాహములు. ప్రపంచప్రవృత్తియందు సర్గప్రతిసర్గలు సహజావస్థలు. శాంతియందు సమరము, సమరమునందు శాంతి సహజావస్థలు. శాంతిపర్వోదయమునకు యుద్ధపర్వ మవసరమైనది. సామాన్యవ్యవహారములందు శాంతిసమరములను నిర్దేశించుట దుర్లభమైనను మహాప్రస్థానమునం దీ విషయనిర్ణయము పరమావసరముగ నున్నది.

శ్రీకృష్ణపరమాత్ముడు పార్థునకు కురుక్షేత్రమునందు జేసిన ధర్మోపదేశము మానవుల మోహావేశమునకు నిదర్శనము:

శ్లో. స్వభావజేన కౌంతేయ, నిబద్ధ స్స్వేన కర్మణా;
కర్తుం నేచ్ఛసి య న్మోహా-త్కరిష్య స్యవశో ౭పి తత్.

భగవద్గీత—అ. ౧౮-౬౦.

చిరకాలోపార్జితమైన మహా సంస్కారము ప్రపంచప్రవృత్తి కనతిక్రమణీయము. సంగ్రామధర్మపరాయణ మైన ప్రపంచమునందు శాంతిధర్మమును ప్రతిష్ఠించు టత్యంత దుర్లభము. శాంతిధర్మపరిగ్రహణారాధనముల కపారమైన దుఃఖానుభవ మత్యంతావసరము. ధర్మజ్ఞుడైన ధర్మరాజునకును ఘోరమైన దుఃఖానుభవానంతరముననె శాంతిపర్వానుభవావసరములు సాధ్యములైనవి. సంగ్రామజ్వరపీడాపరమైన ప్రపంచమునందు వర్తమానకాలమునందును యుద్ధపర్వముగలుగకను శాంతి

పర్వము సాధ్యము గాదని ప్రపంచవ్యవహారములు విస్పష్టము చేయుచున్నవి. గాంధిమహాత్ముని శాంతిసందేశము చెవిటివానికి శంఖారవమువలె నున్నది. సామ్రాజ్యాభిమాన పరాయణులైన కన్సర్వేటివు పక్షమును వలె నితరపక్షములను సంగ్రామజ్వరము పీడించుచున్నది. ప్రపంచావృతమైన సంగ్రామ సంస్కార ముపశమించి శాంతి సంస్కారము సంస్థాపనమగుట కపారమైన దుఃఖానుభవము ప్రాచీనకాలమునందువలెను వర్తమాన కాలమునందును నత్యంతావసరముగ నున్నది. ప్రపంచావృతమైన సంగ్రామతాపము శాంతి వాతావరణము నావరించి శాంతికాంతుల నాచ్ఛాదనము చేసినది. శాంతిసంస్కారమున కభ్యస్తమైన ప్రాచ్యదేశములందు సంగ్రామ సంస్కారమునకు గల ప్రతిష్ఠ శాంతిసంస్కారమునకు గలుగకున్నది.

జపాను చీనా రాజ్యముల నావరించిన సంగ్రామ జ్వరమును, భరత వర్షము నావరించిన దౌర్జన్య సంస్కారమును పాశ్చాత్య సంస్కార జన్యమైన సంగ్రామ సంస్కారమునకు సహజఫలము లని ప్రపంచ వ్యవహారములు వ్యక్తము చేయుచున్నవి. ప్రపంచావృతమైన విషమావస్థయందు గాంధి మహాత్ముని శాంతిరాయబారము సఫలము గాకుండుటయును సహజము. రౌండుటేబిలు సమావేశమునందు రెండవయంకము ముగిసినది. గాంధిరాయబార మంతము నొందినది. ఉద్యోగపర్వ మంతమును పొందినది. గాంధి మహాత్ముడు ప్రధానమంత్రి రామ్సెమాక్డొనాల్డుగారికి స్వస్తివాచకములను జెప్పుచు భిన్నమార్గముల పరమార్థమును వ్యక్తము చేసెను. ఉద్యోగపర్వము ముగిసినను తిరిగి అరణ్యపర్వము రాగలదో, యుద్ధ శాంతి పర్వములు రాగలవో దురూహ్యములు. గాంధి మహాత్ముని ప్రసంగములు వనపర్వావసరమును విశదము చేయుచున్నవి. భారతీయులు వనవాసాజ్ఞాతవాసముల ననుభవింపవలసిన సుముహూర్త మాసన్నము గాగల విధమును ప్రభుత్వాధికారుల నిర్బంధవిధానము విస్పష్టము చేయుచున్నది.

* * * *

## అరణ్యపర్వము - యుద్ధపర్వము

ఉద్యోగపర్వానంతరము తిరిగి వనవాస పర్వము ప్రవృత్తియం దసాధ్యము. సంగ్రామము శాంతిసమరమైనను, భౌతికబలసంగ్రామమైనను సంగ్రామఫలమైన మహాదుఃఖానుభవ మనతిక్రమణీయము. ప్రవృత్తియందు హింసాహింసలకు సరిహద్దులను నిర్ణయించుట యసాధ్యము. శాంతియుతమైన స్వరాజ్య సంరంభమునందును దౌర్జన్యకార్యములు సంభవించుట ప్రకృతిసిద్ధము. మానవకోటికి హింసాత్మకమైన పశుబలమునందు గల సంస్కార విశ్వాసము లహింసాత్మకమైన ఆత్మబలమునందు గలుగకున్నవి. ప్రపంచమునందు భోగమునకు గల ప్రతిష్ఠ త్యాగమునకు గలుగకున్నది. రౌండుటేబిలు సమావేశమునందలి రెండవయంకప్రదర్శనము పండితులకు సయితము భాగ్యభోగాధికారారాధనమునందు గల

గాధాభిలాష సత్య శాంతి ధర్మారాధనము నందు లేదని విశదము చేసినది. సంస్థానాధీశులు, మహమ్మదీయులు, నిమ్నజాతుల ప్రతినిధులు, సంఘాభిమానుల్కు, వ్యక్తులు వారి లక్ష్యమును భారతసౌభాగ్యమునందు గాకను ప్రత్యేక ప్రయోజనములందు లగ్నము చేసి గాంధిమహాత్ముని శాంతిలక్ష్యమును, పూర్ణ స్వరాజ్యలక్ష్యమును నిరర్థకముచేసిరి. బ్రిటీషు రాజనీతిజ్ఞుల కీవిభేదములు గాంధిమహాత్ముని ధర్మలక్ష్యమును నిరర్థకము చేయుటకు వినియోగపడినవి.

ప్రపంచవ్యవహారములందు బాహ్యాంతరార్థములకు సామాన్యముగ భేదము గన్పట్టుచుండును. రాజకీయవిషయములందు బాహ్యాంతరార్థములకు సంబంధమె కనుపడదు. ప్రపంచవ్యాప్తమైన సామ్రాజ్యమును నిర్వహించెడి బ్రిటీషు రాజనీతిజ్ఞుల ప్రతిజ్ఞలందును, ప్రకటనలందును బాహ్యాంతరార్థ నిర్ణయమును చేయవలసిన యవసరమే కనుపడదు. ప్రధానమంత్రి రామ్సె మాక్డొనాల్డుగారు రౌండు టేబిలు సమావేశమునందు జేసిన ప్రసంగమును పార్లమెంటునందు జేసిన ప్రసంగమును, ప్రతిపాదనములును బ్రిటీషు రాజ్యనీతివిజయమును ప్రకటించుచున్నవి. ప్రకటనలకును, కార్యములకును గల సంబంధమును కాలము తెలుపవలసియున్నది. రామ్సె మాక్డొనాల్డుగారు రౌండుటేబిలు సమావేశమునందును, పార్లమెంటునందును గంభీరోపన్యాసమును జేసి రౌండుటేబిలు సభాసభ్యులకును, పార్లమెంటు సభ్యులకును సమ్మోహమును గలుగజేసిరి. లేబరుపక్షకవచమును విడిచి కన్సర్వేటివుపక్షకవచమును స్వీకరించి భారతరాజ్యాంగముల పట్ల రెండు పక్షముల లక్ష్యమును సమన్వయము చేసిన రామ్సె మాక్డొనాల్డుగారి రాజనీతి బ్రిటీషు రాజ్యనీతికి పరమ ప్రమాణముగ నున్నది. పార్లమెంటునందు భిన్నపక్షనాయకులు చేసిన యుపన్యాసములును, సంగీకృతమైన తీర్మానమును నీ గూఢార్థమునే ప్రతిపాదించుచున్నవి.

* * * *

పార్లమెంటు నిర్ణయము

ప్రధానమంత్రి పార్లమెంటు నందు ప్రతిపాదించిన తీర్మానమున కవ్యక్తమైన దైవము నకువలెను ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మహాభాష్యములను వ్రాయవచ్చును.

"భారతదేశమునకు బ్రిటనుదొరతనమువారు నిర్ణయించినపద్ధతిని ఈసభవా రామోదించుచున్నారు."

దీని అంతరార్థమును బ్రిటీషుప్రభుత్వము పార్లమెంటుసభయందు జేసిన ప్రకటనము విశదము చేయుచున్నది. ఆప్రకటనమునందలి సారాంశములు :—

(1) అఖిలభారత ఫెడరేషను సిద్ధాంతమును ప్రభుత్వమువారు అంగీకరించుచున్నారు. (2) సైనిక విషయములను విదేశములతో సంబంధములను రిజర్వుడు శాఖలుగనుంచి ఆర్థికవ్యక్తక విషయములందు సంరక్షణల చేర్పరచి కేంద్ర ప్రభుత్వమున శాసనసభ పట్ల బాధ్యత గలుగజేయవలయు నను సిద్ధాంతమును ప్రభుత్వమువారు అం

చేయుచున్నవి. కాంగ్రెసు అధ్యక్షులు సర్దారు వల్లభభాయిపటేలుగారీవిషయమును విస్పష్టము చేయుచున్నారు. ఆంధ్రదేశమునందు రయితుల యాందోళనము సందర్భమునందు శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయ్య, మాగంటి బాపినీడు, ఆచార్య రంగనాయకులు గారులు నిర్బంధముల ననుభవించుచున్నారు. ఇంకెందరో నిర్బంధింపబడుటకు సిద్ధము చేయబడుచున్నారు. దేశమునందన్నిప్రాంతములందును నిర్బంధప్రస్థానము క్రమముగను వ్యాపకమును బొందుచున్నది. రాజప్రతినిధి వంగరాష్ట్రమునందు వ్యాపకముచేసిన నవీన నిర్బంధాయుధము, సర్వస్వాతంత్ర్యసంభారము పరమసంతాపమును గలుగజేయుచున్నది. బ్రిటీషుప్రభుత్వము ప్రకటించిన తియ్యనిమాటలకు ఫలము దేవునకెఱుక! వారవలంబించుచున్న తీవ్రనిర్బంధముల ప్రయోగము మాత్రము హృదయశల్యముగ నున్నది.

భారతీయ స్వరాజ్య సంరంభమునందు బీభత్సరంగారంభమును ప్రభుత్వవ్యవహారములనేక ముఖములను తెలుపుచున్నవి. గాంధి మహాత్ముడు నిర్బంధవిధానము విషయమై ప్రధాన మంత్రితోను, భారతమంత్రితోను, సహాయమంత్రితోను డిసంబరు 5 వ తేదిని సంప్రతించియుండిరి. పర్యవసానము ప్రయోజనరహితమని వేరుగను వ్యాఖ్యానముచేయవలసిన యవసరము గనుపడదు. ఒకచేతను నిర్బంధములును, రెండవచేతను సముచిత సంస్కరణ విధానమును బ్రిటీషురాజ్యాంగమునకు లక్షణమని ఆబాలగోపాలము తెలిసిన విషయము. కన్సర్వేటివుపక్షసభ్యులు 500మంది గల ప్రభుత్వమునందు సహజమైన నిర్బంధవిధానమెంత తీవ్రరూపమును దాల్చునదియును దురూహముగ నున్నది. ఈసందర్భములందు భారతీయులందరును భేదలక్ష్యములను విసర్జించి గాంధి మహాత్మునివలెనే సకల సందర్భములందును కాంగ్రెసు ప్రతిపాదించిన స్వాతంత్ర్య లక్ష్యమును, సత్యాగ్రహలక్ష్యమును నారాధించుచు బీభత్సరంగమునందును శాంతిరంగమును పరిస్ఫుటముచేసి కామితార్థములను బడయుటకు భగవదనుగ్రహమునకు పాత్రులగుదురుగాక!

ప్రపంచావృతమైన మహాసంక్షోభము శాంతి సంరక్షణావసరము ననంతముఖములను వ్యక్తము చేయుచున్నది. ఇతరులేమార్గము నవలంబించినను గాంధిమహాత్ముని నాయకత్వము, కాంగ్రెసు నిర్ణయములు భారతీయుల కర్తవ్యమును సువ్యక్తము చేయుచున్నవి. లాయడుజార్జిగారు బొంబయియందు దెలిపినట్లు మూడవ అంకమునందైనను భారతీయ స్వాతంత్ర్యనాటకము శాంతిమార్గమునను నంతమును బొందుటకు భగవదనుగ్రహము గలుగుగాక!

* * *

ఆంధ్రులు - భావికర్తవ్యము

వర్తమాన సందిగ్ధసమయమునందాంధ్రుల కర్తవ్యము సంభ్రమమును గలుగజేయుచున్నది. నిర్బంధానంతరము సంప్రాప్తమైన స్వేచ్ఛానుగమనము కాంగ్రెసు బలప్రతిష్ఠలను

నడలించినది. కాంగ్రెసు సంస్థలందును, స్థానిక సంస్థలందును, నిత్యవ్యవహారములందును కాంగ్రెసువారి బలసంయోగములు శిథిలములై నిరవలంబన యోగము ప్రబలినది. రయితుల విషాదయోగము కాంగ్రెసు పక్షము వారి లక్ష్యమును రయితుల యాందోళనమునందు లగ్నము చేయుచున్నది. అధికార కాంక్షుల లక్ష్యము స్థానిక సంస్థలందు లగ్నమగుచున్నది. సామాన్య ప్రజాలక్ష్యము నిస్సహాయస్థితినిబూనుచున్నది. అధికారుల కీతరుణమున వారి నిర్బంధ విధాన వ్యాపనమున కనుకూలముగనున్నది.

గాంధిమహాత్ముడు రౌండు టేబిలుసమావేశమునందు సహకారవిధానము నవలంబించుచున్నను ఆంధ్ర దేశమునందు ౧౦౭, ౧౦౮, ౧౪౪, ౧౨౪ శాసనముల క్రిందను నిర్బంధవిధానము వ్యాపకమును గాంచుచున్నది. తిరుత్తని, చీరాల, ధర్మవరము, కాలహస్తి, ఏలూరు, కుప్పము, కర్నూలు, విజయనగరము మొదలగు ప్రదేశములందు పికెటింగు సందర్భములం దధికారు లవలంబించిన నిర్బంధవిధానము ప్రభుత్వహృదయమును విశదము చేయుచున్నది. గవర్నరు వారు రయితుల రాయబారమునకు చూపిన నిర్లక్ష్యమును, సర్దారు దండునారాయణరాజు గారిపట్ల చూపిన యవినయమును ప్రభుత్వహృదయమునందు ప్రవర్ధమానంబగుచున్న నిర్లక్ష్యమును, నిరంకుశస్వభావమును స్పష్టము చేయుచున్నవి. గాంధిమహాత్ముడు డిసంబరుమాసాంతమునందు భరతవర్షమును చేరునటుల వార్తలు తెలుపుచున్నవి. ఆంధ్రులందరును వెంటనే కాంగ్రెసుసంస్థలను బలపరచి కాంగ్రెసుప్రతిష్ఠను గాపాడుదురుగాత!

ఆంధ్ర దేశమునందు నిర్మాణకార్యవిధాన మనేకవిధముల వ్యాపకమును గాంచవలసి యున్న విధము నాంధ్రోద్యమసమస్య బహుభంగులను విశదము చేయుచున్నది. రయితులకు పరపతి లేదు. ప్రజలకు పని పాటలు లేవు. విద్యావ్యాపనమున కవకాశములు లేవు. వ్యాపారపరిశ్రమాభ్యుదయములకు సాధనసంపదలు లేవు. సర్ విశ్వేశ్వరయ్యగా రాంధ్ర స్నాతకులకు పట్టప్రదానోత్సవ సందర్భమునందు జేసిన యుపదేశము దేశదౌర్భాగ్యస్థితిని, నిర్మాణకార్యవిధానావసరమును వ్యక్తము చేయుచున్నది. ఆంధ్రాభ్యుదయము విశేషముగను ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము మీద నాధారపడి యున్నది. శ్రీయుతులు బొబ్బిలిరాజాగారును, వరాహగిరి వెంకటగిరి గారును, ఇతరాంధ్ర ప్రముఖులును ప్రత్యేకాంధ్రనిర్మాణావసరమును వ్యక్తము చేయుచు హిందూదేశమంత్రికిని రౌండుటేబిలుసభకును పంపిన విన్నపము సమయానుకూలముగనున్నది. రాజ్యాంగసంస్కరణము లేని ఆంధ్రరాష్ట్రము నిరర్థకమైనను ఉత్కళ రాష్ట్ర నిర్మాణవిషయమై విచారణ జరుగుచున్న సమయమునం దాంధ్రరాష్ట్ర నిర్మాణవిచారణకును పూనుట సకల విధములను శ్రేయస్కరము. ఆంధ్రు లందరును నీవిషయమునందును, నితర విషయములందును భేదాభిప్రాయములను విడిచి కర్మయోగపరాయణులై కామితార్థములను సాధించుటకు పూనుకొనియెదరు గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St., Madras